రామారావు సంపత్కుమార

# వచన పద్యం

## లక్షణ చర్చ

నాయని ఎనభయ్యో పుట్టినరోజు

# ఒకే లక్ష్యం : రెండు మార్గాలు

వచనపద్య లక్షణాలను గురించి ఇద్దరు పరిశోధకులు వాదవివాదాలుగా చేసిన అన్వేషణ ఇది. ఈ అన్వేషణలో ఛందోమూలతత్త్వ పరిశీలన కూడా విశేషంగా జరగటం వలన కేవలం వచన పద్యాభిమానులకే కాక ఛందస్తత్త్వ పరిశీలకులకు కూడా యీ చర్చ ఆసక్తికరంగా ఉంటుందని భావిస్తున్నాం.

విషయానికి మాత్రమే పరిమితమయి జరిగే చర్చలు అచ్చుయంత్రం వచ్చింతరువాత అరుదయి పోయినట్టు కనిపిస్తుంది. చర్చల్లో ఆవేశాలకు లోనయ్యే అవకాశాలే ఎక్కువేమో! అవతలివాడిని కించపరచాలనే ప్రలోభానికి లొంగిపోయే ప్రమాదం కూడా ఇట్లాంటి చర్చల్లో ఎక్కువగానే ఉంటుంది. అయితే, ఆరికమైన చాపల్యాలకు లోనుకాకుండా, తత్త్వాన్వేషణే ధ్యేయంగా వాదించుకొనేవారు పరస్పరం గౌరవించుకుంటూ చేసిన కొద్దిపాటి చర్చల్లో మా యీచర్చకు ప్రాధాన్యముంటుందని విశ్వసిస్తున్నాం.

ఈ ఇద్దరు పరిశోధకుల్లో-ఒకరు ఛందశ్శాస్త్రంలో, మరొకరు భాషాశాస్త్రంలో విశేషమయిన కృషి చేసినవారు. ఇద్దరికీ రెండింటిని గురించి తమకు తెలిసిందే కాక, ఇంకా తెలుసుకోవాలనే కోరికా, అణకువా ఉన్నాయి.

సాంప్రదాయికచ్ఛందశ్శాస్త్ర పరిశోధన చేస్తున్న సంపత్కుమార ఆధునిక లిఖితసాహిత్య రంగాన అధిక ప్రసారంలో ఉన్న 'వచనపద్య' లక్షణాలను నిర్వచించే ప్రయత్నం చేస్తే, భాషాశాస్త్రంలో పరిశోధన చేస్తున్న రామారావు ఆకోణం నుంచి వచనపద్యానికి ప్రతిపాదింపబడ్డ లక్షణాలనూ, సాంప్రదాయిక ఛ్ఛందశ్శాస్త్రాన్నీ పరిశీలిస్తున్నాడు. మాయీ మార్గాల్లోని భిన్నత్వం చర్చకు గుణాన్నే సమకూర్చినట్టు భావిస్తున్నాం. మేమింకా ఒక అంగీకారానికి రానిమాట నిజమే. ఇట్లాంటి విషయాల్లో అంగీకారానికి రావటం అంత సులభంగా సాధ్యం కాదేమోకూడా. భేదించే అంశాలు కాస్త ఎక్కువగానే ఉన్నట్టు

మొదట్లో గుర్తించాం. అయితే, చివరి చివరి వ్యాసాల్లో ఒప్పుదలకు వచ్చిన అంశాల సంఖ్య పెరగటం నిశితబుద్ధులయిన సహృదయులు గమనించగలరు.

వచన పద్యానికి, గద్యానికి భేదం లేదని మొదటి వ్యాసంలో రామారావన్నాడు కాని, తరువాతి వ్యాసాల్లో ఆమాటనంత గట్టిగా అనటం లేదు. రామారావు ప్రతిపాదించిన అంతర్లయ, బాహ్యపరిమితి అనే పద్యపాద లక్షణాలను ఇప్పుడు సంపత్కుమార మొదట్లో వలె గట్టిగా కాదనటం లేదు. అవతలివారి వాదంలో నిజం ఉందేమో నన్న స్పృహ ఇద్దరికీ ఉంది. కనీసం ఇప్పుడిప్పుడు కలుగున్నది.

పద్యనిర్మాణంలో ధ్వనులూ, వాటి సంయోజన క్రమమూ ప్రధానపాత్ర వహిస్తాయి ఇది వృత్త, జాతి, మాత్రాపద్యాల కున్న సమాన ధర్మం. వచన పద్య నిర్మాణానికి ధ్వనుల సంబంధం అత్యల్పమని, లక్షణ నిర్వచనానికి అవి పనికిరావని ఇద్దరమూ ఒప్పు కుంటాం. అంతేకాదు, వచనపద్య తత్త్వాన్వేషణ ధ్వనీతర మార్గాల్లో జరగాలని కూడా మా అభిప్రాయం. అయితే ఈ అన్వేషణకు భావ - భావాంశాలు సహాయకారులని సంపత్కుమార మతం. భావగణ ప్రతి పాదనకు మూలం ఇదే. మరి భావ వ్యక్తీకరణ భాషలో వాక్యాల ద్వారా జరుగుతుంది కాబట్టి, భావం ఒకటే అయినా వ్యక్తీకరణ భేదాల్ని బట్టి వాక్యభేదాలుంటాయి కాబట్టి, వాక్య నిర్మాణ-ప్రయోగరీతులు ఆధారంగాపరిశోధన సాగాలని రామారావు మతం. ఇట్లామత భేదాలతో సాగినచర్చలో తీగెలాగితే డొంకంతా కదిలింది. ఛందోవ్యాకరణ భాషా సాహిత్యాలకు సంబంధించిన ఎన్నో విషయాలు ప్రస్తావనకు వచ్చినయి. అసలు విషయాన్ని దాటి కాస్తకాస్త దూరం పోయినట్టు అక్కడక్కడ అనిపించినా, విషయ విశదీకరణ కీ ప్రస్తావనలు ఉపయోగ పడుతున్నాయనే అనుకుంటున్నాం.

మా మార్గాలు వేరైనా, మా లక్ష్యం ఒక్కటే. ఆధునికంగా లిఖిత కవితా రూపంగా అవతరించిన వచన పద్య స్వరూప నిరూపణే ఆ లక్ష్యం. అదే మమ్మల్ని ఒక చర్చావేదిక మీదికి చేర్చింది. ఒక పుస్తకానికి కర్తలుగా కూర్చింది.

ఈ పుస్తక ప్రచురణ మా తత్త్వాన్వేషణకు సమాప్తి కాదు. మా అన్వేషణ మా మా మార్గాల్లో ఇంకా సాగుతూనే ఉంటుంది. అయితే, భిన్నభిన్న మార్గాల్లో ఇట్లాంటి కృషినే ఇంకా చేస్తున్న పరిశోధకులకు మా యీ కృషి వెతుక్కోకుండా ఒకే చోట దొరికి ఉపయోగిస్తుందనే ఉద్దేశ్యంతో మా చర్చా వ్యాసాలను ఈ పుస్తకంగా కూర్చాం.

తత్త్వ నిరూపణ ధ్యేయమైన పరిశోధకులు ఈ వ్యాసాల్లో వ్యక్తమయిన అంశాలను నిశితంగా పరిశీలిస్తారని ఆశిస్తున్నాం.

ఆంధ్రపత్రిక (ఉగాదిసంచిక) లో మొదలై 'భారతి'లో సాగిన ఈ వ్యాసాలను ఇట్లా ఒక పుస్తకంగా అచ్చువేస్తే బాగుంటుందని చాలా కాలంగా సూచనలు వస్తూనే ఉన్నాయి. కాని, అచ్చువేసే స్తోమతలేక ఆ సూచనల నంతగా పట్టించుకోలేదు. కాని, మా చర్చను తమ పత్రికల్లో సాగించి, పలువురు ఆకృష్టులయి ఈ విషయాలను గూర్చి గాఢంగా ఆలోచించే అవకాశం కల్పించిన ఆంధ్రపత్రిక-భారతి సంపాదకులను గూర్చి మా మనస్సులు కృతజ్ఞతా భరితాలయినాయి.

అయితే ఇన్నాళ్ల తరవాత ఈ నాటికి నాగార్జున ప్రింటర్సు అధిపతి నిమ్మగడ్డ వెంకట నారాయణ గారి ప్రయత్నం వల్ల ఈ వ్యాసాలను పుస్తకంగా తీసుకురావటం సాధ్యమయింది. మా మీద చనువు కొద్దీ పుస్తకం వెయ్యాలండంటూ మమ్మల్ని వెంటబడి తరమటమే కాక తానే ఈ బాధ్యత తీసుకొని ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకుల కందించారు. భాషా సాహిత్యాల మీద ఆయనకున్న ప్రేమాభిమానాలే వారిచేత ఈ పని చేయించినయి. ఇదంతా ఆయన స్వభావానికనుగుణమయినదేగనుక ఆయనకు ప్రత్యేకంగా అచ్చులో మేం కృతజ్ఞతలు చెప్పటం లేదు.

| | |
|---|---|
| కోవెల సంపత్కుమారాచార్య | చేకూరి రామారావు |
| వరంగల్లు | హైదరాబాదు. |

# నాయని సుబ్బారావుగారు

గత శతాబ్దం చివర్లో, వికారి ఆశ్వయుజ బహుళదశమి (1899 అక్టోబరు 29) నాడు జన్మించి తమ 79 సం||ల జీవితంలో వేదనామయ కవితా ప్రస్థానంలో సౌభద్రుని ప్రణయయాత్ర, మాతృగీతాలు, భాగ్యనగర కోకిల, వేదనా వాసుదేవము, విషాదమోహనము, జన్మభూమి అనే సత్కృతులను సహృదయులైన తెలుగు కవితాభిమానులకు అందించి కాళయుక్తి ఆషాఢ శుక్ల తృతీయ దినాన (1978 జులై 8) శాశ్వతంగా కన్ను మూశారు. వారి వ్యక్తిత్వం మీద మాకున్న గౌరవాన్ని, వారి కవిత్వంమీద మాకున్న ప్రేమను పురస్కరించుకొని వారు మా పయి చూపిన ప్రేమాభిమానాలను స్మరించుకుంటూ ఆ స్మృతి చిహ్నంగా వారి ఈ ఎనభయ్యో జన్మదినాన ఈ పుస్తకాన్ని ఆంధ్ర పాఠకులకు అందిస్తున్నాం.

రామారావు　　　　　　సంపత్కుమార

# రచయితల గురించి

చేకూరి రామారావు జన్మించిన ఇల్లిందలపాడు అనే పల్లెటూరు ఖమ్మం జిల్లా, మధిర తాలూకాలో ఉంది. భారతమ్మ-లింగయ్యలు తల్లిదండ్రులు. పుట్టినరోజు ఎవరూ రాసిపెట్టి ఉంచలేదు. కాని, నోటిమాటగా యువ (1935) ఆషాఢస్య ప్రథమదివసే.'

నాయని సుబ్బారావుగారు హెడ్మాస్టర్‌గా పనిచేస్తున్నప్పుడు నరసరావుపేట మునిసిపల్ హైస్కూల్లో విద్యాభ్యాసం. హైదరాబాదు నిజాంకాలేజిలో చదువు తరువాత ఆంధ్రయూనివర్సిటీలో B A ఆనర్సు 1961 లో పూర్తిచేసి నిస్సాన్సిస్, కార్నెల్ యూనివర్సిటీకి భాషాశాస్త్రిగా వెళ్ళాడు. 1965 లో M.A. డిగ్రీతోపాటు, A Transformational Study of Telugu Nominals' నే అంశంపై చేసిన పరిశోధనకు 1968 లో Ph.D. డిగ్రీ తెచ్చుకున్నాడు.

భారతప్రభుత్వ సాంస్కృతిక శాఖవారి కోరికపై 1969 లో సంక్షిప్త తెలుగు వ్యాకరణం ఒకటి ఇంగ్లీషులో రాసి యిచ్చాడు. వారు ప్రచురించబోయే ద్రావిడభాషా వ్యాకరణాల సంపుటంలో అచ్చుకావల్సి ఉంది. 1975 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, 'తెలుగువాక్యం' ప్రచురించింది.

ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ పత్రికల్లో వచ్చిన భాషా, ఛందస్సాహిత్య విమర్శవ్యాసాలు రెండు మూడు సంపుటాలయ్యే వీలుంది. పత్రికల్లో అచ్చయిన పద్యాలూ, గేయాలూ సంకలితం కాలేదు.

ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం, భాషాశాస్త్ర విభాగంలో ప్రొఫెసర్.

నివాసం : OUB/L-20 ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్, హైదరాబాదు-500007.

# రచయితల గురించి

కోవెల సంపత్కుమారాచార్య (సంపత్కుమార) జననం వరంగల్లులో శ్రీముఖ ఆషాఢ శుక్ల చతుర్థి, 1933 జూన్ 26 నాడు. తల్లిదండ్రులు చూడమాంబా రంగాచార్యులు. మొదట తండ్రిగారివద్ద సంస్కృత విద్యాభ్యాసం. ఆ తరువాత చిట్టిగూడూరు (బందరు) ప్రాచ్యకళాశాల నుండి 1953లో 'భాషాప్రవీణగా' బయటపడ్డాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి తెలుగులోనూ (1963), హిందీలోనూ (1966) ఎం. ఏ. డిగ్రీలు తెచ్చుకున్నాడు. 'తెలుగులో ఆధునిక సాహిత్య విమర్శ : సంప్రదాయము' గూర్చి చేసిన పరిశోధనకు 1978లో కాకతీయ విశ్వవిద్యాలయం డాక్టరేట్ డిగ్రీ ఇచ్చింది. ఆ విశ్వవిద్యాలయంలో తొలి డాక్టరేట్ డిగ్రీ ఇదే.

లక్షణ దీపిక (1960), తెలుగు ఛందో వికాసము (1962), మధుర గాథలు (1967), మన కవులు - పండితులు - రచయితలు (1970) ఈ రచయిత ఇతర గ్రంథాలు.

ఈయన పరిష్కరించి విపుల పీఠికలు రచించిన 'లక్షణ సార సంగ్రహము' (కూచిమంచి తిమ్మకవి), 'సుకవి మనోరంజనము (కూచిమంచి వెంకటరాయడు) అనే లక్షణ గ్రంథాలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1971, 1976 ల్లో ప్రచురించింది. 'తెలుగు ఛందః పదకోశము' అనే నిఘంటువును తెలుగు అకాడమి 1977లో వెలువరించింది.

వివిధ పత్రికల్లో వచ్చిన సాహిత్య వ్యాసాలు అసంకలితంగా ఒక అరవై దాకా ఉండవచ్చు. అల్లాగే అసంకలిత పద్య, గేయ, వచనపద్యరచనలు ఒక నూరుదాకా ఉండవచ్చు.

ప్రస్తుతం కుంతకుని కావ్యసిద్ధాంతం గూర్చి, రాజశేఖరుని కావ్యమీమాంసగూర్చి, తెలుగులో సమాసకల్పన మీదా కృషి.

హనుమకొండ - 506001, ప్రభుత్వ డిగ్రీ కళాశాల (తెలుగు విభాగం) లో అధ్యాపక వృత్తి.

నివాసం : 15-729/1 రామన్నపేట, వరంగల్లు-506002.

# వ్యాస క్రమం



## అనుబంధాలు

# వచన పద్యం :

## ఆభాస లక్షణ నిరాకరణం

—చేకూరి రామారావు

ఆటీవల వస్తున్న ఒక రకం కవితా స్వరూపానికి వచన కవిత, వచనపద్యం ఇత్యాదిగా చాలా పేర్లు వాడుకలో ఉన్నై. దీని పేర్లను గురించి సంపత్కుమార (1968), నరసింహారెడ్డి (1968) విశేషమైన చర్చచేశారు నరసింహారెడ్డి వచన కవిత్వం అనే పేరును, సంపత్కుమార వచనపద్యం అనే పేరును ఎన్నికచేశారు. నరసింహారెడ్డి మొత్తం 15 పేర్లను పేర్కొన్నారు. వీటిని రెండు గ్రూపులుగా విభజించవచ్చు. మొదటి తరగతి వచన అనే పూర్వపదంతో ఉన్న సమస్త పదాలు అవి : 1. వచనకవిత, 2. వచనపద్యం, 3 వచనగేయం, 4 వచనగీతం. ఇతరమైనవి రెండో తరగతి. అవి ముక్తచ్ఛందం (సోమసుందర్) స్వచ్ఛంద కవిత్వం (వరవరరావు) మొదలైనవి. వీటిలో మొదటిరకపు పేర్లే ఎక్కువ ప్రచారంలో ఉన్నై. మొదటి తరగతిలోఉన్న నాలుగు పేర్లమధ్యా చెప్పుకోదగిన భేదం లేదు. పద్యం, గేయం, గీతం అనేవి కవిత్వానికి పర్యాయ పదాలుగానే పై పేర్లలో ప్రయుక్తమయినై. వచనగేయం, వచనగీతం అని శ్రీరంగం శ్రీనివాసరావు, కుందుర్తి ఆంజనేయులు వాడారు. వచనపద్యం అనే పేరు మొదట పట్టాభిరామిరెడ్డి (పఠాభి), తరువాత సంపత్కుమార వాడారు. వచన కవిత అనే పేరు కుందుర్తి ఆంజనేయులు, టి. వి. రమణారెడ్డి, కోవెల సుప్రసన్నాచార్య మొదలైనవారు వాడుతున్నారు. ఈపేరే ఎక్కువ ప్రచారంలో ఉన్నట్టు సంపత్కుమార (1968), నరసింహారెడ్డి (1968) ఇద్దరూ పేర్కొన్నారు. శ్రీవత్స ఘంటువారు కూడా ఈ పేరే ఎన్నిక చేశారు. (ఆంజనేయులు, గోపాలచక్రవర్తి (1967). అయినప్పటికీ ఈ వ్యాసంలో – వచనకవిత అనే పేరు అప్పుడప్పుడు వా... పద్యం అనే పేరే స్వీకరిస్తున్నాను. దానికి కారణా... పద్యం అనే పేరు verse కి సమానార్థకంగా తెలుగులో ...తున్నారు. 2. వృత్తాలు, జాతులు, ఉపజాతులు, రగడలు – ఇవన్నీ ...ద్యాలుగా...

ప్రాచీనులు పరిగణించారు. శ్రీ. సంపత్కుమార ఒక్కరే ఈ కవితా స్వరూపానికి లక్షణాలు చెప్పటానికి సీరియస్‌గా ప్రయత్నించారు. ఆయన అభిప్రాయాల్ని ప్రధానంగా విమర్శనాత్మకంగా ప్రస్తావించ దల్చుకున్నాను గనుక ఆయనకు నచ్చినట్టే లక్షణాలు చెప్పబడలేదు అనుకొన్నాను.

అసలు లక్షణాలను నిర్ణయించవలసిన అవసరం లేదనేవాళ్లు కూడా ఉండటానికి ఒక విషయం స్పష్టంగా చెప్పుకోవాలి. నరసింహశాస్త్రి (1971) ఇటీవల భారతిలో – "వచనకవిత–అభిమానుల అత్యుక్తులు" అనే పేరుతో ఒక వ్యాసం రాశారు. అందులో ఆయన వచనపద్య స్వరూపాన్నే కాక అందులో వస్తున్న కవిత్వాన్ని కూడా వ్యతిరేకిస్తున్నట్టు తెలుస్తుంది. వచనపద్య తత్వనిరూపణ ఇక్కడ ముఖ్యంగా జరగలేదు. ప్రాచీన ఛందః పద్ధతిని సమర్థించటమూ, ఆధునిక పద్ధతిని వ్యతిరేకించటమూ, ఆయన అక్కడ పెట్టుకున్న ప్రధాన లక్ష్యాలుగా కనిపిస్తున్నాయి. వారు వచనపద్య స్వరూపం మీదగాని ఆ రూపంలో వస్తున్న కవిత్వంమీద గాని వ్యతిరేకత లేదు. కవిత్వం ఏ తొడుగు వేసుకున్నా సారం కవిత్వంతరం లేదు. ఒక్కో తొడుక్కి ఒక్కో ప్రయోజనం ఉండవచ్చు. ఆ ప్రయోజనాల్లో ఒకానొకటి వారు గుర్తించవచ్చు. అది వేరే విషయం. ప్రస్తుత పరిశీలన ఛందస్స్వరూపానికి మాత్రమే పరిమితం.

ఈ వ్యాసంలో నేను ప్రస్తావించని విషయాలు చాలా ఉన్నాయి. వచనపద్యం చారిత్రక పరిణామాన్ని గురించి విమర్శకుల్లో చాలా అభిప్రాయాలున్నాయి. కొందరు దీనికి సమాజ పరిణామంతో ఉన్న సంబంధాన్ని నిరూపించటానికి ప్రయత్నించారు. దాన్ని గురించి ఈ వ్యాసంలో ప్రస్తావించను.

వచన గేయం ఒక ఉద్యమమని కుందుర్తి ఆంజనేయులు (నవత-2) ప్రకటించారు. ఈ విషయంలో నేను రమణారెడ్డి (1967)తో ఏకీభవిస్తాను. అయినా అందుకు కారణాలు ఈ వ్యాసంలో ప్రస్తావించను

వచన పద్యంలో కథాకావ్యాలు రావాలని కుందుర్తి ఆంజనేయులు, శీలా వీర్రాజు, కోవెల సుప్రసన్నాచార్యులు వంటివారు

అభిప్రాయపడ్డారు. కీ॥ శే॥ బాలగంగాధర తిలక్ ఇందుకు వ్యతిరేకులు. ఈ విషయంలో నాది భిన్న విధానం.

ఈ వ్యాసంలో నేను చెయ్యదల్చుకున్నది వచన పద్యానికి లక్షణాలుగా చెప్పబడుతున్న వాటిని పరామర్శించటమే. ఈ లక్షణాలు కేవల అభ్యాస మాత్రాలేనని, అవి శాస్త్ర చర్చకు నిలవ్వని నా అభిప్రాయం. అందుకే వాటిని నిరాకరిస్తున్నాను. అది హేతుబద్ధంగా చెయ్యటమే ఈ వ్యాసంలో నేను చేసిన ప్రయత్నం.

వచన పద్యం తత్వాన్ని గురించి, చరిత్రను గురించి ఇటీవల (అంటే దాదాపు ఒక దశాబ్దకాలం) భారతి, ఆంధ్రప్రభ, సవత, స్రవంతి, జనధర్మ వంటి పత్రికల్లో విశేషమైన చర్చ జరిగింది. వాటిల్లో కుందుర్తి ఆంజనేయులు, కె. వి. రమణారెడ్డి, దేవరకొండ బాలగంగాధర తిలక్, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, కోవెల సంపత్కుమార, కోవెల సుప్రసన్నాచారి, వే. నరసింహారెడ్డి, అద్దేపల్లి రామమోహన రావు, వెంకట్రామ నరవరరావు, వేగుంట మోహనప్రసాద్, అవంత్స సోమసుందర్, టి. యల్. కాంతారావు, అరిపిరాల విశ్వం – ఇంకా అనేకులు పాల్గొన్నారు. వీటిలో కొన్నిటిని వచన కవిత అనే పేరుతో శ్రీవత్స ప్రచురణవారు కుందుర్తి ఆంజనేయులు, గోపాలచక్రవర్తి (1967) సంపాదకత్వాన ఒక సంకలనం వేశారు.

వచన పద్యం చాలామంది దృష్టిని ఆకర్షించింది. కొత్తకవులు దాదాపు అంతా వచన పద్యాల్లోనే రాస్తున్నారు. అంతేకాదు. పాత కాలపు కవులు కూడా ఈ పద్ధతిలో రాయడానికి ప్రయత్నించారు. (చూ. భాగవతుల శంకరశాస్త్రి (ఆరుద్ర) రాసిన సినీవాలికి కాటూరి వేంకటేశ్వరరావుగారి పీఠిక.) ప్రధానంగా కథలూ, నవలలూ రాసే రచయితలు వచన పద్యం ద్వారా కవులైనవారున్నారు. (స్పందన సాహితీవారు 1959 లో ప్రచురించిన 'స్పందన' అనే సంకలనంలో వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'అన్వేషణ' అనే ఖండిక ఉంది. పోతుకూచి సాంబశివరావు వచన పద్యాలు 'రాసి నిరా' అనే పేరుతో 1968 లో ప్రచురితమయినై) ఆలిండియా రేడియో యువవాణి కార్యక్రమాల్లో కుర్రవాళ్ళు ఆవేశంతో వచన పద్యాలే చదువుతున్నారు. ఎన్నికల

ప్రచార కరపత్రాల్లోకి కూడా ఈ వచన పద్యం వ్యాపించింది. ఒక పదాది కిందట జరిగిన పార్లమెంటు ఎన్నికలకు పోటీచేసిన పి. వి. రంగారావు వచన పద్యంలో కరపత్రం వేశారు.

ఇంతగా ప్రచారంలో ఉన్న కవితా ప్రక్రియను గురించిన చర్చకూడా అంత విస్తారంగానే జరిగింది. చాలామంది వచన పద్యం అంటే ఏమిటో చెప్తూండానే దానిమీద పెద్దపెద్ద వ్యాసాలు రాశారు. కొంతమంది వచన కవిత్వాన్నిగురించి కవితామయ నిర్వచనాలిచ్చారు. కవిత్వాన్ని గురించి కవిత్వంలో చెప్పితే అది లక్షణం కాదు. స్పష్టంగా శాస్త్ర పరిభాషలో హేతుబద్ధంగా దాని లక్షణం చెప్పాలి. (అట్లాంటి ప్రయత్నం చేసింది నాకు తెలిసినంతవరకు ఒక్క సంపత్కుమార మాత్రమే. ఆయన లక్షణాల్ని నేను నిరాకరించటం, ఆయన ప్రయత్నాన్ని కించపరచటంగా అర్థం చేసుకోకూడదు) నేనీ ఆరోపణను నిరాధారంగా చెయ్యటం లేదు. మచ్చుకు ఈ వాక్యాలు గమనించండి.

'వచన గీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమనస్తై విధానం. ఇది సంభాషణలోని యాసలూ, కాకువులూ, ఉచ్చారణ విశేషాలమీద ఆధారపడి ఉంటుంది.'

—శ్రీరంగం శ్రీనివాసరావు (1939)

'వచన గేయం సమాజాన్ని గురించి సూటిగా చెబుతుంది. సమాజంమీద యీటెలుగా విరుచుకుపడుతుంది. సమాజంలో అనేక మందికి అర్థమవుతుంది ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠంచేస్తూ, ప్రజా హృదయాల్లోని విప్లవ దృక్పథాన్ని నిద్రలేపి సంపూర్ణ సాంఘిక వికాసానికి దోహదం చేస్తుంది.'

—అద్దేపల్లి రామమోహనరావు (1969)

ఇట్లాంటి వాక్యాలు చాలా వ్యాసాలనుంచి చూపించవచ్చు. చాలామంది వచన పద్యం ఎట్లా పుట్టిందో, ఎప్పుడు పుట్టిందో, ఏం చెయ్యగలదో చర్చించారేగాని దాని లక్షణాలేమిటో ఎవరూ చెప్పరు. వచన పద్య ప్రవక్తలు, సిద్ధాంతకర్తలుగా పత్రికల్లో కనిపిస్తున్న కుందుర్తి ఆంజనేయులు, అరిపిరాల విశ్వం, అద్దేపల్లి రామమోహన

రావు, కోవెల సుప్రసన్నాచారి, టి. ఎల్. కాంతారావు, మొదలయిన వారంతా వచన పద్యంమీద పెద్ద పెద్ద వ్యాసాలు రాసినవారే కాని వారి వ్యాసాల్లో వచన పద్యాలను గురించిన పొగడ్తలు తప్ప శాస్త్ర సంబంధిత అసలు కనబడదు. అయినా అక్కడక్కడ కొన్ని ఆ ఛాస లక్షణాల ప్రస్తావన కనిపిస్తుంది. వాటిని ఒక్కటొక్కటే పరామర్శించి ఖండిస్తాను.

తూగు, విసురు, ఊపు, విరుపు, లయ, భావలయ, అంతర్లయ, అంతరాన్నదం, భావగణాలు లక్షణాలలో కొందరు ప్రతిపాదించారు. వీటిలో తూగు, విసురు, ఊపు, విరుపు అనేవాటిని ఒక గణంగాను; లయ, భావలయ, అంతర్లయ, అంతర్నాదం, భావగణాలు అనేవాటిని ఇంకో గణంగాను వేరుచేసి పరిశీలిస్తాను. ముందుగా ఈ ప్రవచనాలు చూడండి.

'వచన గేయానికి మొట్టమొదటి లక్షణం నిరాడంబరత వచన గేయాన్ని కుంటుపడనీయకుండా ఆద్యంతం చదివేటట్లు చేయగల సొగసు, విసురు అలవరచటం ఛందోబద్ధమయిన పద్యరచనకంటే కష్ట మయిన పని— వచన గేయంలో ఒక్క ఉపమానాల విషయంలోనే కాదు. ఇతర సందర్భాల్లో కూడా ఈ విసురు ఒక ముఖ్య లక్షణంగా ప్రతిపాదిస్తున్నాను.'

—అంజనేయులు (1958)

'వచన గేయానికి ఒక స్థిరత్వం, ఒక నిమితత్వం ఏర్పడాలంటే పంక్తి నిర్మాణంలో ఒక తూగు కూడా అవసరం.

—అంజనేయులు (1967)

వదిలేసిన ఛందస్సుయొక్క 'ఇఫెక్ట్సు' మరోరూపంలో సాధించ బడుతున్నవి. ఆధునిక వచన గేయాల్లో విరుపూ, విసురూ, ధోరణీ, పలుకుబడి ఇందుకే పుట్టినవి.'

—అంజనేయులు (1965)

మహిషాసురుని మీసాలవలె
అస్పష్టోదయవాది ఆలోచన వలె

పై పద్యాల్లో సుక్కనిపించిన గుణం ఒక ఉపమేయానికి అనేక ఉపమానాలు వాడటం. ఇది మాలోపమ అవుతుంది. ఇదే విసురు అని ఆంజనేయులుగారి ఉద్దేశమా? ఇది వచన పద్యానికి మాత్రమే ఎందుకు పరిమితం? ఛందస్స్వాతంత్ర్యానికీ ఉపమాన బాహుళ్యానికీ ఉన్న అవినాభావ సంబంధమేమిటి? ఇంత అస్పష్టమైన, అసమగ్రమైన ప్రతిపాదనలు చెయ్యటానికి కారణం కవులైన వాళ్ళు సిద్ధాంతకర్తలు కూడా కావాలన్న ఉబలాటమే.

ఇక రెండో వర్గలక్షణాలు. మొదటి వర్గాన్ని కుందుర్తి ఆంజనేయులుగానీ, ఆయన అనుయాయులుగానీ పరిభాషగా ఉద్దేశించారని చెప్పలేం. సీరియస్‌గా చర్చించదగిన విలువ నిజానికి ప్రతిపాదనలకు లేదు. కాని రెండోవర్గంలో లయ, అంతర్లయ, అంతర్నాదం, భావగణాలు అనేవాటిని పరిభాషగా ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది. కొద్ది భేదాలతో ఇవన్నీ సమానార్థకాలుగా కనిపిస్తున్నై. కాని అంతర్లయ, అంతర్నాదం వేరు వేరని మాదిరాజు రంగారావు (1969) ఉద్దేశించినట్లు కింది వాక్యాలవల్ల తెలుస్తున్నది.

'అనుభూతి ప్రమాణంలో, ఆవేశపు పొంగులో మనోగతిని బట్టి, శబ్ద సంయోజనమూ, వాక్యరీతి, భావవిన్యాసమూ, రూపొందిన రచనలివి. ఇందులో ఏ ఛందస్సూ ఉద్దేశించలేను అంతర్లయ కన్నా అంతర్నాదం అనుభవానికి వచ్చే స్వేచ్ఛా కవితగా భావిస్తాను.

– రంగారావు (1969) యుగసంకేతం పీఠికలో

అంతర్నాదమంటే ఏమిటో రంగారావు చెప్పలేదు. అంతర్లయ యేమిటో ఇతరులు చెప్పలేదు. ఇక రెంటికీ తేడా తెలుసుకునే మార్గమేమిటి?

లయ, అంతర్లయ, భావలయ, అనే మాటల్ని దాదాపు ఒకే అర్థంలో రచయితలు వాడుతున్నట్లు కనిపిస్తున్నది. సి. నారాయణ రెడ్డి (1967) తన సిద్ధాంత గ్రంథంలో ఇట్లా అంటున్నారు:

'వచన గేయమునకు లయ ముఖ్యము. ఈ లయ గణములను కూర్చుటలోనే ఉత్పన్నము కాదు. ఒకానొక ఊపులో, విసురులో పదములను గుప్పించుట వలన ఈ లయ ఏర్పడును. ఏ నియమమును లేకుండ శుద్ధవచనమును లయాత్మకముగ మార్చినచో అది వచనగేయ మగును.

'పాఠకునిలో భావోద్వేగమును కలిగించు అంతర్లయ దీని ప్రధాన లక్షణము. దీనిలో కేవలము అనుప్రాసాదులవలన సంక్రమించు శబ్దలయ అనుషంగికమైనది. దీనికి అతీతమైన భావలయ ముఖ్యమైనది. భావలయ యనగా పూసలలో దారమువలె నుండు అంతర్లయ.'

— నారాయణరెడ్డి (1967)

నారాయణరెడ్డిగారి ప్రకారం వచనపద్యానికి లయ ముఖ్య లక్షణం. ఈ లయ ఒకానొక (?) ఊపులో, విసురులో పదాల్ని గుప్పించటం వల్ల వస్తుంది. ఒకానొక అంటే ఎలాంటి? మళ్లీ మొదటికే వచ్చాం. ఆ ఊపు, విసురు అర్థం అయితేకాని ఈ లయ అర్థం కాదు. అదే పుస్తకంలో ఇంకోచోట భావలయ ముఖ్యమంటు న్నారు. భావలయ అంటే ఏమిటి? "పూసల్లో దారంలాగా ఉండే అంతర్లయ." అది తెలిస్తే గదా ఇది తెలియటానికి. మార్గాల మంటే విడాలం!

పై వాక్యాల్లో నారాయణరెడ్డి కొత్తగా చెప్పిందేమీ లేదు. కుందుర్తి ఆంజనేయులు, అరిపిరాల విశ్వం మొదలైనవాళ్ళు చెప్పిం దాన్నే వేరే మాటల్లో చేశారు. వాళ్ళ ప్రతిపాదన ఎంత అస్పష్టంగా ఉన్నదో ఇదీ అంతే.

ఈ భావలయను అరిపిరాల విశ్వం ప్రతిపాదించినట్టు కుందుర్తి ఆంజనేయులు ఆమోదపూర్వకంగా రాసిన ఈ వాక్యాలవల్ల తెలు స్తున్నది.

'ఆ మార్గం (వచన కవితా మార్గం - చేరా) పూర్తిగా వృద్ధి పొందటానికి మిత్రులు డా॥ అరిపిరాల విశ్వంగారు స్థాపించిన భావలయ

సిద్ధాంతము, కోవెల సంపత్కుమారాచార్య ప్రతిపాదించిన భావ గణ సిద్ధాంతము బాగా ఉపయోగపడే సాధనాలు.

—ఆంజనేయులు (1967 ఎ)

విశ్వం, కృష్ణాపత్రిక 1941 జనవరి 7, 14 సంచికల్లో 'ప్రాచీనాలంకారికుల ధ్వనికి, ఆధునిక వచన కవిత్వంలోని భావలయకూ గల సాదృశ్యాలు వైషమ్యాలు' అనే పేరుతో ఒక పెద్ద వ్యాసం ప్రకటించారు. ఈ వ్యాసంలో ఒక్కొక్కకవి పద్యాలను ఉదాహరించి ఇందులో భావలయ ఉంది చూడమంటారే గాని అదేమిటో చెప్పలేదు. దాదాపు వచన కవిత్వానికి లక్షణాలను ప్రతిపాదించినవాళ్ళందరూ ఇదే పని చేశారు. (ఒక్క సంపత్కుమారాచారి ఇందుకపవాదం.) లయను గురించి కుందుర్తి ఆంజనేయులు (1967. బి) ఇట్లా అంటున్నారు.

'శబ్దానికిగాని, భావానికిగాని ఆ నాటి వచనాలలోని లయ వచనపు లయ. వచన గేయంలోని లయ కవిత్వపు లయ. ఈ రెంటి మధ్య గల సరిహద్దు కేవలం బుద్ధికి మాత్రమే తోచే సూక్ష్మ భావం కలిగి చాలా సున్నితంగా ఉంటుంది. వచన గేయమైనా విశృంఖల విహారం చెయ్యరాదనీ, దాని నడకలోనూ ఒక (!) లయ పంక్తిలో ఒక నిర్మాణ పద్ధతి ఉండాలని సారాంశం,'

—ఆంజనేయులు (1956)

ఒక లయ అంటే ఎట్లాంటి లయో తెలీదు. పైగా అది కవిత్వపు లయ అట! అదెట్లా ఉంటుందో స్పష్టంగా ఎవరూ చెప్పరు. దాన్ని విడదీసి చూడటం కష్టమని ఆంజనేయులుగారి అభిప్రాయం లాగా కనపడుతున్నది.

వచన పద్యంలో శబ్దలయను వీరెవరూ అంత ప్రధానంగా పరిగణిస్తున్నట్లు లేదు (శబ్దలయ అనేటప్పటికి మళ్లీ మాత్రా ఛందస్సు అవుతుందేమోనని వీరి భయం కావచ్చు!) శ్రీరంగం శ్రీనివాసరావు రాసిన 'కవితా ఓ కవితా' అనే ఖండికను కొందరు వచనపద్యంగా గుర్తించకపోవటానికి ఇదే కారణమనుకుంటాను. శబ్దాని కతీతమైన

అంతర్లయగాని, భావలయగాని, వచనపద్యానికి ముఖ్యమని వీరి అభిప్రాయం. అది ఇంగ్లీషులో వాడుతున్న Rhythm of thought అనే పదానికి తెలుగులో సమానార్థకంగా కనిపిస్తున్నది.

పద్యంలో అర్థవంతమైన శబ్దాల కూర్పు (Morphological Arrangement) ధ్వనుల కూర్పు (Phonological Arrangement) ఉంటాయి. ధ్వనుల కూర్పు అక్షరపరిమాణం మీద ఆధారపడి ఉంటుంది. ఆ అక్షరాలనే గురు లఘువులని ఛందశ్శాస్త్ర కర్తలు విభజించారు. గురు, లఘు క్రమం నిర్ణీతమైన అక్షరగణచ్ఛందస్సు అవుతుంది. మాత్రా గణచ్ఛందస్సు అట్లాకాక గురు లఘు సమూహాల పరిమాణాన్ని తీసుకొని త్ర్యస్ర (త్రిశ్ర) చతురస్రాది భేదాలుగా విభజించి ప్రయోగిస్తే మాత్రా గణచ్ఛందస్సు అవుతుంది. మాత్రాగణచ్ఛందస్సు లయప్రధానమైనది. నియతమైన మాత్రాపరిమాణంగల గురు లఘు సమూహాల (మాత్రాగణాల) క్రమావృత్తిని ఛందస్సులో లయగా నిర్వచించవచ్చు అయితే వీటితో పద ప్రయోగం కూడా సహకరిస్తేనే లయ సాధ్యమవుతుంది. ఇక్కడ అర్థవంతమైన శబ్దాలపాత్ర ఉంటుంది. దీన్నే (Morphological Arrangement) అంటున్నాను. ప్రయోగించిన పదాలు మాత్రా గణాంతంలో విరిచి చదివినా అర్థబోధకు ఆటంకం కలక్కపోతే పద ప్రయోగం లయానుకూలమవుతుంది. పూర్వపదాంతాక్షరంతో మాత్రాగణాన్ని ప్రారంభించినట్టయితే లయ భంగమవుతుంది. పదాంత విరామమూ (word juncture), గణాంత విరామమూ కలిసివస్తే లయ స్పష్టంగా తెలుస్తుంది. ఒక్కొక్కసారి పదాంత విరామం బదులు పదాంశాంతవిరామం (Morpheme juncture) గణాంత విరామంతో కలిసినా లయ కనిపిస్తుంది. ఈ రెండూ సాధ్యంకానప్పుడు ఊనిక (Stress) ఉన్న అక్షరంతో గణం ప్రారంభమైనప్పుడు అక్షరం పదమధ్యమైనా లయానుకూలమే. తెలుగులో ఒక పదంలో రెండో అక్షరం గురువుకాకపోతే మొదటి అక్షరంమీద ఊనిక ఉంటుంది. రెండో అక్షరం గురువైనా మొదటి అక్షరం కూడా గురువే అయితే మొదటి అక్షరం మీదనే ఊనిక ఉంటుంది. మొదటి లఘువు తరవాత గురువుంటే ఆ గురువు

మీద ఊనిక ఉంటుంది. మూడక్షరాల పదాలను ప్రమాణంగా తీసుకుంటే ఊనిక ప్రవర్తనను ఈ విధంగా చూపించవచ్చు.



(అక్షరం మీద (—) ఈ గుర్తు ఊనికని సూచిస్తుంది)

రెండక్షరాలకూ ఇదే పద్ధతి వర్తిస్తుంది. నాలుగక్షరాలకున్నూ ఇది వర్తిస్తుంది గాని అక్కడ పదాంశ విభాగమూ (Morpheme Division), పదాంశ గణమూ (Morpheme class) ఊనిక ప్రవర్తనలో మార్పు తీసుకురావచ్చు. తెలుగులో ఊనిక ప్రవర్తన మీద పరిశోధన అంతగా జరగలేదు. కనుక ఇంతకన్నా ఊనిక మీద ఎక్కువ చెప్పటం ప్రస్తుతం సాధ్యంకాదు. పై వాటిల్లో మొదటి అక్షరం మీద ఊనిక ఉన్నవాటిని అనులోమ గణాలనీ, రెండో అక్షరం మీద ఊనిక ఉన్న వాటిని విలోమ గణాలనీ అనవచ్చు.

ఈ ఊనిక సహాయంతో పద మధ్యాక్షరంతో గణం ప్రారంభమైనా అక్షరం ఊనిక ఉన్నదయితే లయ సరిపోతుంది. ఉదాహరణకు :

చక్ర । వర్తి అ । శోకు । టెక్కడ

అన్న పాదంలో చక్ర తో పదం అయిపోలేదు కాని చక్ర అర్థవంతమైన రూపం. అందువల్ల చక్ర తరువాత పదాంశాంత విరామం (Morpheme juncture) ఉంది. అక్కడికి ఒక మూడుమాత్రల గణం అశోకుటెక్కడ అన్నప్పుడు శో మీద ఊనిక ఉంది. అందుకు కారణం దీని పూర్వాక్షరం పదాది లఘువు. ఊనికతో ఉన్న అక్షరంతో గణం ప్రారంభమయింది. వర్తి - అవిభాజ్యమైన రెండు గణాలమధ్య ఉండటంవల్ల ఇది గణం కాగలిగింది. టెక్కడ అన్నప్పుడు పద విభాగం చేస్తే అజాది పదం వస్తుంది. ఊనిక ఎప్పుడూ అచ్చుమీదనే ఉంటుంది. అందువల్ల అర్థస్ఫురణకు భంగం ఉండదు.

స్వేచ్ఛ ఉంది లయలేకుండా (అంటే లయస్ఫురణ లేకుండా) శుద్ధవచనంగా రాసిన పద్యాలున్నై. మాత్రా పద్యాల్లో సరిగ్గా నియమాన్ని పాటిస్తే లయ విషయంలో స్వేచ్ఛ లేదు. (కనీసం తక్కువ) గురు లఘు ప్రయోగంలో మాత్రం చాలా స్వేచ్ఛ (స్వేచ్ఛ అనేకంటే Choice అనటం సబబు) ఉంది. సాధారణంగా లయస్ఫూర్తిలేని మాత్రా పద్యముండదు. కాని లయలేని వృత్తం ఉండవచ్చు.

దీన్నిబట్టి లయ ప్రధానంగా అక్షరగుణం (Syllabic quality) అనీ, వీటిని నియతపరిమాణం (Quantity) గల గణాలుగా ప్రయోగించటం వలన లయ సిద్ధిస్తుందనీ, దీనికి గణాంతాల దగ్గర విరిచి చదివినా అర్థభంగంకాని విధంగా పదాలకూర్పు ఉండాలనీ తెలుస్తున్నది. ఒక నియత పరిమాణంగల గణాలు క్రమావృత్తమైనప్పుడే లయ ఉంటుంది. ఈ లక్షణం వచనపద్యంలో ఉంటే, అదే మాత్రా పద్యమవుతుంది. మాత్రా పద్యంలో ఒకే రకపు లయ సాధారణంగా పద్యమంతా ఉంటుంది. వచన పద్యంలో అవసరాన్ని బట్టి భిన్న లయలు ఉండవచ్చునంటే, అది గతులు మార్చిన మాత్రా పద్యమవుతుంది గాని వచన పద్యం కాదు. అంటే పైన వివరించిన పద్ధతుల్లో, లయ ఉన్న పద్యం మాత్రాపద్యమో, శబ్దాకారమో అవుతుందిగాని వచనపద్యం కాదన్నమాట. వచన పద్యంలో స్పష్టమైన అక్షరస బంధమైన లయఉండదని సాధారణంగా బహుశః ఇది గుర్తించే కాబోలు విశ్వం (1961) భావ లయను, సంపత్కుమార (1967) భావగణాలను ప్రతిపాదించారు. వేరుగా కనిపిస్తున్నా ఈ రెండూ ఒకటే. శబ్ద రూపంలో అక్షర సమూహాల పరిమాణాన్ని బట్టి మాత్రాగణాలున్నై. తద్వారా సాధించిన లయ శబ్దలయ అవుతుంది దీన్నే అక్షరలయ అనికూడా అనవచ్చు. అది చెవికి వినిపించేది. అర్థంతో నిమిత్తం లేకుండా శ్రోత గుర్తించేది. అట్లాకాకుండా భావగణాల ద్వారా సాధించేది భావలయ భావగణాలుంటే భావలయ ఉంటుంది భావగణాలు లేవని నిరూపిస్తే భావలయ సిద్ధాంతం కూడా నిరాసమవుతుంది.

ఛందశ్శాస్త్రంలో గణాలు - అవి మాత్రా గణాలుగానీ, అక్షర గణాలుగానీ, పరిమిత సంఖ్యాకాలు. అంటే పరిగణనీయాలు, వాటి

మిశ్రమాలు. పద్యపు పాద పరిమితినిబట్టి అధిక సంఖ్యాకాలు కావచ్చు. కాని గణాలు మాత్రం పరిమిత సంఖ్యాకాలే. అవి విసర్గ, ఇంద్ర, చంద్ర, సూర్యగణాలు కావచ్చు. రెండు, మూడు, నాలుగు, ఐదు మాత్రల గణాలుగా రావచ్చు. కాని ఈ భావగణాల సంఖ్య ఎంత? భావాలు ఎన్ని ఉంటాయో భావ భావ గణాల సంఖ్య అంతన్నమాట? భావాలు ఎన్ని ఉంటాయో ఎవరు అంచనా వెయ్యగలరు? అనంతమైన భావ గణాలున్నప్పుడు వాటికి వ్యవస్థ ఏమిటి ?

అక్షర గణాల్లో కాని, మాత్రా గణాల్లోగాని, ఒక్కొక్క గణం పరిమితిని ఉచ్చారణతో కొలవవచ్చు. ఒక్కొక్క భావగణ పరిమితిని భావంతో కొలవగలమా? భావాలు వ్యక్తమయ్యేది భాషలో వాక్య వాక్యాంశాల ద్వారా కాబట్టి వాటిద్వారానే కొలవాల్సి ఉంటుంది. సంపత్కుమార (1967) ఇచ్చిన ఉదాహరణలనుబట్టి చూస్తే వ్యాకరణ రూపైకత (gramatical similarity in form) ఉన్న వాక్యాంశాలను ఒక గణంగా భావిస్తున్నట్టు కనిపిస్తున్నది. కీ. శే. బాలగంగాధర తిలక్ కవితలో నుంచి ఈ భాగాన్ని సంపత్కుమార ఉదాహరించారు.

ప్రతిమాటకీ । శక్తి ఉంది। పదును ఉంది.
ప్రతిమాటకీ । అర్థం ఉంది। ఔచిత్యం ఉంది.

ఇక్కడ కి-విభక్తి బంధం ఒక గణం, తరువాత వచ్చిన నామం, క్రియ కలిపి ఒక గణం. *శక్తి, పదును, అర్థం, ఔచిత్యం,* అనేవి ఒక రకపు (నామ) గణాలుగానూ, *ఉంది* అనేది ఒక (క్రియా) గణంగానూ ఎందుకు విభజించగూడదు? *శక్తి ఉంది* అనేది ఒక భావమా? రెండు భావాలా? *ప్రతిమాటకీ శక్తి* అనేది ఒక గణం ఎందుకు కాకూడదు? భావగణాలను వేరుచేసే నిర్దిష్టమైన సూత్రాలేమిటి? ఆబ్జెక్టివ్ క్రైటీరియా ఏమైనా ఉన్నాయా? కేవలం arbitrary గా చేసే విభాగమేనా? ఈ ప్రశ్నలకి వేటికీ సమాధానాలు దొరకవు. అందుకే సంపత్కుమార (1967)లో ఇక్కడ అర్థాన్ని బట్టి గణవిభజన ఆభాసరూపంగా చెయ్య వచ్చునన్నారు. వారి భావగణాలు ఆభాసాలే గాని నిర్దిష్టమైనవి కావని వారే అంగీకరిస్తున్నారు ఈ ఆభాసగణాలు వచనపద్యాన్ని నిరూ

చించలేవు గాబట్టి వాటిని నిరాకరించాల్సివస్తున్నది. అసలు విషయమేమిటంటే భావాన్ని గణాలుగా విభజించటం సాధ్యంకాదనీ, వీరు విభజించింది వ్యాకరణ దృష్ట్యైకత ఉన్న పదసమూహాలు కాబట్టి, వీటిని న్యాయంగా వ్యాకరణ గణాలు అని అనాల్సి ఉంటుందనీ తెలుతున్నది. వ్యాకరణ గణాలు వాక్య, శబ్ద నిర్మాణానికి సంబంధించినవి. వాటి ఆవృత్తి ఒకే శబ్దంతో అయితే పునరుక్తి, భిన్న శబ్దాలయితే అనుప్రాస అవుతుంది, సంపత్కుమార భావ గణాలంటున్న వ్యాకరణ గణాలు పద్య బాహ్య స్వరూపానికి అవసరమైన గణాలు కావనీ, వాక్య నిర్మాణానికి అవసరమైన కూర్పు అనీ తేలుతున్నది. పద్య నిర్మాణం వేరు, వాక్య నిర్మాణం వేరు. వేటి సూత్రాలు వాటికే ఉన్నై. భావగణాలే లేనప్పుడు వాటిమీద ఆధారపడి ఉండే భావలయ కూడా ఉండదని చెప్పక తప్పదు.

ఇవికాక సంపత్కుమార 1962 లో పది లక్షణాలు 1965లో 6 లక్షణాలు ప్రతిపాదించారు. ఇక వాటిని పరామర్శిస్తాను. 1962 లో లక్షణాల్ని సంక్షిప్తం చేస్తే వచ్చినవే 1965 లో ప్రతిపాదితమైన లక్షణాలు. అందువల్ల 1965 లో లక్షణాల్నే ఇక్కడ ఇస్తాను.

1. భావాన్ని భావాంశాన్ని బట్టి పాదాలను విభజించటం.
2. క్రియాపదాలతో ప్రారంభించటం, పూర్తి చేయటం.
3. క్రియారహితంగా భావాన్ని వాక్యంగా రూపించటం.
4. అనియతంగా యతిప్రాసల్ని అంత్యప్రాసల్ని ఉపయోగించటం
5. ఒక్కొక్క పాదాన్ని తత్పూర్వ పాదంకన్నా పొడిగిస్తూ తగ్గిస్తూ భావోద్దీప్తిని కలిగించడం.
6. భావాన్ని లయబద్ధంగా స్ఫురించేట్టు పాదాలలో పదాలకూర్పు ద్వారా ఇమడ్చటం.

వీటిని ఈ క్రమంలో కాకుండా నాకు వీలైన క్రమంలో పరిశీలిస్తాను. వీటిల్లో 2, 3, 4 లక్షణాలను ఆభాసంగానైనా లక్షణాలుగా అంగీకరించలేం. క్రియాపదాలతో ప్రారంభించటం, పూర్తిచెయ్యటం

పద్యలక్షణ మెట్లా అవుతుంది. మాటవరసకు అవుతుందనుకుందాం. క్రియాపదం మధ్యలో ఉండదా? క్రియాపదం అంటే సమాపకమా? అసమాపకమా?

> గోవేగదా అని దండం పెట్టబోతే
> ఉన్నట్లే *ఉండి ఎగిరి* మీదపడుతుంది
>
> -సంపత్కుమార, "నేలవిడిచిసాము"
> (చేతనావర్తం - పేజి 2)

> వాడెప్పుడు *తెరదించుతాడో* తెలవదు
> ఏ ఘట్టంలో మరి ఈ నాటకం ముగుస్తుందో
> అనుక్షణం *అయిపోయిందనే* అనిపిస్తుంది
> అయితే ఇది మొదలంటాడు వాడు
>
> - సంపత్కుమార 'ఆత్మాశ్రయం'
> (చేతనావర్తం-2 పేజి 13)

క్రియాపదం సమాపకమైనా, అసమాపకక్రియైనా పైఖండికల్లో పాదం మధ్యలో వచ్చినట్లు స్పష్టమే కదా, అంటే క్రియా పదం పాదాది మధ్యాంతాల్లో ఎక్కడైనా రావచ్చునన్నమాట. ఈ మూడు చోట్లా కాకుండా ఎక్కడొస్తుంది?

క్రియారహితంగా భావాల్ని వాక్యంగా రూపించడం మూడో లక్షణం. దీనికి మాదిరాజు రంగారావు కవితనుంచి ఉదాహరణలు చూపించారు. వాక్యప్రయోగ విశేషం పద్యలక్షణంగా చెప్పటం విచిత్రం. క్రియ అవసరమైనచోట లేకుండా చెప్పటం వాక్యదోషం అవుతుంది. అయితే కవులకు ఈ లైసెన్సు ఉంది. ఒకానొకకవి శైలీ విశేషాన్ని పద్యలక్షణంగా చెప్పటం కుదరదు. మాదిరాజు రంగారావు వచన పద్యాల్లో గ్రాంథికభాష ఉపయోగిస్తారు కాబట్టి దాన్నికూడా వచనపద్యం లక్షణంగా అంగీకరిస్తామా ?

యతిప్రాసల్ని, అంత్యప్రాసల్ని అనియతంగా ప్రయోగించటం నాలుగో లక్షణం, అనియతత్వం ఒక లక్షణం ఎట్లా అవుతుంది?

అన్త్యప్రాస అలంకారం. తెలుగులో అక్షరసామ్యయుక్తమైన యతి ప్రాసలు అలంకార సన్నిభాలే అయితే, ప్రాచీన కవులు వీటిని నియమాలుగా పాటించారు. ముత్యాల సరాల్లో వీటిని చాలామంది అనియతంగానే పాటించారు. కాని వాటిని మాత్రం పద్యలక్షణాలుగా ఎవరూ చెప్పినట్టు లేదు.

పై లక్షణాల్లో 1, 5, 6 లక్షణాలు అభాసంగానైనా లక్షణాలుగా కనిపిస్తున్నై. ఆరో లక్షణానికి సమానమైంది సంపత్కుమార (1962)లో ఇట్లా ఉంది.

10. గణవిభజనాదులకు భిన్నముగా రచనాశక్తి నాధారముగా చేసి లయను సమాకర్షించుట.

సంపత్కుమార (1962) నీ (1966) నీ కలిపిచూస్తే ఆయన ఇక్కడ భావలయనే ఉద్దేశించినట్టు కనిపిస్తుంది. భావలయను ఇంతకు ముందే విపులంగా చర్చించి నిరాకరించాము.

1, 5 లక్షణాలు పాదవిభజనకు సంబంధించినవి. పద్యానికీ, గద్యానికీ పాదవిభజన ప్రధానభేదం అని ప్రాచీనులు చెప్పారు.

పాదకల్పనంబు వలవదు గద్యమునకు
పాదనియతినొప్పుం బద్యంబులు

అని అనంతుడు ఛందోదర్పణంలో అన్నాడు. సంపత్కుమార (1962, 1965, 1967, 1968, 1970) పాదబద్ధతను గురించి చాలా చోట్ల ఉద్ఘాటించారు. వచన కవిత్వాన్ని ఛందో విభాగంలో చేర్చటానికి ఆయన ప్రధానంగా దీనిమీదనే ఆధారపడినట్లు కనిపిస్తున్నది. ఉదాహరణకు ఈ వాక్యాలు చూడండి.

'ఛందో విభాగానికి చెందిన ప్రతిదీ పాదబద్ధమై లేదా పాద విభాగంతో ఉంటుంది. పాదబద్ధత ఛందస్సుయొక్క మొట్టమొదటి లక్షణం. పాదాలు అన్నీ సమానరూపంలో ఉండవచ్చు. ఉండకపోవచ్చు. అయినా అది పద్యమే'.

— సంపత్కుమార (1968)

వచనాన్నుంచి పద్యాన్ని భేదింపజేసేది దాని పాదబద్ధత. పద్యానికి సంబంధించి ఇతర విషయాలనేకం ఎట్లా ఉన్నా, అది పద్యం కావటానికి దాని పాదబద్ధత ప్రధాన లక్షణం. పాదబద్ధంగా ఉండాలన్నదే ప్రధానం తప్ప, పాదసమత్వంగానీ, పాదసంఖ్యా నియమంగానీ కాదు...

అందువల్ల ప్రధానమయిన పాదబద్ధతను స్వీకరించి, మిగిలిన అంశాలను ఐచ్ఛికం చెయ్యటం, ఒక దశలో నిరాకరించటం, వచన పద్యంలో ప్రధానంగా గమనించవలసి ఉంటుంది.

– సంపత్కుమార (1970)

వీటినిబట్టి ఇంతకుముందు చర్చించిన లక్షణాలు ఐచ్ఛికాలనీ, ఒకోసారి వాటిని నిరాకరించవచ్చుననీ, పాదబద్ధత మాత్రం నిరాకరింపరాని లక్షణమని సంపత్కుమార అభిప్రాయంగా మనం గ్రహించవచ్చు. పాదబద్ధత స్థాపితమైతే వచనపద్యాన్ని సలక్షణమైన పద్యరూపంగా అంగీకరించవచ్చని తాత్పర్యం. పాదబద్ధత అన్ని పద్యాలకూ, లక్షణమవుతుందిగదా: మరి వచనపద్యాన్ని మిగతా పద్యాల్నుంచి పృథక్కరించటమెట్లా అనే ప్రశ్నకి అనియత గురు లఘు విన్యాస ప్రయోగాన్ని వేరుచేసే గుణంగా సరిపెట్టుకోవచ్చు. అంటే పాదబద్ధత ఏకైక, అనైచ్ఛిక లక్షణమన్నమాట.

ఈ పాదబద్ధతకు లొంగనివి కూడా ఆధునిక కవిత్వంలో కొన్ని ఉన్నై. కీ. శే. బాలగంగాధరతిలక్ వ్రాసిన 'ఆర్తి గీతం,' 'రాత్రి వేళ' అనే ఖండికల్లో ఈ పాదబద్ధతను పాటించినట్లు కనిపించదు.

> నిర్జనస్థలం, ఎవరూ లేరు, చుట్టూ పరచుకున్న మైదానపు నగ్న దేహాన్ని స్పృశింపబోయే నీచుల కాంక్షాగ్రపు వ్యగ్రపు తొందర నిశ్శబ్దం మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తోంది, ఆకాశం మీద ఒకచుక్క మరో నక్షత్రంతో మాట్లాడే మాట మనసుకి వినిపిస్తోంది.

– తిలక్ 'రాత్రి వేళ'

ఇందులో పాదవిభజనకు ఆధారాలేమిటో నాకర్థం కావడం లేదు. ముఖ్యంగా మూడో పాదం ఆకాశంతో అంతం కావటానికి హేతువు ఎవరయినా చెప్తే సంతోషిస్తాను.

పాపికొండలకావల, నిజాం గజాంకుశం కాలేదు నీవు?
కోనసీమలో, లంకసీమలో పాపాల దీపాల నార్పలేదూ
నీవు? విచ్చుకత్తులబోను చెక్కలు ద్రుంచలేదూ
రాత్రిని కప్పుకొని, ధాత్రిని మప్పుకొని చరించలేదూ నీవు?
– కె. వి. రమణారెడ్డి 'బాధాగాథము'

పై దాంట్లో రమణారెడ్డి అచ్చులో కూడా పాదబద్ధత పాటించలేదు. అయితే దీన్ని 'వచనపద్యములను కూడా అతిక్రమించి ఆవేశ ప్రేరకంగా అంతర్లయాన్వితంగా సాగిన ఈ కావ్యం కావ్యోపన్యాసం అనదగింది' అంటున్నారు రమణారెడ్డి. నరసింహారెడ్డి (1968) దీన్ని కానంటున్న వచనకవితగానే పరిగణించారు.

నగ్నముని రాసిన 'మొహమ్మది చంద్రుడు' అనే ఖండిక (దిగంబర కవులు-2)లో పాదబద్ధత అసలు పాటించలేదు. స్వరూపాన్ని బట్టి, స్వభావాన్ని బట్టి మేం వ్రాస్తున్నదానిని వచనకవిత అని మేం అనదలుచుకోలేదు' అని దిగంబర కవులు అన్నా వచన పద్య కవులు, సిద్ధాంతకర్తలు వాళ్లను వదలలేదు. వాళ్లు ఒప్పుకోకున్నా దిగంబర కవుల స్వరూపం ప్రతీవర్సదే నంటున్నారు వరవరరావు (1967).

దిగంబర కవుల్ని వదిలేద్దాం. రమణారెడ్డి బాధాగాథాన్ని కావ్యోపన్యాస మనే అందాం. వచనపద్య కవులందరూ ఒప్పుకొనే తిలక్ మాటేమిటి? వీటిని అపవాదాలుగా పరిగణించి పాద బద్ధతను గురించిన మిగతా అంశాలను పరిశీలిద్దాం. పాదబద్ధత పద్యానికీ గద్యానికీ ప్రధానమైన భేదమనీ, పాదసంఖ్యా నియమం అంత ప్రధానం కాదనీ, పాదాలు సమపాదాలే కానక్కర్లేదనీ, విషమ పాదాలు కూడా అంగీకార్యాలేననీ సంపత్కుమారతోపాటు నేనూ అంగీకరిస్తాను.

వృత్తాల్లోగాని, జాతుల్లోగాని, మాత్రా పద్యాల్లోగాని పాద విభజన గణనియమాన్నిబట్టి ఉంటుంది. అంటే గురులఘుక్రమం వృత్తాల్లో అక్షరాల సంఖ్య నియతమే. మాత్రా పద్యాల్లో మాత్రాసంఖ్య నియతం. జాతుల్లో ఇంద్రగణ ఉపగణాల ప్రయోగంవల్ల ఈ రెండూ నిర్దిష్ట సంఖ్యాకాలు కాకపోయినా వాటి రేంజి (Range) నియతం. ఉదాహరణకు గీత పద్యపాదంలో అక్షరాల సంఖ్య 12-19 మధ్య ఉంటుంది. మాత్రా సంఖ్య 17-19 మధ్య ఉంటుంది. అంతేకాకుండా తెలుగులో వచ్చిన పద్యపాదాలు అక్షరాలనీ, మాత్రలనీ, గణాలనీ పనిలేకుండా కనుక్కునే వీలుంది. ఏ పద్యాన్నైనా పాద విభజన చెయ్యకుండా పూర్వులు తాళపత్ర గ్రంథాల్లో ఒకేవరుసలో రాసేవాళ్ళు. అయినా ఛందస్సు తెలిసినవాళ్ళకి వాటిని మళ్ళీ పాదబద్ధంగా రాయటం కష్టం కాదు. పాద విభజన లేకుండా అచ్చువేసిన (లేక రాసిన) వచన పద్యానికి, ఈ వచనపద్య లక్షణకర్తలు మళ్ళీ కచ్చితమైన పాద విభజన చెయ్యగలరా? కచ్చితంగా కాకపోతే పోనీ; ఏ ఇద్దరు లక్షణకర్తలైనా ఒకేరకపు పాదవిభజన చెయ్యగలరా? వచన పద్యాల్లో పాద విభజన జ్యామెట్రీనిబట్టి ఉంటుంది అని సాంప్రదాయిక విమర్శకులు చేసే ఆరోపణలో నిజం లేకపోలేదు.

పాదం కేవలం అక్షర సముదాయం కాదు. గణ సముదాయం. అంటే పాదానికి అంతర్నిర్మాణం (Internal Structure) ఉందన్న మాట. వచన పద్యపాదంలో ఉండేవేమిటి? భావగణాలు లేవని పూర్వమే నిరూపించాను. అందువల్ల వచనపద్య పాదానికి అంతర్నిర్మాణం లేదనికూడా నిరూపితమే. నిర్దిష్టమైన పరిమితి, గణనిర్మాణం పద్య పాదానికి లక్షణాలు. ఈ రెండూ లేని పాదాలు పద్యపాదాలు కాలేవు. అందువల్ల పద్యానికి ప్రధానమైన ఛందోబద్ధత అనే లక్షణం వచనపద్యం అనే కవితా రూపానికి లేదు.

వచన పద్యానికి లక్షణాలుగా చెప్పబడుతున్న వేవీ లక్షణాలు కావని పైన నిరూపించాను. అందువల్ల వచనపద్యం పద్యంకాదనీ, గద్యమేననీ సిద్ధాంతం. గద్యానికి ఏ నియమాలూ లేవు, వచనపద్యానికి అంతే. నియమ రాహిత్యమే వచనపద్య లక్షణం.

మొదటే చెప్పినట్లుగా వచనపద్య స్వరూపం మీదగానీ, వచన కవిత్వం మీదగానీ నాకు వ్యతిరేకత లేదు. వచనపద్య సిద్ధాంతాలతోనే నాకు పేచీ.

(ఆంధ్రపత్రిక 1972 సంవత్సరాది ప్రత్యేక సంచిక)

[ఆంధ్రప్రభ-దినపత్రిక 21-8-1968 నాటి ఆదివారం అనుబంధంలో తాము ప్రచురించిన 'శుద్ధవచనం: వచన పద్యం' అనే వ్యాసాన్ని బండి నాగరాజుగారు మా దృష్టికి తెచ్చారు. రామారావు ఈ వ్యాసంలో ప్రస్తావించిన ఒకటి రెండు అంశాలు నాగరాజుగారి ఆంధ్రప్రభ వ్యాసంలోనూ ఉన్నాయని మేం గమనించాం.]

# వచన పద్యం:

# లక్షణ నిరూపణం

—సంపత్కుమార

'వచన పద్యం' అన్న ప్రక్రియ ప్రయోగంలోకి వచ్చి దాదాపు నలభయి ఏళ్ళయింది ఇటీవల మరీ విరివిగా విస్తృతంగా ప్రయోగింపబడుతున్నది. అయితే వచన పద్యాన్ని ప్రయోగించటమే తప్ప, ఒక ఛందోరూపంగా దాని లక్షణాన్ని నిరూపించే ప్రయత్నం మాత్రం జరుగలేదు. అందుకని, దాని లక్షణాన్ని నిరూపిస్తూ నేను కొన్ని వ్యాసాలు రాయటం జరిగింది. ఆయా నా వ్యాసాలను పురస్కరించుకొని చేకూరి రామారావుగారు 'వచన పద్యం: ఆభాస లక్షణ నిరాకరణం' అన్న వ్యాసంలో నేను చెప్పిన లక్షణాలను నిరాకరించినారు. కాగా, వారు చేసిన ఈ 'నిరాకరణం' పురస్కరించుకొని, మళ్ళీ వచన పద్యాన్ని గూర్చిన కొన్ని అంశాలను స్పష్టం చేయవలసిన అవసరం ఏర్పడింది.

వచన పద్యాన్ని గూర్చి నేను మాత్రమేకాక, ఇంకా కొంత మంది చెప్పిన చాలా అంశాలను ప్రస్తావించి రామారావుగారు తమ వ్యాసంలో నిరాకరించినారు. అయితే, వాటిని గూర్చి నాయీ వ్యాసంలో ఏమీ చెప్పబోవటంలేదు. నా 'అభిప్రాయాల్నే, ప్రధానంగా-సవిమర్శకంగా ప్రస్తావించదలచు' కున్నారువారు, కాబట్టి, వాటిని మాత్రమే ఇక్కడ ప్రస్తావించి వివరిస్తాను.

నా అభిప్రాయాల్నే ప్రధానంగా 'సవిమర్శకంగా' ప్రస్తావించ దలచుకున్న రామారావుగారు, ఈ ప్రక్రియకు వ్యవహారంలో మరికొన్ని పేర్లు ఉన్నాగూడా, వాటిని కాదని, నాకు 'నచ్చినపేరే'—అంటే, 'వచన పద్యం' అన్న పేరే—గ్రహించినారు. ఆ పేరే నాకు నచ్చటానికి

కారణం, ఆ ప్రక్రియకు మిగిలిన పేర్లన్నిటికన్నా, ఈ 'వచనపద్యం' అన్న పేరు బాగా నప్పటం మాత్రమే. ఈ పేరును గూర్చి ఇదివరకటి నా వ్యాసాల్లో – ప్రధానంగా 'వచన పద్యం: దాని పేరు' అన్న వ్యాసంలో — చర్చించి నిర్ధారించినాను. ఈ పేరు విషయంలో అసమ్మతి నేమీ రామారావుగారు ప్రకటించలేదు. పైగా, నాకునచ్చిన కారణంగా వారూ ఆ పేరే స్వీకరించినారు. అసలు ఈ ప్రక్రియ పేరును గూర్చి రామారావుగారంతగా పట్టించుకోలేదు. అందుకని ఆ విషయాన్ని గురించి ఇక్కడ ఎక్కువగా వివరించటంలేదు.

రామారావుగారు తమ వ్యాసాంతలో '—వచన పద్యం పద్యం కాదనీ, గద్యమేననీ సిద్ధాంతం. గద్యానికి ఏ నియమాలూ లేవు. వచన పద్యానికీ అంతే. నియమరాహిత్యమే వచనపద్య లక్షణం.' అని సిద్ధాంతీకరించటం జరిగింది వచనపద్యం గద్యమేతప్ప పద్యం కాదని సిద్ధాంతంచేస్తూ, 'నియమరాహిత్యమే వచన పద్యలక్షణం' అనటం కొంత అయోమయాన్ని కలిగిస్తుంది. వచనపద్యం పద్యం కాకనే పోతే, అందులో—'వచనపద్యం'లో—పద్యం అన్న మాట ఉండటానికే వీల్లేదు. మరొకటి. అనియతత్వం ఒక లక్షణం ఎట్లా అవుతుంది?' అని తమ వ్యాసంలో ఒకచోట ప్రశ్నించిన రామారావుగారు 'నియమ రాహిత్యమే వచనపద్య లక్షణం' అనటం ఎట్లా కుదిరిందో అర్థం కావటంలేదు. 'అనియతత్వం' లక్షణం కానప్పుడు నియమరాహిత్యం' మాత్రం లక్షణమెట్లా అయితుంది?

వచనపద్యాన్ని 'పద్యం' అనటానికి నేను ప్రతిపాదించిన ప్రధానాంశం, దాని పాదబద్ధత. దీన్ని అనుసరించి చేసింది భావగణ ప్రతిపాదన. రామారావుగారు తమ వ్యాసంలో మొదట భావగణ నిరాకరణం చేసి, ఆ తరువాత పాదబద్ధతా నిరాకరణం చేసినారు. అయితే, ఈ రెండవ నిరాకరణాన్ని గూర్చి మొదట, మొదటి నిరాకరణాన్ని గూర్చి తరువాత విచారిస్తాను. కారణం, ఛందస్సులో మొదట పాదం, ఆ తరువాత గణం.

పాదబద్ధతను నిరాకరిస్తూ రామారావుగారు కొన్ని ఆసక్తికరమయిన అంశాలను ప్రస్తావించినారు. 'పాదం అక్షర సముదాయం కాదు, గణసముదాయం. అంటే, పాదానికి అంతర్నిర్మాణం ఉన్నదన్న మాట అన్నారు. కాని, విచారిస్తే, పాదం అక్షర సముదాయమే తప్ప గణ సముదాయం కాదు. కొన్ని పద్యాల్లో అక్షరాల సంఖ్య పాదప్రమాణం కాగా, మరి కొన్నింటిలో ఆ అక్షరసంఖ్య మాత్రా సంఖ్యా దృష్టితో హెచ్చుతగ్గులయితున్నది. నిజానికి, ఛందస్సులో గణపద్ధతి మొదట పింగళుడు ప్రవేశపెట్టింది. ఆయన పద్ధతి ప్రకారం మూడక్షరాలగుంపు ఒక 'గణం'. [వగణం (లగ), హగణం (గల) అని రెండక్షరాలగుంపును గణం అనటం ఔపచారికంగా మాత్రమే.] పద్యలక్షణం చెప్పటంలో సౌలభ్యం కోసంగాను తన ధోరణిలో పింగళుడు ఉద్దేశించింది మాత్రమే ఈ 'గణ' పద్ధతి శాస్త్రకర్తలు ఈ విధంగా లక్షణ కథనంలో సౌలభ్యం కోసం కొన్ని పద్ధతుల్ని ఏర్పాటు చేసుకుని సంకేతించటం పరిపాటే. పింగళునికి పూర్వులయిన భరతాదుల్లో ఈ 'గణ' పద్ధతిలేదు. ఇన్నిన్నేసి అక్షరాలుగల పాదాల్లో ఫలానా ఫలానా సంఖ్యగల అక్షరాలు గురువులనీ, లేదా లఘువులనీ చెప్పటం వారిపద్ధతి. పరిశేషన్యాయంగా మిగిలినయి లఘువులో, లేక గురువులో అయితాయని అనుకోవాలె. మరొకటి. పింగళుని గణపద్ధతికి భిన్నంగా రత్నమంజూషాకర్తా, జనాశ్రయుడూ తమకనుకూలమనుకున్న పద్ధతిలో గణనిర్మాణం చేసుకున్నారు. పింగళుడు ఎనిమిది గణాలను చెప్పగా, రత్నమంజూషా కర్త పన్నెండు, జనాశ్రయుడు పద్దెనిమిది గణాలను చెప్పటం జరిగింది. పైగా వారి గణనిర్మాణంలో మూడక్షరాల సంఖ్య పరిమితం కాదు. రెండునుంచి ఆరుదాకా అక్షరాలు ఆగణాల్లో ఉండవచ్చు (సంపత్కుమార 1962) పింగళుడి గణాలు ఎనిమిదికావటం, ప్రతిగణంలోనూ మూడేసి అక్షరాలు మాత్రమే నియతంగా ఉండటానికి కారణం ఆయన మూడక్షరాల ఛందాన్ని ప్రస్తారం చేసి దానివల్ల ఏర్పడ్డ ఎనిమిది రకాల పద్యపాదాలను 'గణాలు'గా స్వీకరించటమే. మూడవ ఛందాన్ని ('మధ్యా' చ్ఛందం) ప్రస్తారించటంవల్ల ఎనిమిదిరకాల పాదాలు మాత్రమే ఏర్పడుతయి. రత్నమంజూషా కర్త, జనాశ్రయులు

ఈ ప్రస్తార పద్ధతినికాక తమ-స్వసం కేతితమయిన అనుకూల్యాన్ని అనుస రించి మాత్రమే గణనిర్మాణం చేయటంవల్ల, వాటిలో సమత్వం కొర వడింది. ఆ కారణాన-క్లిష్టత్వం అధికమయి వారి గణనిర్మాణానికి ప్రాధాన్యం, ప్రాచుర్యం కలుగలేదు. పింగళుడి పద్ధతికే ప్రాచుర్యం లభించింది. ఏదెట్లాగయినా, గణాలనేవి లాక్షణికులు లక్షణ కథనంలో సౌలభ్యానికి ఏర్పరచుకొన్నవే తప్ప పద్యపాదానికి నిసర్గం కావు. ఒక వేళ పాదనిర్మాణంలో గణాలే ప్రధానమయితే, అయిదు గణాల ఛందం, ఆరుగణాల ఛందం...ఇత్యాదిగా గణసంఖ్యతో చెప్పవలసి ఉండేది. కాని, ఆవిధంగా ఏ లాక్షణికుడూ చెప్పలేదు. ఒక అక్షరం నుంచి ఇరవయారక్షరాలదాకా ఒక పాదంలో అక్షరాలుండవచ్చు. ఎన్ని అక్షరాలుంటే ఆపాదం అన్నవఛందానికి చెందుతుంది. పాదానికి పదక్షరాలుంటే, అది పదవ ఛందానికి చెందిందన్నమాట. (అంతకన్నా ఎక్కువ అక్షరాలుంటే, అవి వేరే వృత్తాలు.) అన్ని ఛందాల్లోని పద్య పాదాలూ గణాలతో నిశ్శేషంగా విభక్తంకావు. అందుకనే విభక్తం కాని కొన్నిచోట్ల, గణ పద్ధతిలో మొదటినుంచి విభజిస్తూపోగా పాదాం తాన మిగిలే ఒకటి రెండక్షరాల ఉనికినిగూర్చి ప్రత్యేకంగా (మ-స-జ-స-త-త-గ) చెప్పటం జరిగింది. మరొకటి. పద్యపాదాల్లోని గురులఘు క్రమం 'ప్రస్తారం' ద్వారా నిర్ధారిత మయితుంది. కాగా, పద్యపాద స్వరూపాన్ని అక్షరసంఖ్య, దాన్నిబట్టి జరిగే 'ప్రస్తార' పద్ధతి నిరూ పిస్తున్నయితప్ప, గణాలుకాదు. మాత్రాసంఖ్యా ప్రాధాన్యంగల పద్యాల్లోనూ ఇంతే, ఆ పద్యపాదాల్లోనూ గణపద్ధతిని ఉపయోగించటం లక్షణకథన సౌలభ్యంకోసమూ; ఎన్ని మాత్రలవద్ద పదం, పదాంశం విరిగితే పద్యం నడక బాగుంటుందో చెప్పటానికి ఉద్దేశించిమాత్రమే. ఈ నడకకోసమే చతుర్మాత్రా గణమయినా, జగణాన్ని, చతుర్మాత్రా గణాల్ని ఉపయోగించవలసిన సందర్భాల్లో కొన్నిచోట్ల లక్షణ కర్తలు నిరాకరించటం జరిగింది. (అయినా కవులు స్వేచ్ఛగా ఈనిరాకరణాన్ని పాటించకపోవటం చాలాచోట్ల గమనించవచ్చు) మరికొన్నిచోట్ల మాత్రా గణాల్ని వదిలి కేవలం మాత్రా సంఖ్యతో పాదలక్షణం చెప్పటంకూడా ఛందోగ్రంథాల్లో కనిపించేవిషయమే. ఇవన్నీ గమనిస్తే

పాదం గణసముదాయం కాదనీ, అక్షర సముదాయమేనని స్పష్టమవు తుంది. కాగా గణాల దృష్ట్యా పాదానికి అంతర్నిర్మాణమంటూ ఏదీ ఉండదు. నిజానికి పద్యపాదాల్లో గణపరిమితికి లొంగకుండా పదాలూ, పదాంశాలూ మించిపోవటమే అక్షరాధికంగా మనం చూస్తూంటాం. అయినా అంశాలను బట్టి పాదం అక్షరసముదాయమేననీ అంగీకరించక తప్పదు.

'ఇంతవరకూ తెలుగులో వచ్చిన పద్య పాదాలన్నిటినీ రాతతో గానీ, అచ్చుతోగానీ, పనిలేకుండా కనుక్కునే వీలుంది. ఏ పద్యాన్నయినా పాదవిభజన చేయకుండా పూర్వులు తాళపత్ర గ్రంథాల్లో ఒకే వరుసలో రాసే వాళ్లు అయినా, ఛందస్సు తెలిసిన వాళ్ళకి వాటిని. మళ్ళీ పాదబద్ధంగా రాయటం కష్టంకాదు. పాదవిభజన లేకుండా అచ్చువేసిన, (లేక రాసిన) వచనపద్యానికి ఈ వచనపద్య లక్షణ కర్తలు కవ్యుద్దిష్టమైన పాదవిభజన చేయగలరా ? కవ్యుద్దిష్టం కాకపోతే పోనీ, ఏ ఇద్దరు లక్షణ కర్తలయినా ఒకే రకపు పాదవిభజన చేయగలరా ? అని రామారావుగారి ప్రశ్న.

ఒకవిధంగా చూస్తే, ఇది నిజమేననిపిస్తుంది. ఒకసారి కుందుర్తి కూడా నన్ను దాదాపుగా ఇట్లాగే ప్రశ్నించినారు. వచనపద్య లక్షణ సమాకలనంలో 'ఇట్లాంటి ప్రశ్నల్ని గూర్చి నాతో నేనే కాకుండా, మరికొంతమంది మిత్రులతోనూ చర్చించి ఒక సమాధానానికి వచ్చినాను. అదే ముందు వివరిస్తాను.

అయితే, ఈ రామారావుగారి ప్రశ్నలో రెండంశాలున్నాయి. ఒకటి: పూర్వులు పాదవిభజన లేకుండా రాసినా, ఛందస్సు తెలిసిన వాళ్లు పాదవిభజన చేసుకోవటానికి వీలుండేది. రెండు : కవ్యుద్దిష్టంగా నయినా, కాకపోయినా వచన పద్యాన్ని పై విధంగా రాస్తే లక్షణ కర్తలుగానీ, ఏ ఇద్దరు లక్షణకర్తలుగానీ పాదవిభజన చేయగలరా! ఒకే విధంగా చేయగలరా ? వీటిని వరుసగా పరిశీలిద్దాం. పూర్వపు పద్యాల్లో పాదవిభజనకు ఉండిన వీలుకి కారణం అక్షర సంఖ్యతోనో, మాత్రా సంఖ్యతోనో, గణపద్ధతి ద్వారానో పరిచితమయిన ధోరణిలో

ఆ పాదాలు నియమితం కాసటం. అయితే, ఈ క్రింది పద్యపాదం, ఉదాహరణకి, చూడండి--

> 'మధురమధుర మైన మామిడిపండ్లను
> పంచియిచ్చు జనుడె మంచివాడు'

ఇది ఫలానా పద్యం అని చెప్పకుండా, ఇది ఏ పద్యపాదం అని అడిగితే రెండురకాలుగా చెప్పటానికి వీలున్నది. ఇది ఆటవెలది రెండుపాదాలూ కావచ్చు, సీసపద్యంలో ఒక పాదమూ కావచ్చు. మొదటి పంక్తిని 3 సూ. + 2 ఇం. గణాలుగా, రెండవ పంక్తిని 5 సూర్య గణాలుగా విభజిస్తే, ఆటవెలది. అట్లా కాకుండా రెండు పంక్తుల్నీ కలిపి ఆరింద్ర గణాలు + రెండు సూర్యగణాలుగా విభజిస్తే సీసపాదమూ అవుతుంది. రెండువిధాలా విభజించేందు కనువుగా పై పంక్తులున్నయి. ఇదే పద్ధతిలో మరికొన్ని పంక్తులు వరుసగా ఉంచేట్టయితే, ఇది ఫలానా పద్యం అని కవి చెప్పకుండా, కవి ఏ పద్యంగా ఉద్దేశించినాడో చెప్పటం కుదురదు. పాదాన్ని పట్టియ్యటం లో ఒకానొక సాధనమయిన (తెలుగులో మాత్రమే) ప్రాసనియతి ఈ రెండు పద్యాలకూ లేదు. యతి రెండింటా అనురేట్టుగానే ఉంటుంది. అయితే, ఇట్లాంటి స్థితి చాలా అరుదు. అయినా, ఒక ఉదాహరణగా మాత్రమే ఇక్కడ ప్రదర్శింపబడింది. మరొక అంశం ఏమిటంటే, కాళహస్త ప్రగంథాల్లో ఒకే వరుసలో పద్యాలు రాస్తూ పోయినా, చాలావరకు పాదాంతంలో ఒక నిలువుగీతా (।) పద్యాంతంలో రెండు నిలువు గీతలూ (॥) గీసి పాద, పద్యాంతాలను సూచించటం జరుగు తూనే ఉంటుంది.

ఇదిట్లా ఉండగా, అక్షర, లేక గణపద్ధతి నియతంగా ఉన్న ప్పుడు, అనుభూయ మానమయితున్నప్పుడు, పాదవిభజన లేకుండా రాసినా కూడా పాదవిభజన చేయవచ్చు.అక్కడ కవ్యుద్దిష్టంగా పాదవి భజన చేయటమన్న ప్రశ్నే లేదు ఉదాహరణకు ఉత్పలమాలా పద్యం ఉన్నదంటే ఒక కవి ఒక విధంగా మరో కవి మరో విధంగా త్రవు

ఉద్దేశ్యాల ననుసరించి విభజించటం జరుగనే జరుగదు. వారి ఇష్టా నిష్టాల ప్రసక్తి లేనే లేదు. ఆ పద్య ప్రపంచం నియతం. పాదాక్షర మాత్రా సంఖ్యా నియతం. (కొన్నిచోట్ల మాత్రా సంఖ్యలో వచ్చే తేడాలు గణ పద్ధతి ద్వారా పరిష్కృత మాయిపోయి.) ఆ నియతి ననుసరించి పదాలను కూర్చుకోవటమే కవి పని. అందువల్ల అక్షర, మాత్రాదుల నియతి ఉన్న చోట పాదవిభజనకు కవి ప్రయత్నించవలసిన అవసరం లేదు. ఇక పోతే, ఈ విధమయిన నియమం లేనిచోట కవి తనంతట తానే పాదాలను విభజించక తప్పదు. అందువల్ల అక్షర మాత్రాదుల నియతిలేని వచన పద్యం విషయంలో 'పాదవిభజన... లేకుండా రాసిన ...' ఇత్యాది ప్రశ్నే ఉత్పన్నం కాదు. వచన పద్యాన్ని పాద విభజన చేస్తూ రాయవలసిందే. కాళ పత్ర గ్రంథాల్లో మొదటినాళ్లలో అచ్చయిన కొన్ని గ్రంథాల్లోనూ పాద విభజన లేకుండా ఒకే వరుసలో పద్యాలుండటం చూస్తాంగాని, ఈనాటి అచ్చుగ్రంథాల్లో చూడటం లేదు. పాదవిభజన విషయంలో పాఠకుడు చికాకు పడగూడదనే కదా, ఈనాడు పాదవిభజన పూర్వ కంగా అచ్చువేయటం ! కాబట్టి ఈనాటి వచన పద్యాన్ని పాదవిభజన లేకుండా రాయటంగానీ, అచ్చువేయటంగానీ కుదురదు. పలుచోట్ల పత్రికల్లోనూ, గ్రంథాల్లోనూ, వ్యాసాల్లోనూ వచన పద్యాల్ని ఉదా హరిస్తున్న సందర్భాల్లో నిండు పంక్తులుగా రాస్తూ, పాదాంతాల్ని సూచించే విధంగా నిలువుగీతలు (కొన్ని చోట్ల ఏటవాలు గీతలు) గీయటం జరుగుతూనే ఉన్నది. పాదవిభజన, విభజన సూచన కూడా లేకుండా రాస్తే, ఆ రాసిన వ్యక్తి దాన్ని వచన పద్యంగా ఉద్దేశిస్తు న్నాడా లేదా అన్నది సందేహించాల్సిన విషయమే.

ఇక, ఏ లక్షణ కర్త అయినా కవ్యుద్దిష్టంగా పాదవిభజన చేస్తాడా? ఏ ఇద్దరు లక్షణ కర్తలయినా ఒకే విధంగా పాదవిభజన చేయగలరా ? అన్నది విచారిస్తే, 'కవ్యుద్దిష్టంగా పాదవిభజన' అంటే పాదవిభజనకు కవి ఉద్దేశించింది ప్రధానమనీ, ఆయన ఉద్దేశించిన రీతి మీద పాదవిభజన ఆధారపడి ఉంటుందనీ అనిపిస్తున్నది. అట్లాగే

అయితే, కవ్యుద్దిష్టంగా మరొకరు పాదవిభజన చేయనవసరంలేదు కవే చేస్తాడు. పేచీలేదు. కాకపోతే, తన ఉద్దేశ్యం ప్రకారం పాదవిభజన చేసి వచన పద్యం రాసుకుని, పాదవిభజన లేకుండా నిండు పంక్తులుగా మళ్లీ రాసి, లక్షణ కర్త ముందుంచి పరీక్ష పెడితే, అప్పుడు ఆలోచించవలసి వస్తుంది. పాదవిభజనకు లక్షణ కర్త ఏదైనా పాదవిభాజక సూత్రాన్ని ఏర్పరుచుకుంటే, దాన్ని బట్టి ఆ పంక్తుల్ని పాదాలుగా విభజిస్తాడు. అప్పుడు—— ఏర్పడిన పాదవిభాజక స్వాతంత్ర్యంగా ఉంటుంది, కాబట్టి- 'కవ్యుద్దిష్టత'కు ప్రాధాన్యం లేదు. కాగా, విభాజక సూత్ర ప్రామాణ్యానికి ప్రాధాన్యం. విభాజక సూత్రం అంగీకృతమయితే, పాదవిభజన దాన్ని అనుసరించే జరుగవలసి ఉంటుంది, 'మ-స-జ స-త-త గ' అన్న క్రమాన్ని ఒప్పుకున్నాక, దాన్ని బట్టే శార్దూలవిక్రీడిత పద్య పాదవిభజన జరిగినట్లు కవ్యుద్దిష్టత కక్కడ ప్రాధాన్యం లేనట్టు. ఇక పోతే, ఏ ఇద్దరు లక్షణ కర్తలయినా ఒకే విధంగా పాదవిభజన చేయటానికి వీలున్నదా ? అంటే, లేదనే వీలు లేదు. ఆ ఇద్దరు లాక్షణికులు పాదవిభజన సూత్రాన్ని సమంగా ఉపయోగిస్తే, ఒకే విధంగా పాదవిభజన జరిగే వీలుంది. ఒకప్పుడు సూత్రోపయోగంలో తేడా రావచ్చు ఆ రావటం ఎట్లాంటి దంటే, వెనుక, 'మధుర మధుర మైన...' అన్న చోట ఒకలక్షణ కర్త ఆటవెలదిగా విభజిస్తే, మరొకరు సీసపాదంగా విభజించటంలో వచ్చి నటువంటిది. సాంప్రదాయిక ఛందస్సుల్లోనూ సమాన ప్రమాణాల్ని అనుసరించటం వల్లనే, ఆ పాద విభజనలో సమానత్వం కనిపిస్తుంది. లేని చోట లేదు. అందుకని, ఎక్కడయినా సరే, ప్రమాణ సమానత్వం అవసరం.

ఇంతకూ, వచన పద్య పాద విభజనకు సూత్రమేమిటి?

కీ. శే. బాల గంగాధరతిలక్ రాసిన ఒక భాగాన్ని ఉదాహరించి పాద విభజనకు ఆధారాలేవీ లేనట్లుగానే రామారావుగారు రాసినారు. ఇదివరకటి నా వ్యాసాల్లో పాద విభజనకు ఒక సూత్రాన్ని ప్రతిపాదించటం జరిగింది. అది భావాన్ని పురస్కరించుకొని చేసింది. మొదట్లో ఈ ప్రతిపాదన స్థూలంగా చేయటం జరిగింది. కాని, అప్పటికి

ఈ ప్రతిపాదనకు ఆధార ప్రమాణం లభించలేదు. వెదకగా పరిశీలిస్తే బుక్కుల్లో పాద విభజనకు సంబంధించిన ఒక సూత్రం కనిపించింది.

'తేషాంఋక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా' 2. 1. 35. అని జైమినీయ మీమాంసా సూత్రం. ఋక్కుల్లో పాదవ్యవస్థ అర్థాన్ని బట్టి ఉంటుందని ఆ సూత్రం స్పష్టపరుస్తున్నది. దాన్ని అనుసరించి, అక్కడ అర్థాన్ని బట్టి కాగా, వచన పద్య విషయంలో 'భావాన్ని బట్టి పాదవ్యవస్థ' అన్నాను. అర్థం, భావం అన్న మాటలే తేడా. కాబట్టి, భావాన్ని అనుసరించి వచన పద్యంలో పాదవిభజన జరుగటానికి అభ్యంతరం ఏమీ ఉండనక్కరలేదు.

భావాన్ని బట్టి వచన పద్య పాద విభజన చేయటమంటే, అది రెండు రకాలుగా ఉంటుంది. ఒకప్పుడు భావాంశాలను బట్టి పూర్తి కావచ్చు. అంటే, భావాన్నీ, భావాంశాన్నీ బట్టి వచన పద్యంలో పాదవిభజన జరుగుతుంది. ఉదాహరణకు 'అనలతోరణం' అన్న శీర్షిక లోని ఒక వచన పద్యం—

ప్రాణాలు బిగపట్టుకొని
సాగేరు ప్రయాణికులు
నాయకుడు తిరిగి వస్తాడనీ
తుపాను శమిస్తుందనీ
నదిపొంగు తగ్గేననీ
ఆశతో ఆహారహామూ !
దేనికైనా ఉద్ధృతి ఎంతసేపు ?
దానికి వ్యతిరిక్తం తప్పదా పైనా.

—మాదిరాజు రంగారావు.

ఇందులో మొదటి ఆరుపాదాలూ భావాంశాలనుబట్టి విభక్తమయినయి, చివరి రెండు పాదాలు భావాన్నిబట్టి. ఇందులో ప్రయాణికులు సాగటం ప్రధాన భావం. ఆ సాగటం ప్రాణాలు బిగపట్టుకొని. అంతేకాదు,

ఆశతో అహరహమూ సాగుతున్నది. అందువల్ల, 1, 6 పాదాలు భావాంశాలతో ఏర్పడ్డయి. కాగా, ఆ నపాదంలోని 'ఆశ'కు సంబంధించినయి 3, 4, 6 పాదాలు. చివరి రెండు స్పష్టమే.

ఈ విధంగా వచన పద్యాన్ని పరిశీలించుకుంటూ పోతే పాద విభజనను నిర్ధారించటం కష్టమేమీకాదు. రామారావుగారుదాహరించిన కె. వి. రమణారెడ్డిగారి 'బాధాగాథము' అన్న ఈ కింది వచన పద్యంలో—

'పాపి కొండలకావల నిజాం గజాంకుశం కాలేదూ నీవు!
కోనసీమలో, లంకసీమలో, పాపాలదీపాల నార్పలేదూ
నీవు? పిచ్చుకత్తుల బోనుకెక్కలు ప్రసించలేదూ
రాత్రిని కప్పుకొని ధాత్రిని మప్పుకొని చరించలేదూనీవు?'

ఈ పాదాలు భావాంశాలను బట్టిగాక, భావాన్ని బట్టి విభజింపబడినయి. అయితే, ఇక్కడ ఒక అంశం. మూడో పాదం మొదట్లో ఉన్న 'నీవు?' (ప్రశ్న చిహ్నంతో సహా) తొలగనైనా తొలగాలె, లేదా, రెండో పాదం చివర్నయినా చేరాలె. అట్లా జరక్కుండా పైన ఉన్నట్లే కవ్యుద్దిష్టమయిన పాద విభజన అంటే, మూడో పాదం మొదట 'నీవు?' ఉండటంలోని సామంజస్యం వివరించబడవలసి ఉంటుంది. వచన పద్య పాద విభాజక సూత్రం దృష్ట్యా నిజానికి ఆ 'నీవు?' (సప్రశ్న చిహ్నంగా) రెండో పాదం చివర ఉండవలసి ఉంటుంది. 'వచన పద్యములనుకూడా అతిక్రమించి, ఆవేశ ధిక్కారకంగా, అంతర్లయాన్వితంగా సాగిన ఈ కావ్యం కావ్యోపన్యాసమన దగింది' అని రమణారెడ్డి అంటే, నాకు అభ్యంతరం లేదు. (వచన పద్యములను కూడా అతిక్రమించటమంటే. పైనచూపబడ్డ వ్యతిక్రమమేనా?) అయితే, ఇక్కడ కావ్యంగానీ, ఉపన్యాసంగానీ, కావ్యోపన్యాసంగానీ ప్రస్తుతం కాదు. (ఇవేవీ పద్య స్వరూపాన్ని బోధించవు) అది వచన పద్యం కాబట్టి దాని స్వరూపం ప్రధానం. నాలుగు పాదాలలో ఈ రచన కనిపిస్తున్నప్పుడు 'అచ్చులో కూడ

పాదబద్ధత పాటించలేద'ని రామారావుగారంటున్నారు. మరిదెట్లా? ఈ అచ్చులో కనిపించే పాద స్వరూపం-కొంచెం లోపం ఉండవచ్చుగాక-చేసిందెవరు? ఇక, వచనపద్యాన్ని రాస్తూ, ఆ రాసిందాన్ని 'వచన పద్యం అనదలచుకోలేదు' అని ఎవరయినా అంటే, అనదలచుకోకపోవటం వారి స్వంతత విషయం. ఆ ప్రవృత్తిని గూర్చి ఎవరినీ ఎవరమూ ఏమీ అనలేం. అనదలచుకోనంత మాత్రాన, అది అయ్యేదయితే, కాకుండాపోదు.

తిలక్ రాసిన 'రాత్రివేళ' అనే ఖండికలో ఒక భాగం—రామారావుగా రుదాహరించిన రీతిలో ఈ విధంగా ఉంది.

నిర్జనస్థలం, ఎవ్వరూలేరు, చుట్టూ పరచుకొన్న మైదానపు
నగ్నదేహాన్ని స్పృశించబోయే నిచులశాఖాగ్రపు వృక్షాగ్రపు
తొందర, నిశ్శబ్దం మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తోంది,
ఆకాశం
మీద ఒక చుక్క మరో నక్షత్రంతో మాట్లాడేమాట మనసుకి
వినిపిస్తోంది.

ఇది అయిదు పంక్తులుగా కనిపిస్తున్నది. 'పాద బద్ధతకు లొంగనివి కూడా ఆధునిక కవిత్వంలో కొన్ని ఉన్నై' అంటూ, పై భాగాన్ని ఉదాహరించి రామారావుగారు —'ఇందులో పాద విభజనకు ఆధారాలేమిటో నా కర్థం కావటం లేదు. ముఖ్యంగా మూడో పాదం 'ఆకాశం'తో అంతం కావటానికి హేతువు ఎవరయినా చెప్తే సంతోషిస్తా' నన్నారు. పాదబద్ధతకు లొంగనివికూడా ఆధునిక కవిత్వంలో ఉన్నయ్యంటే, ఆ లొంగకపోవటం ఎట్లాంటిది? పాదబద్ధతకు లొంగకపోవటమన్న మాట. వచన పద్యమయి అది పాదబద్ధతకు లొంగకపోతే, అది దోషమే. ఆధునిక కవిత్వంలోని ఆ 'కొన్ని' వచన పద్యాలయితేనే మనం ఇక్కడ ఆలోచించవలసి ఉంటుంది. ఆ కొన్ని వచన పద్యం దృష్ట్యా ఛందోదోష జుష్టాలనే అనవలసి ఉంటుంది, ఉదాహృతమైన తిలక్ రచనా భాగాన్ని రామారావుగారు 'వచన

పద్యం'గా భావించినారనీ, అందుకనే ప్రస్తుత సందర్భంలో ఉదాహరించినారనీ అనుకోంటాను. అట్లా భావించినారు కాబట్టే 'ఇందులో పాద విభజనకు ఆధారం లేమిటో నా కర్థం కావటంలేదన్నారు'. మూడోపాదం 'ఆకాశం'తో అంతం కావడానికి హేతువును ప్రశ్నిస్తున్నారంటే, పై భాగంలో పాద విభజన జరిగిందనీ, కాని మూడో పాదం చివర 'ఆకాశం' అనే పదం ఉండటం సహేతుకం కాదని వారు భావిస్తున్నట్టు స్పష్టమయితుంది. రామారావుగారు ఒక్క 'ఆకాశం' విషయమే ప్రస్తావించినారుగాని, పై భాగం, అది ఉదాహృత రూపంలోనే ఉన్న స్థితిలో, మూడోపాదం మొదట 'తొందర' ఉండటం, నాల్గో పాదం చివర 'మనసుకి' ఉండటమూ, ఇంకా మరి కొన్ని కొట్టొచ్చినట్టు కనిపించే దోషాలు. వీటన్నిటినిబట్టి చూస్తే, ఉన్న స్థితిలో ఉదాహృతమయిన భాగం పాదవిభజన దృష్ట్యా దోషయుతమయిన వచన పద్యమని చెప్పవలసి వస్తున్నది. ఈ దోషాలు కవయితవల్లనే జరిగినవయో, అచ్చు వేయటంలో పొరపాటున జరిగినవయో చెప్పలేము. వచనపద్య పాదవిభాజక సూత్రాన్ని అనువర్తింప జేసి పాదవిభజన చేస్తే పై ఉదాహృత భాగం ఈ క్రింది విధంగా ఉండాలె.

నిర్జన స్థలం
ఎవ్వరూ లేరు
చుట్టూ పరచుకున్న మైదానపు నగ్న దేహాన్ని
స్పృశించబోయే నీచుల శాఖాగ్రపు వ్యగ్రపు తొందర
నిశ్శబ్దం మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తోంది
ఆకాశం మీద ఒక చుక్క మరో నక్షత్రంతో మాట్లాడే మాట
మనసుకి వినిపిస్తోంది.

ఇట్లా కాకుండా మరొకరు ఇంకో విధంగా విభజించటం జరిగితే, దానికి కారణం భావాంశాల్ని బట్టి ఇంకా కొంచెం ఎక్కువ పాదాలుగా విభజించాలనుకోవటం కావచ్చు. ఉదాహృతమయిన స్థితిలో

పాదాల విషయంలో రామారావుగారు నాతో ఏకీభవిస్తూనే ఉన్నారు కాబట్టి, ఆ అంశాలను గూర్చి పేచీయే లేదు.

ఇక, నేను ప్రతిపాదించిన భావగణాలను గురించి వివరిస్తాను.

వచనపద్య పాదవిభజనకు అక్షర, మాత్రాదుల సంఖ్య కాక భావాన్ని, భావాంశాలనూ ఆధారంగా తీసుకున్న విషయం ముందే వివరించబడింది. కాగా, వచనపద్య పాదంయొక్క అంతర్విభజనకూ కూడా అదే భావ, భావాంశాలు మౌలికంగా స్వీకరించబడ్డాయి. సాంప్రదాయిక ఛందస్సుల్లో 'గణం' అన్న పదం విస్తృతంగా పాదంయొక్క అంతర్విభజన విషయంలో ఉపయుక్తమయితున్న కారణంగా, ఇక్కడకూడా ఆ గణం అన్న పదాన్ని—అక్కడి అర్థంలో కాక—సాంకేతికంగా స్వీకరించి 'భావగణం' అన్నాను. ఈ 'భావగణం' స్వరూపాన్ని సులభంగా స్పష్టీకరించటానికి పూర్వపు నా వ్యాసాల్లో—

ప్రతిమాటకీ శక్తి ఉంది పదును ఉంది
ప్రతిమాటకీ అర్థం ఉంది ఔచిత్యం ఉంది.

అన్న తిలక్ రచనలోని పాదాల్ని ఉదాహరించటం జరిగింది. వాటినే మళ్లీ ఉదాహరించి రామారావుగారు— 'ఇక్కడ 'కి'- విభక్తి బంధం ఒక గణం, తరువాత వచ్చిన నామం, క్రియ కలిసి ఒక గణం. 'శక్తి, పదును, అర్థం, ఔచిత్యం' అనేవి ఒక రకపు (నామ) గణాలుగానూ, 'ఉంది' అనేది ఒక (క్రియా) గణంగానూ ఎందుకు విభజించకూడదు? *'శక్తి ఉంది'* అనేది ఒకభావమా? రెండు భావాలా? *'ప్రతి మాటకీ శక్తి'* అనేది ఒక గణం ఎందుకు కాకూడదు? భావాలను వేరు చేసే నిర్దిష్ట సూత్రాలేమిటి? వీటికి (objective criteria) ఏమైనా ఉన్నయ్యా? కేవలం Arbitrary గా చేసే విభాగమేనా? ఈ ప్రశ్నల్లో వేటికీ సమాధానాలు దొరకవు' అన్నారు.

దొరుకుతవేమో, చూద్దాం.

నేను పై ఉదాహృత వచనపద్య పాదాలను విభజించింది క్రియా, నామ గణాలన్న ధోరణిలో కాదు, భావస్ఫూర్తిననుసరించి. ఈ విభజనలో ఒకప్పుడు ఒక పదసముదాయం ఉండవచ్చు, పదబంధం ఉండవచ్చు. ఒకే పదంకూడా ఉండవచ్చు. 'కి-విభక్తి బంధం ఒక గణం' అన్న రీతిలో విభజిస్తే 'కి'-విభక్తి బంధం ఉన్న ప్రతిచోటా అది ఒక గణం కావలసి వస్తుంది. కాని, అట్లా కాదు. కాబట్టి, ఆ నామ, క్రియా, విభక్తి పద్ధతి కుదురదు. 'ప్రతిమాటకి' ఒక గణం కావటం అక్కడి రెండు పదాలనీ కలిపి అవ్యవహితంగా ఉచ్చరించినప్పుడు కలిగే భావస్ఫూర్తిని బట్టి. 'శక్తి' మొదలయినవి నామాలే అయినా, 'ఉంది' క్రియే అయినా గూడా, ఆ రెంటి కూర్పు మొత్తాన్ని 'గణం'అనటం, ఆ కూర్పు వల్ల అక్కడ భావస్ఫూర్తి ఉండటంవల్లే. ఈ స్ఫూర్తిని కవి ఉద్దేశించి ఉండకపోతే 'ప్రతిమాటకీ శక్తి పదునూ అర్థం ఔచిత్యం ఉన్నాయి' అని ఉండేవాడు. అట్లా అనకుండా అన్ని 'ఉంది'లను ప్రయోగించినాడు. 'ప్రతిమాటకీ' అన్నదాన్ని రెండుసార్లు (ఉభయ పాదాలకూ మొదట్లోనే) ఉపయోగించినాడు. ఎక్కడి 'ఉంది' అక్కడి వెనుకటి పదంతోటి కలిసి ఉండవలసిందే తప్ప, విడిపోయే వీలు లేదు. కాబట్టి 'శక్తి ఉంది' ఇత్యాదులు ప్రత్యేకం ప్రత్యేకంగా భావగణాలని చెప్పటం జరిగింది. 'శక్తి ఉంది' అనేది ఒక భావమా? రెండు భావాలా? అంటే, నా మటుకు నేను ఒకటే ననుకుంటున్నాను. 'ప్రతిమాటకీ శక్తి' ఒక గణం ఎందుకు కాకూడదని ప్రశ్న. ఎందుకు కాకూడదంటే, 'శక్తి' తరువాత 'ఉంది' అనేది ఉంది కాబట్టి ఈ 'శక్తి' ఆ 'ఉంది' తోటి కలిసి ఉండేదే తప్ప 'ప్రతిమాటకీ' తోటి ఉండేది కాదు. ఇకపోతే, భావగణాలను వేరు చేసే నిర్దిష్ట సూత్రం భావమే మరి.

ప్రశ్నలకు సమాధానాలు దొరుకవంటూ, – "అందుకే, సంపత్కుమార (1967) 'ఇక్కడ అర్థాన్నిబట్టి గణ విభజన అభాస రూపంగా చేయవచ్చు' నన్నారు. వారి భావగణాలు అభాసాలే తప్ప

నిర్దిష్టమైనవి కావని వారే అంగీకరిస్తున్నారు. ఈ ఆభాస గణాలు వచన పద్యాన్ని నిగ్రహించలేవు కాబట్టి వాటిని నిరాకరించాల్సి వస్తున్నది" అన్నారు రామారావు గారు.

ఇక్కడ ఒక విషయం స్పష్టం చేయవలసి ఉన్నది. సాంప్రదాయిక ఛందస్సుల్లో 'గణం' ఒక నిర్దిష్టార్థంలో ప్రసంశము ఉంది. మరి, వచన పద్యం విషయంలో 'గణం' ఆ నిర్దిష్టార్థంలో కాక, ఔపచారికంగా, కేవలం ఛందో మర్యాదా స్ఫూర్తి కోసం వాడబడింది. అందువల్ల ఇక్కడ 'గణం' అనేది ఆభాసమే అవుతుంది. కాగా, ఆభాస రూపంగా గణవిభజన చేయవచ్చునన్నాను. ఒక భావం, లేదా భావాంశాన్ని (ఇంకా చిన్న విభాగాన్ని, అవసరమయితే -) 'గణం' అనటం కుదురదు. సాంప్రదాయిక ఛందస్సుల పాద విభజనలో 'గణ' పద్ధతి ఉంది కాబట్టి, ఆ స్ఫూర్తి కోసం వచన పద్య పాదాంతర్విభజనలోనూ - ఆ విభజనకు 'భావం' ఆధారం కాబట్టి - భావగణం అనటం జరిగింది. మరొకటి. భిన్న భిన్న వచన పద్య పాదాల్లో అక్కడ భావాన్ని (భావాంశాన్ని) స్ఫురింప జేసే పదాల స్థితినిబట్టి భావగణ విభాజకరీతి ఉంటుంది. భావగణ స్వరూపంలో భేదం ఉండవచ్చుగాని, భావగణం మాత్రం ఉంటుంది.

'అసలు విషయం ఏమిటంటే, భావాన్ని గణాలుగా విభజించటం సాధ్యంకాదనీ, మీరు విభజించింది వ్యాకరణ రూపైకత ఉన్న పద సమూహాలు కాబట్టి వీటిని న్యాయంగా వ్యాకరణ గణాలు అనాల్సి ఉంటుందని తెలుస్తున్నది. వ్యాకరణ గణాలు వాక్య శబ్ద నిర్మాణానికి సంబంధించినవి. వాటి ఆవృత్తి ఒకే శబ్దంతో అయితే పునరుక్తి, భిన్నశబ్దాలయితే అనుప్రాస అవుతుంది. అవి(సంపత్కుమార భావగణాలంటున్న వ్యాకరణ గణాలు) పద్య బాహ్య స్వరూపానికి అవసరమైన గణాలు కావనీ, వాక్యనిర్మాణానికి అవసరమయిన కూర్పు అనీ తెలుస్తున్నది. పద్య నిర్మాణం వేరు, వాక్య నిర్మాణం వేరు. వేటి సూత్రాలు వాటి కున్నై' అన్నారు రామారావుగారు.

సాంప్రదాయిక ఛందస్సుల్లో భావంతోగానీ, అర్థంతో గానీ నిమిత్తం లేకుండా గణ విభజన అక్షర మాత్రా సంఖ్యలను బట్టి జరుగుతుంది. కాబట్టి వాక్య నిర్మాణరీతికి సంబంధించిన అంశాల ప్రసక్తి అక్కడ ఉండదు. మరి వచన పద్యంలో భావాన్ని ప్రధానాధారంగా స్వీకరిస్తున్నాం కాబట్టి, భావస్ఫూర్తిని కలిగించే పదాల కూర్పు, వాక్య నిర్మాణ రీతి - వీటి కిందులో ప్రవేశం ఉండక తప్పదు. అంత మాత్రాన ఇక్కడ భావగణ విభజనకు కేవలం వ్యాకరణ రూపైకతే ప్రధానమని చెప్పటానికి వీలులేదు. ఆ వ్యాకరణ రూపైకత ఉండవచ్చు, ఉండక పోవచ్చు. మనం గ్రహించిన ఉదాహరణంలోనే 'ప్రతిమాటకీ' అనే దానికీ, 'శక్తి ఉంది' అనే దానికీ ఉన్న వ్యాకరణ రూపైకత ఏమిటి? 'వ్యాకరణ రూపైకత ఉన్న పదసమూహాలు' అంటే, ప్రతి పద సమూహంలోని పదాలన్నీ, లేదా చివరి పదం వ్యాకరణ రూపిత పద్ధతిలో సమ ప్రత్యయాంతం కావటమో, లేక నామ క్రియాదులు సమంగా ఉండటమో అయి ఉంటుందనుకుంటున్నాను. 'శక్తి ఉంది' 'పడును ఉంట' అన్న పద సమూహాలు సమ క్రియాంశాలు కావటం వల్ల ఈ సమూహాల మధ్య వ్యాకరణ రూపైకత ఉన్నదనటానికి ఆస్కారం ఉంది కాని, 'ప్రతిమాటకీ' అన్న దానితో వీటికున్న వ్యాకరణ రూపైకత ఏమిటో తెలియదు. నిజానికి నేను చెప్పిన భావగణ విభజనకు రామారావుగారు చెప్పిన వ్యాకరణ రూపైకత ఆధారసూత్రం కానేకాదు. అందువల్ల భావగణాలూ, వారు ఉన్నాయంటున్న వ్యాకరణ గణాలూ ఒకటి కావటానికి వీలులేదు.

ఇదిట్లా ఉండగా, సాంప్రదాయిక ఛందస్సులోనూ ఈనాడు మనం పద్యాల్ని చదువుకొనేటప్పుడు ఛందోగణాల్ని బట్టి విభజించి చదువుకోము. పాదవిభజన గూడ కచ్చితంగా పాటించం.

ఉదాహరణకు—

సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపడే,
పరి......

అన్న పద్యపాదాన్ని ఆ మత్తేభవిక్రీడిత పద్యానికి నిర్ణీతంగా ఉన్న స-భ-ర-న-మ-య-లగ అన్న గణాలుగా విభజించి ఎవరూ చదువరు. భావస్ఫూర్తి ననుసరించి, సిరికిం జెప్పడు ; శంఖచక్రయుగముం ; జేదోయి సంధింపడు ; ఏ పరివారంబును జీరడు ; ...' ఇత్యాదిగా చదువుకుంటారు అట్లాగే___

నెలలు నిండిన సతిబాయి వెరి తపింతు
నా, నిలుపులేని రాజ్యాంగ తంత్రము దలంతు
నా, పగలు గొన్న చుట్టాల ననుసరింతు
నా, యొకనిబట్ట దైవ మిట్లాడనేల

— గడియారం వేంకటశేషశాస్త్రి గారి
"శివభారతము"

అనే పద్యాన్ని '...తపింతునా ... తలంతునా ...అనుసరింతునా అనే చదువుతారే తప్ప, '...తపింతు నాని, లుపు...' తలంతు నా పగలు ... అను సరింతు నా యొకని...' అని చదువరు. ఇక్కడ పద్యంలోని ఛందోగణాలేమిటి? అవి ఎక్కడ విరుగుతాయి? అనేది చదువరికి ముఖ్యంకాదు. ఎక్కడ ఎట్లా విరిచి చదువుకుంటే భావస్ఫూర్తి కలుగుతుందనేది ముఖ్యం. వచన పద్యపాఠం విషయంలోనూ చదువరికి సంబంధించిన ఈ ముఖ్యాంశాన్నే ప్రధానంగా స్వీకరించి అటు కవి, ఇటు లక్షణకర్తా సాగవలసి ఉంటుంది. భావగణ విభజన విషయంలో ఈ అంశమే ప్రధానమయినది. 'సిరికిం జెప్పడు.. చేదోయి సంధింపడు' మొదలయిన చోట్ల వ్యాకరణ రూపైకత ఉన్న పద సమూహాలున్నాయని, వాటికి వ్యాకరణ గణాలనటానికి వీలుంటుందా? ఆ పద్యాల నిర్మాణంలో ఛందోగణాలు ప్రధానం కాబట్టి అట్లా అనటానికి వీలులేదు. అట్లాగే వచనపద్యంలో భావప్రాధాన్యం కాబట్టి ఇక్కడా అనటానికి వీలుండగూడదు. అయితే, వచనపద్య నిర్మాణంలో భావస్ఫూర్తి విషయికంగా వాక్యనిర్మాణరీతికి ప్రవేశం ఉందికాబట్టి, వ్యాకరణ రూపైకత అక్కడక్కడా భావగణ విభజనలో కనిపించటం

సహజమే. అంతమాత్రాన వ్యాకరణ రూపైకతవల్లనే సర్వత్రా భావ గణ విభజన జరుగుతుందనటానికి వీలులేదు.

ఛందశ్శాస్త్రంలో గణాలు పరిమితాలు. నిజమే. అయితే, 'భావ గణాల సంఖ్య ఎంత? భావాలు ఎన్ని ఉంటాయో భావగణాల సంఖ్య అంత అన్నమాట. భావాలు ఎన్ని ఉంటాయో ఎవరు అంచనా వేయగలరు? అనంతమైన భావగణాలున్నప్పుడు వాటి వ్యవస్థ ఏమిటి?' అంటారు రామారావుగారు. అక్షర, మాత్రా సంఖ్యానియమం ఉన్నచోట ఛందశ్శాస్త్రంలో గణాలు పరిమితాలు కాక తప్పదు. సంఖ్యానియమం-- అదీ మూడింటికి నియతం చేసుకోవటంవల్ల -- అవి పరిగణనీయాలే. కానీ, వచన పద్య పాదాలకు సంబంధించినంతవరకు అక్షర, మాత్రాదుల సంఖ్య నియతం కాదు. అందువల్ల ఆ సూత్రం ఇక్కడ అనువర్తించదు. నిజానికి భావగణం ఒక్కటే. సాంప్రదాయిక ఛ్ఛందో రీతిలో 'దూరము దుంపలు, దుఃఖము, దుర్గతి' అన్నవి, ఆదిలో ఉండవలసిన గురువర్ణ స్వరూపంలో నాల్గురకాల మార్పులున్నా గూడా ఆ మూడక్షరాల గుంపులు నాల్గింటినీ 'భగణం' అనే అంటారు తప్ప, నాల్గు రకాలకు నాల్గు పేర్లు లేవు. అంటే, గణంలోని వర్ణాల స్వరూపంలో మార్పు ఉన్నా గూడా దాన్ని ఒకే గణంగా పరిగణించవచ్చునన్నమాట. అదే విధంగా భావాన్ని ఆధారం చేసుకొని పదాల స్వరూపంలో, వాటి కలయికల్లో ఎన్ని భేదాలున్నా గూడా అది భావ గణమే. అది ఏకైకం. మరి ఇంతగా భావగణాల్ని గూర్చి చెప్పటమెందుకంటే, వచన పద్య పాదవిభజనను క్రమబద్ధం చేయటానికే.

'ప్రతి మాటకీ శక్తి
ఉంది పదును ఉంది'

అన్న విధంగా విభజించకుండా ఉండటానికే. 'శక్తి ఉంది' 'ఆకాశం మీద' వంటి భావగణాలు ఉభయ పాదాల్లోకి అభివ్యాప్తం కాగూడదనటానికే. భావాన్ని, భావాంశాల్ని బట్టి పాదవిభజన చేసేప్పుడు, భావ గణం ఒక పదంగా గానీ, పద బంధంగా గానీ, పద సమూహంగాగానీ

ఉండేట్టయితే, దాన్ని రెండు పాదాల్లోకి వ్యాపింప చేయకూడదు. సాంప్రదాయికచ్ఛందస్సుల్లో తెలుగువారు ఒకే పదాన్ని ఒక పాదం నుంచి తరవాతి పాదంలోకి సాగింపజేయటం ప్రసిద్ధమే— 'రాజకు లైకభూషణుడు .. .. అన్యరాజతేజోజయశాలి ...' అన్నట్లు. పదమే కూడదన్నప్పుడు, భావగణం ఉభయ పాదాల్లోకి వ్యాపించటం అసలే కూడదు

ఈ విధంగా, వచన పద్యానికి పాద బద్ధత ఉన్నదనీ, పాద విభాజక సూత్రమున్నదనీ, పాదం అంతర్విభజనకు భావగణ పద్ధతి కుదురుతుందనీ రామారావుగారి వ్యాసాన్ని పురస్కరించుకొని సాగిన ఈ వివరణలో స్పష్టం చేయటమయింది. కాగా, వచన పద్యం పద్యమే ననీ, గద్యంకాదనీ నిశ్చయం.

నియమ రాహిత్యం వచనపద్య లక్షణం కాదు.
నియమ సాహిత్యం దాని కున్నది.

(భారతి. జులై . 1972 పే. 55-66)

# వచన పద్యం
# ఛందో విభాగం కాదు

—చేకూరి రామారావు

ఆంధ్ర పత్రిక 1972 ఉగాది సంచికలో అచ్చయిన 'వచన పద్యం : ఆభాసలక్షణ నిరాకరణం' అనే వ్యాసంలో, వచన పద్యం లేక వచనకవిత అనే పేర్లతో ప్రచారంలో ఉన్న కవితారూపానికి ప్రతిపాదితమయిన లక్షణాలను విపులంగా చర్చించి, హేతుబద్ధంగా లేవని నిరాకరించాను. ఆ చర్చలో సంపత్కుమార తమ వివిధ వ్యాసాల్లో (1962, 1965, 1967, 1970) ప్రతిపాదించిన సిద్ధాంతాలను విశేషంగా విమర్శించి, అవికూడా శాస్త్రచర్చకు నిలవ్వని నిరూపించే ప్రయత్నం చేశాను. మళ్లీ సంపత్కుమార తమ పూర్వ ప్రతిపాదనలలో కొన్నిటిని సమర్థించుకుంటూ 'వచనపద్యం : లక్షణ నిరూపణం' అనే వ్యాసం ప్రకటించారు వారు తమ సమాధానంలో ప్రస్తావించని నా విమర్శల నన్నిటినీ వారు ఒప్పుకున్నట్లు కాదు. వాటిల్లో కొన్నిటినికాని, అన్నిటినికాని ఎప్పటికైనా ఖండించే హక్కు వారి కున్నదని గుర్తిస్తూ, ప్రస్తుతం వారు చర్చించిన విషయాలకే ఈవ్యాసం పరిమితం చేస్తాను.

సంపత్కుమార తమ వ్యాసంలో, నా పూర్వ వ్యాసంలోని కొన్ని వాక్యాలను మరీ సాగదీసి వైరుద్ధ్యాలను చూపించటానికి ప్రయత్నించారు. ఉదాహరణకు 28వ పేజీ రెండో పేరాలో 'అనియతత్వం లక్షణం కానప్పుడు నియమరాహిత్యం మాత్రం లక్షణమెట్లా అయితుంది ?' అనే ప్రశ్న అట్లాంటిది. అట్లాంటి ప్రశ్నలకు 'ఈ

వ్యాసంలో సమాధానాలుంటవు. ఇటువంటి వైరుధ్యాలు సంపత్కుమార వ్యాసంలో నుంచి కూడా చూపించటానికి వీలు లేకపోలేదు. అయినా, ఇక్కడ ఆ పని జరగదు

పైన పేర్కొన్న సంపత్కుమార వ్యాసంలో ఆయన చెప్పిన అభిప్రాయాలను సాధ్యమయినంతవరకు సానుభూతితో అర్థం చేసుకుంటూ, ఆయన వాదాలు చర్చకు నిలుస్తయ్యా, నిలవ్వా ? అనేదే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొని, చేతనైనంత హేతుబద్ధంగా పరిశీలించే ప్రయత్నం ఈ వ్యాసంలో చేస్తాను.

నేను 'వచనపద్యం' అనే పేరును గురించి అంతగా పట్టించుకోలేదన్న విషయం సంపత్కుమార సరిగ్గా గ్రహించారు. నా చర్చలో ఈ పేరు అంత ప్రధానం కాకపోవటమే అందుక్కారణం. సంపత్కుమార ఈ పేరునే ఎన్నుకోవటానికి గల కారణాలను పరిశీలించాను. ఆయన ఈ కవితా పద్ధతిని పరిశీలించిన దృక్కోణం నుంచి చూస్తే ఈ పేరు అందుకు సరిపోతుంది.

నేను నిరాకరించిన అంశాల్లో వచనపద్యానికి ప్రతిపాదించిన పాదబద్ధత అనేది కేవలం ఒక అంశం మాత్రమేకాక, చాలా కీలకమైనది కూడా. అందువల్ల, సంపత్కుమారగానీ, నేనుగానీ దాన్ని గురించి విశేషంగా చర్చించాం. పద్యపాదానికి అంతర్నిర్మాణమూ (ఇంటర్నల్ స్ట్రక్చర్), బాహ్య పరిమితి (ఎక్స్టర్నల్ లిమిట్) ఉండాలని నా వాదన. ఆ సందర్భంలో పాదం కేవలం అపిరసముదాయం కాదని, అవి గణాలుగా ఏర్పడాలని అన్నాను. పద్యపాదాలకు అంతర్నిర్మాణం ఉన్నదనటానికి గణవిభజనను ఆధారంగా చూపించాను. గణవిభజన కేవలం సౌలభ్యం కోసం ఏర్పడిందేననీ, పద్యపాదానికిది అవసరమయిన లక్షణం కాదని సంపత్కుమార వాదించారు. గణవిభజనను గురించి మా ఇద్దరి వాదాల్లోనూ కొంత కొంత నిజం ఉంది.

వృత్తాల్లో అక్షర పరిమాణం, పద్యపాదంలో వాటి స్థానం నిర్దిష్టం. అందువల్ల గణవిభజన వృత్తాల అంతర్నిర్మాణాన్ని గుర్తుపెట్టుకోవటానికి ఏర్పరచుకొన్న ఒక పద్ధతిగా మనం అర్థం చేసుకోవచ్చు. గణంలో అక్షర పరిమాణ స్థానాలు నియతం గనక, ఒక గణం ఒక అక్షర క్రమాన్ని మాత్రమే సూచిస్తుంది. ఈ క్రమాన్ని గుర్తు పెట్టుకో గలిగినప్పుడు మనకు గణాలతో పని ఉండదు. అంటే, వృత్తాల పాద లక్షణ నిరూపణ గణ విభజన లేకుండా చెయ్యవచ్చునన్న మాట. ఈ గణాలకు మూడక్షరాలనే ప్రమాణంగా పెట్టుకోటానికి కారణం సంప్రదాయం తప్ప వేరే 'కారణం' ఏమీ ఉన్నట్టు లేదు. ఎన్ని అక్షరాలు పరిమితిగా పెట్టుకున్నా, వాటి ప్రయోజనం పాదంలో గురు లఘు క్రమాన్ని సంకేతం చేయటమే.

జాతుల్లో (గీత, సీసాది పద్యాలు) అక్షరాల సంఖ్యా, క్రమమూ నిర్దిష్టం కాదు. ఉదాహరణకు గీతపద్య పాదంలో అక్షరాల సంఖ్య 12 నుంచి 17 వరకూ ఉంటుంది. ఒక పాదంలో 288 రకాల అక్షర క్రమాలుంటై. అంటే గీత పద్యపాదంలో అంతర్నిర్మాణాన్ని గాని, బాహ్య పరిమితినిగాని గణ సహాయం లేకుండా ఏకైక పద్ధతి (యునీక్ వే)లో చెప్పలేం. ఈ పద్యాల్లో గణ క్రమమూ, గణ సంఖ్యా నిర్దిష్టం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, జాతుల్లో పాదాల అంతర్నిర్మాణాన్ని, బాహ్య పరిమితిని అక్షరాల సహాయంతో ఏకైక పద్ధతిలో చెప్పలేం. గణాల సహాయంతో చెప్పగలం.

ఇక మాత్రా ఛందస్సుల విషయం. మాత్రా ఛందస్సుల్లో లయ ప్రధానం. ఈ లయ మాత్రా గణానుసారి. లయ ననుసరించి మాత్రాపద్యాల అంతర్నిర్మాణాన్ని చెప్పాలంటే, మాత్రాగణాలను గుర్తించక తప్పదు. అక్షరక్రమం నిర్దిష్టం కాదుగనక, అక్షర పద్ధతి ఇక్కడ సాయపడదు. బాహ్యపరిమితినైనా అక్షర సంఖ్యలో

చెప్పలేం. ప్రాచీనులు కొందరు మాత్రాఛందస్సులకు లయ ప్రధానంగా లక్షణం చెప్పారు. అంటే, మాత్రా పద్యాల్లో అంతర్గతంగా లయని గురించి వాళ్లు పట్టించుకోలేదన్నమాట. ఆ మేరకు వాళ్ల లక్షణం అసమగ్రం. మాత్రాగణాల్లో కొన్ని చోట్ల 'జ' గణాన్ని నిషేధించటానికి కారణాన్ని ఊహించటం కష్టం కాదు. మూడు మాత్రల గణాల్లో 'లగం', నాలుగు మాత్రల గణాల్లో 'జ'గణం, ఐదు మాత్రల గణాల్లో 'య' గణం విలోమగతి ఉన్న గణాలు. ఈ గణాల్లో ఊనిక గురువైన రెండో అక్షరం మీద ఉంటుంది. అదే మాత్రా సంఖ్య ఉన్న ఇతర గణాలు అనులోమగతి ఉన్న గణాలు. వాటిల్లో మొదటి అక్షరం మీద ఊనిక ఉంటుంది. అయిదు మాత్రల గణాల్లో 'త' గణంలో రెండో అక్షరం మీదా, 'నలం'లో మూడో అక్షరం మీద కూడా ఊనిక ఉండటానికి అవకాశం ఉంది. అయితే, వాటిల్లో మొదటి అక్షరం మీద కూడా ఊనిక ఉంటుంది. అనులోమ గణాలుండాల్సిన చోట విలోమగణాలుంటే లయ భంగమవుతుంది. అందువల్లనే ముత్యాలసరంలో 'లగం' 'జ' గణం వాడరు. ఖండగతి పద్యాల్లో 'య' గణం, ఐదుమాత్రల గణమైనా, వాడరు. లయను పట్టించుకోనివాళ్లు, లయను గ్రహించనివాళ్లు కొందరు వాడితే వాడవచ్చు. అవి అపవాదాలుగానే నిలుస్తై. నేటి కవుల్లో, శ్రీశ్రీ పద్యాల్లో అల్లాంటి వ్యతిక్రమణలు కొన్ని కనిపిస్తై. శ్రీశ్రీ ఐనా ముత్యాలసరంలో 'లగం' వాడిన ('జగద్గురు శంకరుండేడీ') చోట్లున్నై. గాని జగణం వాడినచోట్లు కనపడలేదు. ఖండగతిలో యగణాన్ని మిగతా గణాలతో పాటు ప్రసిద్ధులైన తెలుగు కవులెవరూ వాడిన ఉదాహరణలు లేవు.

అసలు పద్యాలన్నిటికీ లయ ననుసరించే లక్షణం చెప్పాలని కీ. శే. గిడుగు సీతాపతిగారి వాదం. అంటే, ఛందో విభాగమంతా

మాత్రాబద్ధంగా ఉండాలని వారి వాద సారాంశము. అయితే, ఉన్న పద్యాలన్నిటికీ మాత్రా పద్ధతిలో లక్షణం చెప్పటం కుదరదు. లయ నిర్దేశించని పద్యాల్లో గతి వైవిధ్యానికి అవకాశం ఉంది. మాత్రా ఛందస్సుల్లో గతిని మార్చటమంటే, పద్యాన్ని మార్చటమే అవుతుంది అయితే, ఆధునిక కవులు ఒకేగతి ఉండాల్సిన పద్యాల్లో భిన్న పాదాల్లో భిన్న గతులు పాటించిన ఘట్టాలున్నై. ఉదాహరణకు 10 మాత్రల బాహ్య పరిమితిగల పద్యాల్లో కొన్నిచోట్ల ఖండగతిని, కొన్నిచోట్ల మిశ్ర గతిని (3+4+3) పాటించారు 12 మాత్రల బాహ్యపరిమితిగల పద్యాల్లో కొన్ని చోట్ల త్రిశ్రగతి (3+3+3+3)ని, కొన్నిచోట్ల చతురస్ర (4+4+4) గతిని పాటించారు. 16 మాత్రల బాహ్య పరిమితి గల పద్యాల్లో కొన్ని చోట్ల చతురస్రగతిని, కొన్ని చోట్ల మిశ్రగతిని (5+3 లేక 3+5) పాటించారు. ముత్యాల సరాన్ని మాత్రం 3+4+3+4 క్రమంలోనే నడిపారు. వీటన్నిట్లోనూ పాటించిన ఒక సాధారణ సూత్రం ఉంది. సరిమాత్రా సంఖ్య బాహ్య పరిమితిగల మాత్రా పద్యాలు రెండర్థభాగాలుగా విరుగుతై. 14 మాత్రలను 6+8 మాత్రల గణాలుగా విభక్త మయ్యేట్లు శ్రీశ్రీ రాసిన పద్యాలు కొన్ని ఉన్నై. ఇవన్నీ చాలా మందికి తెలిసినవే కావటంవల్ల ప్రత్యేకంగా ఉదాహరణలు చూపించటం లేదు. ఒకే పద్యంలో భిన్నగతులతో పద్యపాదాలున్నప్పుడు వాటిని విషమచ్ఛందో భేదాలుగా పరిగణించాల్సి ఉంటుందనుకుంటాను.

మాత్రాపద్యాలకు మాత్రం లయనిర్దేశం ఎందుకు చెయ్యాలి? అని అడగవచ్చు. లయ నిర్దేశించకపోతే మాత్రా పద్యాల్లో అంతర్విభాగం ఉండదు. అక్షర క్రమాన్ని నిర్దేశిస్తే అవి వృత్తాలతో సమానమవుతై. ఇంద్ర చంద్ర గణాలను నిర్దేశిస్తే అవి జాతుల్లో భాగమవుతై. మాత్రా పద్యాలు ప్రత్యేక చ్ఛందస్సుగా నిలబడాలంటే

వాటి నిర్వచనం మాత్రా గణాల్లోనే జరగాలి. ఒక్కో పాదానికి అంతర్నిర్మాణం భేదించినా గుర్తించదగిన పద్ధతుల్లోనే (ప్రెడిక్టబుల్ పద్ధతుల్లో) భేదిస్తుంది. అంతేకాని, అసలు అంతర్నిర్మాణమే లేని మాత్రా పద్యం ఉండదు.

పై చర్చ సారాంశం ఏకైక (యునీక్) పద్ధతిలో అంతర్నిర్మాణాన్ని, బాహ్య పరిమితిని సూచించాలంటే వృత్తాలకు గణ నిర్మాణం అవసరం లేదని; జాతులకు, మాత్రా పద్యాలకు అది అవసర మనీ తేలుతుంది. 'గణాల దృష్ట్యా పాదానికి అంతర్నిర్మాణమంటూ ఏదీ ఉండదు' అన్న సంసగ్ధ్యకమైన వాక్యం వృత్తాలకు మాత్రమే అన్వయిస్తుంది.

పైన పేర్కొన్న ఛందోభేదాల్ని పక్క పేజీలోలాగా అంత స్తుల బొమ్మల్లో చూపించవచ్చు.

ఈ బొమ్మల్లో పైనుంచి కిందికిగాని, కింది నుంచి పైకిగాని పోవ టానికి దార్లున్నై. అంతస్తులకు కుడిపక్కన అంతర్నిర్మాణ రేఖ, ఎడమ పక్కన బాహ్య పరిమితి రేఖ ఉన్నై. వృత్తాల్లో అంతర్నిర్మాణ, బాహ్య పరిమితులను అక్షరక్రమం సాయంతో చెప్పవచ్చు కాబట్టి; గణక్రమా నికి, అక్షరక్రమానికి ఒకేదారి ఉంది. కాబట్టి, ఇక్కడ గణాల అంత స్తుని తొలగించినా వచ్చే ఇబ్బంది లేదు. అందువల్ల ఈ అంతస్తుకి వచ్చే అంతర్నిర్మాణ రేఖ, ఈ అంతస్తు నుంచి పోయే బాహ్య పరిమితి రేఖ విరిగిన బాణపుగుర్తులతో సూచించబడింది.

రెండో బొమ్మలో గణాల అంతస్తు నుంచి అక్షరాల అంతస్తుకి దారులు మూడు చూపించబడ్డయ్. ఇక్కడ మూడు బహుళత్వానికి చిహ్నం మాత్రమే. ఒక్కొక్క గణాన్ని ఏకైక పద్ధతిలో అక్షర క్రమంగా మార్చలేము. సూర్యగణాన్ని అక్షరక్రమంగా మార్చటానికి రెండు పద్ధతులు, ఇంద్రగణాన్ని అక్షరక్రమంగా మార్చటానికి ఆరు


ఛందో భేదాలు
వృత్తాలు
జాతులు
మాత్రా ఛందస్సులు
పాదం
గణక్రమం
అక్షరక్రమం
మాత్రలు
అంతర్నిర్మాణం
బాహ్య నిర్మాణం

పద్ధతులూ ఉన్నై. అట్లాకాకుండా సగణం, గలం; నగ, నల, సల, భ, ర, త వంటి గణాల సాయంతో గణక్రమం చెప్తే, గణక్రమం నుంచి అక్షరక్రమానికి ఒకేదారి చాలు. అప్పుడు పాదంనుంచి గణాల అంతస్తుకి దారులెక్కువ చూపించాల్సి వస్తుంది. అంటే, ఈ వైవిధ్యాన్ని ఎక్కడో చోట చూపించక తప్పదు. ఏ పద్ధతిలో అయినా గణాల అంతస్తుని తప్పించుకోలేం. భిన్న అక్షర క్రమాల్ని అక్షరాల అంతస్తులో నిర్మిస్తే, గణాల అంతస్తుని తప్పించుకోవచ్చు. అప్పుడు పాదానికి అంతర్నిర్మాణాన్ని ఏకైక పద్ధతిలో చెప్పలేము. పైన పేర్కొన్నట్లుగా గీతపద్య పాదానికి 288 రకాల అక్షర క్రమాలను చెప్పాల్సి ఉంటుంది. అందువల్ల జాతుల అంతర్నిర్మాణ, బాహ్య పరిమితుల నిర్వచనానికి గణాల సహాయం అవసరమవుతున్నది.

మూడో బొమ్మకూడా రెండో బొమ్మ లాంటిదే. ఇందులో కూడా గణక్రమం నుంచి అక్షర క్రమానికి దారులెక్కువున్నై. అక్కడకూడా మాత్రా గణాలకు బదులు అక్షర క్రమాన్ని బట్టి ఏర్పరిచిన గణాల (నిసర్గ గణాలు మొ॥) సాయంతో గణ క్రమాన్ని సూచిస్తే, అక్షర క్రమానికి ఒకే దారి సరిపోతుంది. అప్పుడు ఇక్కడ కూడా పాదంనుంచి గణక్రమానికి దారులెక్కువ చూపించాల్సి వస్తుంది. ఇక్కడైనా గణాల అంతస్తుని తొలగించలేము. మాత్రా పద్యాల్లో అక్షర క్రమానికి ప్రాధాన్యం లేకపోయినా, ప్రయోజనం ఉండటంవల్ల అక్షరాల అంతస్తు కూడా ఇక్కడ నిర్మించబడింది. అనులోమ, విలోమగతి భేదం గురులఘుక్రమాన్ని బట్టే చెప్పాల్సి ఉంటుంది గనుక మాత్రా ఛందస్సులో అక్షరాల అంతస్తు అవసరమవుతున్నది. మాత్రలు ఒకే పరిమాణం గలవి గనుక వాటిలో క్రమం అంటూ ఉండదు. మాత్రాపద్యంలో బాహ్యపరిమితి మాత్రా సంఖ్యనుబట్టి ఉంటుంది గనుక అడుగు అంతస్తునుంచి కూడా బాహ్య పరిమితి రేఖ మొదలు కావచ్చు. అంతర్నిర్మాణానికి మాత్రం గణ క్రమమే ఆధారం. ఈ బొమ్మల్లో కొన్ని వివరాల్లో మార్పులు అవసరం కావచ్చు. కాని, తెలుగులో ప్రచురంగా ఉన్న ఛందో భేదాల్ని అర్థం చేసుకోవటానికి ఇవి సాయపడతయ్యనుకుంటాను.

పద్యపాదాల సామాన్య లక్షణాలుగా నేను ప్రతిపాదించిన అంతర్విరామాన్ని, బాహ్య పరిమితులను సంపత్కుమార ఎక్కడా స్పష్టంగా నిరాకరించలేదు. అంతర్విరామ గణాల దృష్ట్యా మాత్రమే లేదన్నారు. పైగా ఆయన 'అంతర్విభజన' అనే మాట నేనుపయోగించిన అంతర్విరామం అనే మాటకు సమానార్థకంగానే కనిపిస్తున్నది. ఆయన ప్రతిపాదించిన భావగణాలకు అంతకన్న వేరే ప్రయోజనం లేదు. 'ఒక భావం పూర్తి గావటంతో ఒక పాదం పూర్తికావచ్చు' అని అనటం వల్ల, భావంతో పూర్తి అయిన పాదంలో భావాంశాలుంటే అంతర్విభజన సాధ్యం కావచ్చు. ఒకే ఒక్క భావాంశమే పాదంలో ఉంటే అంతర్విభజన కవకాశం ఉండదు. ఒక పాదంలో ఒకటి మొదలు ఎన్నైనా భావాంశాలుండవచ్చనుకుంటాను. 'ఒక భావం పూర్తిగావటంతో ఒక పాదం పూర్తి కావచ్చు'ననటం వల్ల వచనపద్యపాదం గరిష్ఠ పరిమితి ఒక భావమని, సంపత్కుమార ఉద్దేశంగా గ్రహించవచ్చు. వచన పద్యపాద కనిష్ఠ పరిమితి భావాంశంతోనూ, గరిష్ఠ పరిమితిని భావంతోనూ సూచించారు. అంటే, నిర్దిష్టమయిన అంతర్విభజన కానీ, బాహ్య పరిమితిని కానీ ఆయన సూచించలేదు. ఒకవేళ మాట వరసకి భావ, భావాంశాలనేవాటిని గణాలుగాగాని, గణతుల్యాలుగాగాని అంగీకరించినా, వీటి సహాయంతోనైనా అంతర్విరామం, బాహ్య పరిమితులను నిర్దిష్టంగా చెప్పలేదు కాబట్టి, వచన పద్య పాదాలకివి నిర్దిష్టంగా లేవని అనుకోవాల్సివస్తున్నది. అసలు భావ, భావాంశాల విభజన, తద్వారా పాద, పాదాంతర్విభజన సాధ్యమవుతుందా? లేదా? అని చర్చించే ముందు సంపత్కుమార నేను వేసిన కొన్ని ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలను పరిశీలించాల్సి ఉంది.

వచన పద్యానికి పాదబద్ధత ఉందా, లేదా? అని తెలుసుకోటానికి నేను రెండు ప్రయోగాలను సూచించాను. 1. పాద విభజన లేకుండా రాసిన, లేక అచ్చువేసిన వచన పద్యానికి కవ్యుద్దిష్టమైన పాద విభజన చేయటానికి ప్రయత్నించటం. 2. ఇద్దరు లక్షణకర్తలు

ఒకే రకమైన పాదవిభజన చెయ్యగలగటం. ఈ రెండూ సాధ్యం కావు కాబట్టి వచన పద్యపాద విభజనకు ఏకైక పద్ధతి లేదని నా వాదం. ఈ సందర్భంలో, ఆయన ఒకేసారి రెండు పద్యాలుగా గణ విభజన చెయ్యటానికి వీలున్న ఈ పద్యభాగాన్ని ఉదాహరించారు.

మధుర మధురమైన మామిడి పండ్లను
పంచి యిచ్చు జనుడె మంచివాడు.

ఇది ఆటవెలది పద్యంలో అర్ధభాగమూ కావచ్చు, సీస పద్యంలో ఒక పాదమూ కావచ్చు. ఈ భాగాన్ని మాత్రమే ఉదాహరిస్తే కవి ఏ పద్యాన్ని ఉద్దేశించాడో చెప్పలేం. కాని పూర్తిపద్యాన్ని ఉదాహరిస్తే చెప్పటం తేలిక. పద్యమంతా ఇట్లాగే విభక్తమయితే, కవి రెండూ ఉద్దేశించాడని చెప్పవచ్చు. యాదృచ్ఛికంగా పద్యమంతా ఇలాగే ఉండటం జరగదు ఇక్కడ సంపత్కుమార ఉద్దేశం ఏమిటంటే, కనీసం కొన్నిచోట్లనైనా, కొన్నిపాదాల్లోనైనా, ఇట్లాంటివి సాధ్యం కాబట్టి, ఆ భాగాల్నే ఉదాహరించినప్పుడు కవి దేన్ని ఉద్దేశించాడో చెప్పలేం కాబట్టి, వచనపద్యాల్లో మాత్రం కవి ఉద్దేశించినట్టే వేరొకరు ఎందుకు గణవిభజన చెయ్యాలి ? అని. కవి ఉద్దేశించిన పాదవిభజన మనకు ఎందుకు ప్రమాణం కావాలి ? నిజమే. అక్కర్లేదు. ప్రాచీన పద్యాల్లో కవి ఉద్దేశించిన పాదవిభజన, లాక్షణికుడు చేసిన పాదవిభజన ఒకటే ఎందుకవుతున్నై ? ఇద్దరూ ఒక సూత్రాన్నే అనుసరించటం వల్ల, అనుసరించటానికొక సూత్రమంటూ ఉండటంవల్ల. అచ్చులో పాదవిభజన చెయ్యటం, చెయ్యకపోవటమనేది అప్రధానం. శార్దూలం వంటి పద్యాల్ని చిన్న సైజు పుస్తకంలో అచ్చు వేసేప్పుడు ఒక్కొ పాదాన్ని రెండుగా విరిచి ముద్రించటం మనం చూస్తున్నాం. అయినా అక్కడ సందిగ్ధత కవకాశం లేదు. వచనపద్యంలో అట్లాంటి సందిగ్ధత కవకాశం ఉంది. పైన పేర్కొన్న 'మధుర మధురమైన' చోట్ల ఉన్న సందిగ్ధత వేరు. పైన ఉదాహరించిన భాగానికి రెండు విధాలయిన విభజనే సాధ్యం. ఆ రెండూ, రెండు సూత్రాల ఫలితాలూ ఒకచోట కలిసిపోవటంవల్ల ఏర్పడినై. ఇది సిస్టమేటిక్

కన్సిస్టెన్సీ. ఇట్లాంటిది వచన పద్యంలో ఉండటానికి వీల్లేదు. సిస్టం ఉన్నప్పుడు గదా సిస్టమేటిక్ కన్సిస్టెన్సీ ఉండేది! దీన్ని ఛందస్ శ్లేష అనవచ్చు. వాక్య నిర్మాణంలో కనిపించే వ్యాకరణశ్లేష లాంటిదే ఇది. ఒక వాక్యానికి కేవలం భిన్న వ్యాకరణ సంబంధాలవల్ల భిన్నార్థాలు వస్తే, వ్యాకరణ శ్లేష అవుతుంది. ఈ భిన్న వ్యాకరణ సంబంధాలు ఒక వాక్యంలో ఏ పరిస్థితుల్లో ఒకే రకంగా వ్యక్తమవుతయో ప్రెడిక్టు చెయ్యవచ్చు. ఈ పనివ్యాకర్తలది. ఆధునికులు చేస్తున్న వాక్యనిర్మాణ చర్చలో ఈ పరిశీలన కొంత కనిపిస్తున్నది. అట్లాగే, ఛందస్ శ్లేషని కూడా ప్రెడిక్టు చెయ్యవచ్చు. దీన్ని వివరించాల్సిన బాధ్యత ఛందః పరిశోధకులది.

సంపత్కుమార చూపించినవేకాక, ఇట్లాంటివి ఇంకా చాలా ఉంటై. ఉదాహరణకు యతి నియమాలను పాటిస్తూ 17 లఘువులతో పద్యపాదం రచిస్తే అది గీతమూ కావచ్చు, ఆటవెలది బేసి పాదమూ కావచ్చు. ఇందుక్కారణం సర్వలఘువులున్న గణం సూర్యగణాల్లోనూ ఉంది, ఇంద్ర గణాల్లోనూ ఉంది. ఆటవెలది బేసిపాదంలోనూ, గీత పద్య పాదంలోనూ, ఇంద్ర, సూర్యగణాల సంఖ్య ఒకటే, క్రమం లోనే భేదం. సర్వలఘువులున్న పాదంలో ఈ రెండు రకాలయిన విభజన అందువల్ల సాధ్యమయింది. 'సూర్య-ఇంద్ర-సూర్య-ఇంద్ర-సూర్య' అనే క్రమంలో ఏదన్నా పద్యం ఉంటే, అట్లాగూ విభజించ వచ్చు. ఇట్లాంటివే మరికొన్నిటిని గమనించండి—

1. U I U I U I I I I I I I U I
   U I U I U I I I I U I I I I
2. U I I I I I U I I U I I I I
   U I I I I I U I I U I U I
3. U I I I I I I I I I I I I I U I

ఈ పై కూర్పులలో మొదటి జంట (1) గీతపద్య పాదమూ, ఆటవెలది బేసి పాదమూ కావచ్చు. తరవాతి జంట. (2) గీత ద్విపద పాదాల్లో ఏదైనా కావచ్చు. చివరి జంట (౩) ఆటవెలది బేసి పాదమూ,

ద్విపదపాదమూ కావచ్చు. ప్రయత్నించిచూస్తే, ఒకేసారి ఈ మూడు రకాలు అయ్యేట్టు కూడా చెయ్యవచ్చు. పై కూర్పులో మొదటి గురువు స్థానంలో రెండు లఘువులున్నా, మార్పేమీ ఉండదు. ఇట్లాంటి అవకాశాల్ని పరిశీలించి పరిశోధకులు వివరిస్తే ఛందస్సును గూర్చిన మన అవగాహన పెరుగుతుంది.

ఇంతకీ, నా ప్రధానమైన ప్రశ్న ఇది. వచన పద్యానికి కవి ఉద్దేశించినా, లక్షణకర్త ఉద్దేశించినా పాదవిభజనకు పద్ధతి ఏమిటి? 'భావాన్ని బట్టి' అని సంపత్కుమార సమాధానం. పాదాంతర్విభజనకీ అదే సూత్రాన్ని ఆయన ప్రతిపాదిస్తున్నారు. ఒక వచనపద్యాన్ని భిన్న లాక్షణికులు భిన్నవిధాలుగా విభజించటం సంపత్కుమారగారు అనుకుంటున్నట్టు పైన పేర్కొన్న 'మధుర మధురమైన మామిడి పండ్లను...' అన్నదాన్ని సీసపద్యంగానూ, ఆటవెలది అర్థభాగంగానూ విభజించటంలాంటిది కాదు. ఒకే లక్షణ కర్తగానీ, భిన్నలక్షణ కర్తలు గానీ దాన్ని రెండు విధాలుగా మాత్రమే విభజించటానికి అవకాశం ఉంది. ఈ లక్షణ భిన్నత్వం కూడా క్రమబద్ధమే. వచనపద్య పాదవిభజనలో భిన్నత్వానికి కారణం లక్షణ భిన్నత్వం కాదు, లక్షణాభావం. ఎందువల్లనంటే, భావ, భావాంశాలను గుర్తుపట్టటానికి గాని, పరిగణించ టానికిగాని, ప్రమాణీకరించటానికి గాని పద్ధతులేమీ లేక పోవటంవల్ల భావానికిగాని, భావాంశానికి గాని భాషలో అస్తిత్వం వ్యాకరణ సంబంధాలవల్లనే సాధ్యం. అంటే, భాషలో ఇవి వ్యస్తపదాల వల్లగాక పదబంధాల వల్ల, ఉపవాక్యాల (క్లాజెస్) వల్ల, వాక్యాలవల్ల వ్యక్తమవుతై. వీటి నిర్మాణం వాక్యనిర్మాణ చర్చలో భాగమవుతుంది. భాషావ్యవహారంలో అది సంభాషణైనా, కథా కథనమైనా, పద్యమైనా, గద్యమైనా భావవ్యక్తీకరణ ఈ రకం వాక్య నిర్మితి వల్లనే సాధ్యం. వ్యాకరణంతో నిమిత్తం లేకుండా భావ, భావాంశాలను ఎట్లా పరిగణిస్తారో నా ఊహకు అందటం లేదు వ్యాక రణ సంబంధాల కతీతంగా భావం ఉంటుందంటే అందుకు నా అభ్యంతరం లేదు. కాని, అది భాషలో ఎట్లా వ్యక్తమవుతున్నదనే

వాక్యాలవలసింది. అది వ్యాకరణ సంబంధాలవల్లనే (పదాలకూ, పదాంశాలకూ అర్థాలుంటయ్యని, భావ వ్యక్తీకరణంలో వాటికి ప్రాధాన్యం ఉంటుందన్న విషయం నేను కాదనటం లేదు. వీటి సంపుటీకరణాన్ని గురించి నేనుద్దేశిస్తున్నది.) సాధ్యమవుతుందని నా అభిప్రాయం. వ్యాకరణాతీతంగా భావ భావాంశాలను పరిగణించే సూత్రమేమిటి ? — అని సూటిగా అడుగుతున్నాను. 'భావాన్ని, భావాంశాన్నిబట్టి వచన పద్యంలో పాదవిభజన జరుగుతుంది' అంటే చాలదు. వీటిని గుర్తుపట్టే సాధనాలు ఇయ్యనంతవరకు ఎన్ని ఉదాహరణ లిచ్చినా ప్రయోజనం లేదు.

పాద విభజనలో పద్ధతి ఉందనటానికి సంపత్కుమార ఈ కింది మాటల కూర్పుని ఉదాహరించారు.

ప్రాణాలు బిగపట్టుకొని
సాగేరు ప్రయాణీకులు
నాయకుడు తిరిగివస్తాడనీ,
తుపాను శమిస్తుందనీ,
నది పొంగు తగ్గేననీ,
ఆశతో అహరహమూ
దేనికైనా ఉద్వృతి ఎంత సేపు?
దానికి వ్యతిరిక్తం తప్పదాపైన.

—మాదిరాజు రంగారావు

చివరి రెండు పాదాలు భావాన్నిబట్టి, మొదటి ఆరు పాదాలు భావాంశాలను బట్టి విభక్తమవుతయ్యని సంపత్కుమార వివరణ. కాని ఈ భావ, భావాంశాల వ్యక్తీకరణ వ్యాకరణ మూలంగా జరిగిందని, ఇక్కడ పాద విభజనమేదన్నా ఉంటే అది వ్యాకరణ సంబంధి అని నా వివరణ. చివరి రెండు పాదాలూ రెండు వాక్యాలు. వాటినే సంపత్కుమార భావాలన్నారు. మొదటి రెండు పాదాలు కలిసి ఒక

వాక్యం. మొదటి పాదం క్త్వార్థక క్రియాంతమైన ఉపవాక్యం. ప్రధాన వాక్యాంశమైన రెండో పాదానికది రీతిని సూచించే విశేషణ వాక్యాంశం, లేక ఉపవాక్యం క్త్వార్థక క్రియ వాక్యంలో ప్రవర్తించే తీరుల్లో ఇదొకటి. అంటే, ఒక వాక్యంలో రెండు క్లాజుల్ని రెండు పాదాలుగా విడదీశారన్న మాట. 3-6 పాదాలన్నీ కలిపి ఒక వాక్యం. కాని, ఇక్కడ క్రియ లేదు. ఉంటే ఆరో పాదంలో ఉండాలి. కాని ఇక్కడ లోపించింది. బహుశా అది కవి శైలీ విశేషం కావచ్చు. ఆ లోపించిన క్రియకు ఆరోపాదం విశేషణం అవుతుంది. 3, 4, 5 పాదాలు ఒక 'గర్భితవాక్యం'. ఈ వాక్యాంశాలకు 'అని' అనే అనుకరణాద్యర్థ బోధక శబ్దం చేర్చటం వల్ల ఉపవాక్యాలయినై. అంటే, పైన ఉదాహరించిన భాగంలో పాదవిభజన వాక్య నిర్మాణంలో వాక్య, ఉపవాక్య విభజన జరిగే పద్ధతి ననుసరించి జరిగిందని స్పష్టం.

ఈ సందర్భంలోనే కె. వి. రమణారెడ్డిగారి 'బాధాగాధము' అనే ఖండికలోనుంచి నేను ఉదాహరించిన భాగాన్ని సంపత్కుమార మళ్లీ ఉదాహరించి—'కొంచెం లోపం ఉండవచ్చుగాక' - అందులో పాదవిభజన జరిగిందని నిరూపించటానికి ప్రయత్నించారు. రమణారెడ్డిగారి 'అంగారవల్లరి' అనే పుస్తకంలోనుంచి కొంత భాగాన్ని నేను గ్రహించి, అచ్చులో అది ఎట్లా ఉందో, అట్లాగే నావ్యాసంలో ఉదాహరించాను. అచ్చులో అక్షరాల వరస కాయితం మీద అక్షరాలు పట్టే చోటు ననుసరించి కూర్చబడింది. రమణారెడ్డిగారు 'బాధాగాధము'లో పాదవిభజన ఉద్దేశించలేదు. (అట్లా అని నాకు రాశారు కూడా.) నేనుదాహరించిన భాగంలో అవి నాలుగు పాదాలుగా కనిపించటం కేవలం యాదృచ్ఛికం. రమణారెడ్డిగారి 'అంగారవల్లరి' అనే అచ్చు పుస్తకాన్ని సంపత్కుమార చూసి ఉండలేదనుకుంటాను. చూస్తే 'బాధాగాధము'లో పాదవిభజన జరిగిందని పొరపాటుబడే అవకాశం ఉండేది కాదు.

అట్లాగే, తిలక్ రాసిన 'రాత్రివేళ' అనే ఖండికలో పాదవిభజన జరిగినట్టు నాకు నమ్మకంలేదు. 'అమృతం కురిసిన రాత్రి' తిలక్ మరణించిన తరువాత అచ్చయిన పుస్తకం. అందువల్ల, కవి ఏ ఖండికలో పాదవిభజన ఉద్దేశించాడో, ఎక్కడ ఉద్దేశించలేదో తెలుసుకోటానికి అచ్చయిన పుస్తకమే ఆధారం. ఈ ఆధారంతోచూస్తే, కవి ఇక్కడ పాదవిభజనను ఉద్దేశించినట్టుతోచదు. ఇప్పుడు కనిపించే పాదవిభజన తిలక్ పద్యాల్ని కాపీ చేసినవారో, అచ్చువేసినవారో చేసి ఉండవచ్చు.

పాదాల అంతర్విభజనకు సంపత్కుమార భావగణాలను ప్రతిపాదించారు. ఈ భావగణం భావమూ కావచ్చు, భావాంశమూ కావచ్చు పాదవిభజనకు కూడా వీటినే ప్రస్తావించారు. గనక ఒక్కో పాదంలో ఒక్కొక్కసారి ఒకే గణం ఉండవచ్చు. ఆ గణం భావాంశ గణమైతే అంతర్విభజన సాధ్యంకాదన్నమాట. భావాంశాలుగా విభక్తంకాని భావగణము న్నా అంతర్విభజన వీలు పడదు. అయినా అభ్యంతరం లేదు. గణితశాస్త్రంలో 'సెట్' సిద్ధాంతం ప్రకారం దీన్ని సమర్థించవచ్చు. ఒక పాదం గణాల 'సెట్' అయితే అందులో ఒక వస్తువు (ఒక గణం) ఉన్నా 'సెట్' అవుతుంది. ఒక 'సెట్' తనలో తాను అంతర్భాగం కూడా అవుతుంది. అక్షరచ్ఛందస్సుల్లో ఏకాక్షరవృత్తాంతర్విభాగాన్ని సమర్థించే మార్గం ఇదే అనుకుంటాను. కానీ, భావగణాలైన ఈ భావం, భావాంశాల స్వరూపాల్ని సంపత్కుమార ఇప్పటి వ్యాసంలోనైనా వివరించక పోవటం విచారకరం. 'భిన్న భిన్న వచన పద్య పాదాల్లో అక్కడ భావాన్ని స్ఫురింపజేసే పదాలస్థితినిబట్టే భావగణ విభాజకరీతి ఉంటుంది' అన్న సంపత్కుమార వివరణ చాలా అసంతృప్తికరంగా ఉంది. ఆ 'స్థితి' ఏమిటో నిరూపించేవరకూ భావగణాల అస్తిత్వాన్ని అంగీకరించలేను. వీరు ఆధారపడ్డ భావస్ఫూర్తి వ్యాకరణ సంబంధాలవల్ల కలుగు

తున్నదని నా వాదం. ఇంతకు ముందే చెప్పినట్లుగా, వ్యాకరణాంశాలు వదిలేస్తే భావాలు దొరకవు. అందుకనే వారి భావగణాలను (వాటిని గణాలు అనాల్సివస్తే) నేను వ్యాకరణ గణాలు అన్నాను. వ్యాకరణ రూపైకత అనటంలో ప్రతిగణమూ ఇంకోగణంతో సమంగా ఉండ టం కాదు నేను ఉద్దేశించింది. కొన్ని పదసమూహాలకు వ్యాకరణ సమత్వం ఉంటుంది. అట్లాంటివి ఒకగణం కావచ్చు, సమత్వ భేదాల్ని బట్టి బహువిధగణాలుండవచ్చు. ఇంతకీ వ్యాకరణ గణాలను వచన పద్యానికి లక్షణంగా ప్రతిపాదించటం నా ఉద్దేశం కాదు. ఛందస్సులో వాడుకోదగిన వ్యాకరణ గణాలున్నయ్యని నేను నమ్మటం లేదు. కాని, సంపత్కుమార ప్రతిపాదిస్తున్న భావగణాలు వ్యాకరణాంశాలను బట్టి విభక్తమవుతయ్యని, వ్యాకరణ గణాలనటం వల్ల వాటిని వ్యాకరణ సహాయంతో గుర్తు పట్టవచ్చునని నా ఉద్దేశం. సంపత్కుమార 'భావ స్ఫూర్తి' అన్నా, భావస్ఫూర్తి వ్యాకరణ పరిజ్ఞానం లేకుండా జరగదు గనక, భావగణ విభజనలో వారికి తోడ్పడింది (వ్యక్తంగా కాకపో వచ్చు) ఈ వ్యాకరణ సంబంధాల పరిజ్ఞానమే. వ్యాకరణ విరహితంగా భావస్ఫూర్తి కలిగే పద్ధతి ఒకటుంటే, అది చూపించేవరకూ వారి భావగణాలను 'వ్యాకరణ గణాలు' అనే అనాల్సి ఉంటుంది.

సాంప్రదాయిక ఛందస్సులో రచించిన పద్యాలను చదివే పద్ధ తిని గురించి సంపత్కుమార కొంత ప్రస్తావించారు. పద్యాన్ని శబ్దం మధ్యలో విరిచి చదవం — అది గణాంతమైనా సరే, పాదాంత మయినా సరే. ప్రకృతి ప్రత్యయాలనుగాని, విశేషణ విశేష్యాలనుగాని కలిపి చదవటానికి, కారణం చదువరికి తన భాషను గురించి వ్యాకరణ పరిజ్ఞానం ఉండటమే. చదవటంలో ఈ భావస్ఫూర్తిని కలిగించేది ఈ వ్యాకరణ పరిజ్ఞానమే. అయితే ఆ పద్యాల్లో భావగణాల ప్రసక్తిగాని, వ్యాకరణగణాల ప్రసక్తిగాని రాదు. ప్రసిద్ధంగా వాటికి గణ విభజన ఉంది. గణాల్ని బట్టి చదవాల్సిన అవసరం లేదు.

నిజానికి ఈ వ్యాకరణాంశాల పాత్రను సంపత్కుమార పూర్తిగా తిరస్కరించలేదని ఆయన వ్యాసంలోని ఈ వాక్యాలవల్ల మనం చెప్పవచ్చు. . వచనపద్య నిర్మాణంలో భావస్ఫూర్తి విషయికంగా వాక్య నిర్మాణరీతికి ప్రవేశం ఉంది. కాబట్టి వ్యాకరణ రూపైకత అక్కడక్కడా భావగణ విభజనలో కనిపించటం సహజమే. అంత మాత్రాన వ్యాకరణ రూపైకతవల్లనే సర్వత్రా భావగణ విభజన జరుగుతుందనటానికి వీల్లేదు.' వ్యాకరణాంశాలకి వీరున్నయ్యంటున్న భావాంశాలకి ఏకైక సంబంధం (వన్ టూ వన్ కరెస్పాండెన్స్) ఉంది కాబట్టి వ్యాకరణ విరహితంగా భావగణ విభజన సాధ్యం కాదని నా నమ్మకం. సాధ్యమని నిరూపించాల్సిన బాధ్యత సంపత్కుమార మీదే ఉంది. 'కేవలం 'భావస్ఫూర్తిని బట్టి' అంటే చాలదు వ్యాకరణ విరహితంగా భావస్ఫూర్తి ఎట్లా కలుగుతుందో కూడా ఆయన నిరూపించాలి.

సంపత్కుమార భావగణాలను గురించిన నా సందేహానికి సమాధానం ఇయ్యటానికి ప్రయత్నించారు. 'దూరము-దుంపలు-దుఃఖము-దుర్గతి' అన్న మాటలను ఉదాహరించి, వాటిలో మొదటి గుర్తుతర స్వరూపంలో మార్పున్నా 'భగణం' అనే ఒకే పేరుతో పిలుస్తున్నాం కాబట్టి, 'భావాన్ని ఆధారం చేసుకొని పదాల స్వరూపంలో ఎన్ని భేదాలున్నా గూడా అది భావగణమే. అది ఏకైకం' అని వివరించారు. పైన ఇచ్చిన మాటల్లో మొదటి అక్షర స్వరూపంలో భేదం ఉన్నా, సామ్యం కూడా ఉందని మరచిపోగూడదు. అంతేగాదు, ఆ సామ్యాన్ని హేతుబద్ధంగా నిరూపించవచ్చు. గురు లఘు నిర్ణయం అక్షర (Syllable) పరిమాణాన్ని బట్టి జరిగింది. వ్యంజనాన్ని 'C' అనే గుర్తు ద్వారాను, హ్రస్వాచ్చును 'V' అనే గుర్తు ద్వారాను, దీర్ఘాచ్చును '$\bar{V}$' అనే గుర్తు ద్వారాను సంకేతిస్తే, గురుస్వరూపాన్ని ఈ విధంగా చూపించవచ్చు. (C) $\bar{V}$, (C) VC. పూర్వ పర

వ్యంజనాలతో సంబంధం లేకుండా దీర్ఘాచ్చుగాని, పర వ్యంజనంతో మూతబడిన హ్రస్వాచ్చుగాని గురువు అవుతుంది. తక్కినవి లఘువులు. అక్షర పరిమాణాన్ని బట్టి ఏర్పడింది గురులఘు విభేదం. ఇట్లాంటి నిశ్చితమైన సూత్రాలమీద ఏర్పడ్డ గురులఘు క్రమాన్ని అనుసరించి తయారయిన గణాలకూ, భావగణాలకూ పోలికే లేదు. భావగణాలను పరిగణించటానికి వీల్లేదంటే, అది వేరే మాట. కాని, భావగణాల పరిగణనకు ప్రాచీన ఛందస్సాపేక్షం అక్కరలేదు.

సంపత్కుమార ఇప్పటి వ్యాసంలోనైనా వచన పద్యాన్ని అంతర్నిర్మాణమూ, బాహ్య పరిమితీ ఉన్న పాఠాలుగా నిర్వచించటానికి స్పష్టమయిన ప్రతిపాదన ఏదీ చెయ్యలేదు. ఆయన ఉన్నయ్యంటున్న భావగణాలు వ్యాకరణాంశాల మీదనే ఆధారపడ్డ గనక అవి వ్యాకరణ గణాలే అవుతై. ఆయన భావగణ పద్ధతికి వచన పద్యాన్ని గద్యం నుంచి వేరుచేసే శక్తి లేదు. 'భావ స్ఫూర్తి' ఆధారంగా విభక్తమవుతయ్యని సంపత్కుమార అంటున్న భావగణాలు అన్ని రకాల భాషా వ్యవహారాల్లోనూ ఉంటై. అయినప్పుడు ఆయన పద్ధతి ననుసరించి ఒక వ్యాసంలోని వాక్యాలను గూడ భావ, భావాంశాల పద్ధతిలో పాద విభజనచేసి వచనపద్యంగా నిరూపించవచ్చు. అచ్చులోగాని, రాతలోగాని కవి పాద విభజనని సూచించటం ప్రమాణంగాతీసుకుంటే, ఆ పని వ్యాసకర్త కూడా చెయ్యవచ్చు ఈనాటి కొన్ని ప్రకటనల్లో కూడా పాదవిభజన కనిపిస్తున్నది. భావ, భావాంశ నిరూపణ అక్కడా చెయ్యవచ్చు. అకపోతే, వచన పద్యంలో ఉండే కవితా పదార్థం దాన్ని వ్యాసాల నుంచి, ప్రకటనల నుంచి వేరు చేస్తుంది కదా అంటే, కవిత్వానికి గద్యంలో స్థానం లేదని అనాల్సి ఉంటుంది. రసహీనమైన పద్యాలు, రసవంతమైన గద్యం ఉంటయ్యని అందరూ ఒప్పుకుంటారు. కవిత్వం ఉన్నదల్లా ఛందో విభాగం అనీ,

ఛందో విభాగం కాదు

ఛందస్సులో ఉన్నదల్లా కవిత్వం అవుతుందని సంపత్కుమార అంటారనుకోను.

ఈ చిక్కులన్నిటికీ కారణం మనకు ప్రసిద్ధంగా ఉన్న ఛందస్సంప్రదాయాలలో ఎక్కడో చోట ఈ వచన పద్యానికి చోటు కల్పించటం కోసం ప్రయత్నించటం. ఏదో రకమైన ఛందస్సూ, గణ విభజనా ఉన్నయ్యంటే, వచన పద్యానికి అదనంగా ఏదో గౌరవం వస్తుందనుకోటం.

ఏ విధంగా చూసినా, సంపత్కుమార చెప్పిన లక్షణాలు వచన పద్యాన్ని ఛందో విభాగంగా నిలబెట్టలేవు. అందువల్ల 'వచన పద్యం' పద్యం కాదని, గద్యమే నని నేను పూర్వం చేసిన నిర్ణయాన్ని మార్చుకోవలసిన అవసరం సంపత్కుమార వ్యాసం కలిగించలేదు.

భారతి. నవం. 1972. పు. 41-49.

# వచన పద్యం పద్యమే

—సంపత్కుమార

వచన పద్యం యొక్క ఛందస్సాన్ని గూర్చి ప్రస్తుతం సాగుతున్న చర్చలో చేకూరి రామారావూ, నేనూ విభేదిస్తున్న అంశం ప్రధానంగా వచన పద్యంయొక్క పాదబద్ధత వచన 'పద్యం' పద్యం కావటానికీ, గద్యం కాక పోవటానికీ నేను ప్రతిపాదించిన అంశాల్లోనూ, రామారావు నిరాకరిస్తున్న అంశాల్లోనూ-ఆయనే అన్నట్లుగా ...'వచన పద్యానికి ప్రతిపాదించిన పాదబద్ధత అనేది కేవలం ఒక అంశం మాత్రమే కాక చాలా కీలకమయినది.' కూడా. అందుకే, వచన పద్యాన్ని 'పద్య' మంటున్న నేనూ, కాదు, 'గద్య' మంటున్న రామారావూ ఆ పాదబద్ధతను గూర్చే విశేషంగా చర్చించటం. అయితే, ఈ పాదబద్ధతను గూర్చి మళ్ళీ వివరించి, రామారావు నన్ను నిగ్గదీసిన అంశాలను పరిశీలించటానికి, కొన్ని అంశాల విషయంలో నాపై మోపిన బాధ్యతను నిర్వర్తించటానికి ముందు 'పాదం' యొక్క 'అంతర్నిర్మాణం' గూర్చి ఆయన చెప్పిన అంశాలను పరిశీలిస్తాను.

అసలు, పద్యం అనగానే, ఆ 'పద్యపాదానికి అంతర్నిర్మాణమూ, బాహ్యపరిమితి ఉండాలని రామారావు వాదం. ఆయన తన మొదటి వ్యాసంలోనే ప్రస్తావించిన ఈ రెండంశాల్లో బాహ్యపరిమితి విషయం అట్లా ఉండగా, అంతర్నిర్మాణంగూర్చి నా వ్యాసం (జూలై 72)లో కొంత వివరించి'...గణాల దృష్ట్యా పాదానికి అంతర్నిర్మాణ మంటూ ఏదీ ఉండదు' అని తేల్చిచెప్పటం జరిగింది. ఇక్కడ 'గణాల దృష్ట్యా' అనటానికి కారణం, రామారావు తన మొదటి వ్యాసంలో-'పాదం అక్షర సముదాయం కాదు, గణసముదాయం. అంటే, పాదా

నికి అంతర్నిర్మాణమున్న దన్న మాట' - అని గణాల దృష్ట్యా ఈ అంత ర్నిర్మాణాన్ని ప్రతిపాదించటం. అయితే, రామారావు తన రెండవ వ్యాసంలో, మళ్ళీ ఆ అంతర్నిర్మాణాన్ని గూర్చి విస్తారంగా రాసి" 'గణాల దృష్ట్యా పాదానికి అంతర్నిర్మాణమంటూ ఏదీ ఉండదు' అన్న సంపత్కు మార వాక్యం వృత్తాలకు మాత్రమే అన్వయిస్తుంది' అన్నారు. అంటే, వృత్తాలకు సంబంధించినంతవరకు నాతో రామా రావు ఏకీభవిస్తున్నారన్న మాట. కాగా, 'జాతులకు,' మాత్రా పద్యా లకు ఇది (గణనిర్మాణం) అవసర'మని అంటున్నా రాయన. కాని, వీటికిక్కూడా అవసరం లేదు. అదే వివరిస్తాను.

రామారావు వివరించిన రీతినిబట్టి 'అంతర్నిర్మాణం' అంటే, ఒక పద్యపాదానికి విహితమయిన గణాలను, విహితమైన సంఖ్యతో, విహితమయిన క్రమంలో కూర్చటం. అంటే, ఉదాహరణకు - గీత పాదానికి సూర్య-ఇంద్ర గణాలే ఉండటం, అవి కూడా సూర్యగణాలు మూడూ, ఇంద్ర గణాలు రెండూ మాత్రమే ఉండటం, అవి కూడా 1సూ.+2ఇం.+2సూ. అన్న క్రమంలో కూర్చబడటం. ఇది గీతపాదపు అంతర్నిర్మాణమన్నమాట. మరి వృత్తాల విషయంలోనూ ఇంతేగదా! 'భ-ర-న-భ-భ-ర-లగ' అన్న గణాలను (భగణాలు 3, రగణాలు 2, నగణం 1, లగం 1) ఆ క్రమంలో కూర్చటం 'ఉత్పల మాలా' పద్యపాదపు 'అంతర్నిర్మాణ'మన్నమాట గదా! (వృత్తాలకు గణ నిర్మాణం అక్కర లేదనటం తరువాతి మాట. ఉంటే, ఇంతే మరి!) కాని, గణపద్ధతి రాక పూర్వం ఉత్పలమాలా పద్య రచన సాగటం, దానికి అక్షరాల సాయంతో లక్షణం చెప్పటం (ఇక్కడ 'ఉత్పలమాల' వృత్తాలన్నిటికీ ఉపలక్షకం) జరిగింది. ఛరకాదుల పద్ధతి ఇదే. కాగా, ఆనాడది గణ సముదాయం కాదు, అక్షర సము దాయమే. (ఈ అంశం నా జులై '72 వ్యాసంలో వివరించబడింది.) మరి ఈ పద్ధతిలో జాతులకు లక్షణం చెప్పటం కుదురదా ? కుదురదని రామారావు అభిప్రాయం. ఎందుకంటే, వృత్తాల్లోని పాదా లన్నిటిలోనూ (విషమ వృత్తాల్లో తప్ప) అక్షర సంఖ్య, గురు లఘు

క్రమమూ సమంగా ఉంటుంది కాని, జాత్యాదుల్లో ఉండటం నియతం కాదు. అందువల్ల - 'జాతుల్లో పాదాల అంతర్నిర్మాణాన్ని, బాహ్యపరిమితిని అక్షరాల సాయంతో, ఏకైక పద్ధతిలో చెప్పలేము' కాబట్టి, సూర్యేంద్ర చంద్రగణాలు జాతుల అంతర్నిర్మాణం... లక్షణం చెప్పటానికి తప్పనిసరి. -ఇది రామారావు వాదం.

మరి, జాతుల్లో ఉపయోగానికని చెప్పబడుతున్న గణాల పరిస్థితిని చూద్దాం. ఈ చెప్పబడుతున్నవి సూర్య-ఇంద్ర-చంద్ర గణాలు. వీటిని 'మాత్రాగణాలు' అంటారు. అంటే, వీటిలో గురు లఘు క్రమం నియతం కాదు. సూర్య-ఇంద్ర-చంద్ర అన్నవి మూడు గణ వర్గాలు. ఈ వర్గాల్లో వరుసగా 2-6-14 గణాలుంటయి. అయితే, ఆయా వర్గాల్లోని ఆయా గణాలన్నీ సమం కావు ఉదాహరణకు ఇంద్ర గణాలారింటిలో రెండు (నల, భ) చతుర్మాత్రా గణాలుకాగా, నాలుగు (నగ, సల, ర, త) పంచ మాత్రా గణాలు. అట్లాగే, మూడు (భ, ర, త) మూడేసి అక్షరాల గణాలు కాగా, మిగిలిన మూడు (నగ, సల, నల) నాలుగేసి అక్షరాల గణాలు. అంటే, ఈ ఆరింటికీ మాత్రాసంఖ్యలో కానీ, అక్షరసంఖ్యలోగానీ సమత్వం లేదన్నమాట. మిగిలిన వర్గాల స్థితికూడా దీనికి భిన్నమేమీ కాదు.

మరి, ఈ గణాల స్వరూప స్వభావాలనుబట్టి చూస్తే ఈ అసమ గణాల కూర్పుతో అంతర్నిర్మాణం కలిగించుకొంటాయని చెప్పబడు తున్న ఈ పద్యాల 'గతి' ఏమిటో దురూహ్యం. ఎందుకంటే - ఉదాహరణకు గీతపాదంలో త్ర్యస్ర, చతురస్ర, ఖండ గతులకు చెందిన మాత్రాగణాల కలగలుపు నిర్దేశింపబడింది. ఇదయినా ఒక వరుసలోగాక ఆద్యంతాల్లో త్ర్యస్రగతి (సూర్య) గణాలు, మధ్యలో చతురస్ర, ఖండగతి (ఇంద్రగణాల్లో రెండు గతుల గణాలు కలిసి ఉన్నయిగదా) గణాలు. కాగా, వీటిలో గతిగాని, లయగాని నిర్దే శింపబడలేదని చెప్పవలసి ఉంటుంది. మరి ఈ నిర్దేశం లేనప్పుడు - (ఉన్నప్పుడు గణాల అవసరం గూర్చి రామారావుగారు మాత్రా పద్యాల సందర్భంలో చెప్పినారు. అక్కడ ఆ విషయం పరిశీలిస్తాను.

కాని, ఈ స్థితిలో) ఈ గణాల ప్రయోజనమేమిటి? ఏమిటంటే - రామారావు గారన్నట్టు 'అంతర్విభాగాన్ని, బాహ్య పరిమితులను' 'ప్రత్యేక పద్ధతిలో చెప్పటం మాత్రమే మరి, అంతర్విభాగమంటే, ఈ గణాల కూర్పే కదా! కాని ఆ గణాల స్థితి అట్లా ఉంది. ఆలోచిస్తే, లక్షణ కథనంలోని సౌలభ్యం కోసమే ఈ 'గణపద్ధతి'. అని స్పష్టమవుతుంది. అయితే, ఈ గణాల సాయం లేకుండా లక్షణం చెప్పటానికి వీలయితే, అప్పుడీ గణాల ద్వారా అంతర్విభాగం ప్రసక్తి ఉండదుగదా! గణాపేక్షయ విరహితంగా లక్షణం చెప్పవచ్చు ననటానికి ఉదాహరణగా గీత పద్యానికి చూపిస్తున్నాను.

గీత పాదంలో 17 నుండి 19 దాకా మాత్రా సంఖ్య ఉంటుంది. అంటే, 17, 18, 19 మాత్రల సంఖ్యలతో ప్రస్తుతం ప్రచారంలో ఉన్న గీత పాదాలు మూడు విధాలుగా రూపొందుతా యన్నమాట. ఎందుకంటే మూడు సూర్యగణాల మాత్రా సంఖ్య 3×3=9. రెండింద్ర గణాల మాత్రా సంఖ్య 4+4=8, లేదా 4+5=9, లేదా 5+5=10. ఈ మూడు విధాలు కావటానికి ఇంద్ర గణాల మాత్రా సంఖ్యలోని వైవిధ్యం కారణం. (4+5 కు బదులు 5+4 గా కూడా ఉండవచ్చు.) ఈ కారణంగా గీతపాదాలు మూడు రకాల మాత్రా సంఖ్యల (17, 18, 19)తో రూపొందుతున్నాయి. 18 మాత్రల సంఖ్యతో ఏర్పడే గీత పాదం రెండు రకాలుగా ఉంటుంది. దీనికి కారణం - ఇందులోని ఇంద్ర గణాలు 4+5 లేదా 5+4గా ఉండే వీలుండటం. కాగా మొత్తం నాల్గు రకాల గీత పాదాలు ఏర్పడుతున్నాయి. అవి ఇట్లా ఉంటాయి.

1 వ విధం పాదం : 11+6=17 మాత్రలు
2 వ విధం పాదం : 13+6=19 మాత్రలు
3 వ విధం పాదం : 12+6=18 మాత్రలు
4 వ విధం పాదం : 12+6=18 మాత్రలు

(11+6 అంటే పదకొండు మాత్రల తరువాత యతి చెల్లించవలసి ఉంటుందని. మరొకటి 11వ మాత్ర దాని తరువాతి - అంటే 12వ

మాత్రతో కలిసి గురువు కారాదు. 13+6, 12+6 అన్నప్పుడు గూడా ఇంతే)

ఈ నాలుగు పాదాలకూ సామాన్య లక్షణాలు :-

i. పాదం ఎప్పుడు కూడా గుర్వంతం కాగూడదు. ii. ఏ పాదంలోనూ 2+3, 3+4, 5+6 — ఈ మాత్రలు కలిసి గురువు కారాదు.

నాలుగు రకాల పాదాలకు వాటి వాటి ప్రత్యేక లక్షణాలు :-

*1వ విధం పాదం :* i. 7+8, 9+10, 13+14, 14+15 — ఈ మాత్రలు కలిసి గురువు కారాదు. ii. రెండు గురువులు వరుసగా ఉండగూడదు.

*2వ విధం పాదం :* i. 8+9, 10+11, 15+16, 16+17 ఈ మాత్రలు కలసి గురువు కారాదు. ii. 4+5 కాని 9+10 కానీ కలసి గురువయితే దాని తరువాత వరుసగా మూడు లఘువులుండ రాదు. iii. నాలుగవ మాత్రనుంచి పదమూడు మాత్రలదాకా వరుసగా అయిదు లఘువులుండరాదు.

*3వ విధం పాదం :* i. 7+8, 9+10, 14+15, 15+16 ఈ మాత్రలు కలసి గురువు కారాదు. ii ఒకటో మాత్రనుంచి ఏడు మాత్రలదాకా వరుసగా ఎక్కడా రెండు గురువులుండరాదు.

*4వ విధం పాదం :* i. 8+9, 10+11, 14+15, 15+16- ఈ మాత్రలు కలసి గురువుకారాదు. ii. 9+10 కలసి గురువయితే, 11+12 కలసి గురువు కారాదు.

సూచన : మాత్రల కలయిక నిషేధం కాని చోట్ల ఏ రెండేసి మాత్రలయినా కలసి గురువు కావచ్చు, కాకపోనూవచ్చు.

ఇది ఒక్కొక్క పాదం లక్షణమే. ఇట్లాంటివి ఒక్కొక్క విధం పాదాలు కలసి ఒక పద్యం. అయితే, వ్యవహారంలో ఉన్న గీతపద్యా

కట్లా ఉండటం లేదు. ఈ నాల్గింటి, లేదా కొన్నింటి పాదాల కలగలుపుగా ఉంటున్నాయి. ఈ విధమయిన కలగలుపు - మిశ్రరూపాన్ని 'గీతపద్యం' అంటూ, కలగలుపు కానట్టి అమిశ్రరూపాలు నాలుగింటికీ విడివిడిగా గుర్తింపుకోసం నాలుగు వేరే వేరే పేర్లు సంకేతించితే స్పష్టత నిష్పన్నమవుతుంది. 'సుగీత'- 'సంగీత .' ఇత్యాదిగానో, మరో విధంగానో ఆ పేర్లు ఉండవచ్చు. కలగలుపు రూపానికీ 'గీత' మన్న పేరు ఉండనే ఉందిగదా! ఈమిశ్ర+అమిశ్ర రూపాలు మొత్తం అయిదింటినీ 'గీతవర్గం' అనవచ్చు. అట్లాగే, 'ఆటవెలది వర్గం' 'సీస వర్గం' మొదలయినవి నిష్పన్నమవుతయి. మిశ్రరూపాల పాదాల కలగలుపు విధాలను గూడా పరిగణించితే, ఆయా వర్గాల్లోని పద్యాల సంఖ్య ఇంకా పెరుగుతుంది. వైవిధ్యం అధికమవుతుంది.

పైన గీత విషయంలో నాలుగు విధాలకూ ఒకే చోట లక్షణం చెప్పటం వల్ల లక్షణం దీర్ఘంగా ఉన్నట్లు భాసించవచ్చు. కాని, 'గీత వర్గ' సామాన్య లక్షణాలు కాక, రెండేసి నియమాలకన్నా (ఒక్క రెండో విధానికి మాత్రం మూడు) ఏ ఒక్క విధానికి కూడా ఎక్కువ నియమాలు లేవు.

వృత్తాల్లో గురు లఘువుల్ని ప్రధానీకరించటం వల్ల (గణ ప్రసక్తి లేకుండా) వాటిని పేర్కొని (ఇన్నో అక్షరం గురువు లేదా ఇన్నో అక్షరం లఘువు కావాల్నంటూ) ఛరణాదులు లక్షణం చెప్పటం జరిగింది. మరి ఈ (జాతి) పద్యాల్లో మాత్రల్ని ప్రధానీకరించటం వల్ల, ఫలానా ఫలానా మాత్రలు కలసి గురువు కాకపోవటం, కావటం అన్న రీతిలో లక్షణం చెప్పటం జరిగింది.

గణ సహాయం లేకుండా ఈ పద్యాలకు కూడా లక్షణం చెప్పటానికి వీలున్నదని, ఈ పద్యపాదాలను గణబద్ధాలు అననక్కరలేదని నిరూపించటానికే పయి పద్ధతి ఇక్కడ ప్రదర్శించబడింది. మరి ఈ పద్ధతి సరికొత్తదేమీ కాదు. వైతాళీయ పద్యాలకు పింగళుడు ఈ

ధోరణిలోనే లక్షణం చెప్పటం జరిగింది. వైతాళీయ పద్యాలు ఒక వర్గం. వైతాళీయ లక్షణం చెప్పిన పద్ధతి ఇది :-

i బేసిపాదాల్లో 14 మాత్రలు, సరిపాదాల్లో 16 మాత్రలు.

ii. పాదాలు గుర్వంతం కావలసి ఉంటుంది.

iii. సరిపాదాల్లో సరి+బేసి మాత్రలు కలిసి గురువుకారాదు.

iv. సరిపాదాల్లో ఆరు లఘువులు వరుసగా ఉండరాదు.

v. బేసిపాదాల్లో ఆరు మాత్రలు, సరిపాదాల్లో 8 మాత్రల తరువాత యతి చెల్లింపు.

కొన్ని మాత్రలు కలిసి గురువు కావటం అనే అంశంలో ఆయా మాత్రల సంఖ్యలోని వ్యత్యాసాన్ని బట్టి వైతాళీయ భేదాలు కొన్ని ఏర్పడ్డయి. అట్లాగే ఈ ఈ భేదాల పాదాల కలగలుపుతో మరికొన్ని భేదాలు. ఈ భేదాలన్నింటికి ప్రాచ్యవృత్తి, ఉదీచ్యవృత్తి, చారుహాసిని...ఇత్యాదిగా వేరు వేరు పేర్లు. పైన నేను గీతపద్య వర్గానికి చెప్పిన లక్షణ పద్ధతి ఈ ధోరణిలోనిదే. 'య-ర-త' ఇత్యాది గణాలను రూపొందించిన పింగళుడే ఈ విధంగా గణ సహాయం లేకుండా వైతాళీయాలకు లక్షణం చెప్పినాడు. అందువల్ల తెలుగులోని గీతాదులకీ పద్ధతిని అనువర్తింప చేయవచ్చు. చేస్తే, ప్రస్తుతం వ్యవహారంలో ఉన్న గీతాదుల్లో మిశ్ర, అమిశ్ర రూపాలేర్పడి వైవిధ్యం అధికమయి తుంది.

ఇక, రామారావుగా రంటున్న మాత్రా పద్యాలకు కూడా ఈ పద్ధతిని అన్వయింప చేయవచ్చు. గీతాదుల ఉపయోగానికి చెప్ప బడ్డవాటిని 'మాత్రాగణా' లన్నట్టుగా, మాత్రా పద్యాల కుపయో గించే వాటిని 'మాత్రాసంఖ్యా గణా' లంటారు. అంటే, మాత్రా గణాల్లోని మాత్రా సంఖ్యా వైషమ్యం మాత్రా సంఖ్యా గణాల్లో ఉండదు. 3, 4, 5, 7 మాత్రల సంఖ్యలతో ఈ గణాలేర్పడుతయి. ఒకే పాదంలో ఉండే గణాలన్నీ సమమాత్రా సంఖ్యతో ఉంటయి.

ఉదాహరణకు, మధురగతి రగడలో ఒక్కొక్క పాదంలో నాలుగేసి చతురశ్ర మాత్రా గణాలుంటాయి. నాలుగు మాత్రలుండటమనేదే తప్ప గురు లఘు క్రమంతో సిటికీ నిమిత్తం లేదు. ఇట్లాగే అన్ని. 7 మాత్రల గణమంటే, 3+4 లేదా 4+3 మాత్రా సమ్మిశ్ర గణాలు – అంటే, త్రస్ర + చతురశ్ర గతి గణాల సమ్మేళనం. అందుకని దీన్ని మిశ్రగతి అంటారు కాని మిశ్రత్వం మిగతా కొన్నింటిలోనూ కొంత ఉన్నది. ఉదాహరణకు పంచమాత్రా గణాల్లో 2+3 లేదా 3+2గా కూడా ఉండవచ్చు. అయితే, మూటికన్న తక్కువగా మాత్రా సంఖ్య ఉన్నప్పుడు గణత్వ పరిగణన లేకపోవటం వల్ల వీటిని మిశ్రగతులుగా భావించటం లేదు. అయితే, ఈ విధమయిన మిశ్రత్వం దృష్టితో చూస్తే ఎందు మొత్తం మీద ఉండే మాత్రా సంఖ్య ప్రధానమయి, అవి అన్నింటిలో ఏ సంఖ్యతోడి మాత్రలు గల పదాలుగా విరగాలన్నది సాంఖ్యికమయితున్నది.

అయితే, 'మాత్రాఛందస్సుల్లో లయప్రధానం. ఈ లయ మాత్రా గణానుసారి. లయననుసరించి మాత్రా పద్యాల అంతర్నిర్మాణాన్ని చెప్పాలంటే మాత్రాగణాలను గుర్తించక తప్పదు' అంటారు రామారావు. ఆ తేలుగు. ఎందు మొత్తానికైన మాత్రా సంఖ్యను బట్టి లక్షణాన్ని చెప్పిన వారిని ప్రస్తావించి,— 'ప్రాచీనులు కొందరు మాత్రా పద్యాలకు లయ విరహితంగా లక్షణం చెప్పారు. అంటే, మాత్రాపద్యాల్లోని అంతర్నిర్మాణాన్ని గూర్చి వాళ్లు పట్టించుకోలేదన్న మాట. ఈ మేరకు వాళ్ల లక్షణం అసమగ్రం' అని తీర్మానించినారు కూడా. ఈ తీర్మానాన్ననుసరించి గణసహాయం లేకుండా లక్షణం చెప్పటం మాత్రాపద్యాలకు 'లయ విరహితంగా' చెప్పటమయితుండన్న మాట. ఎందుకంటే—'లయ మాత్రాగణానుసారి.' అయితే, వెనుక చూపబడ్డ వైతాళీయాలు మాత్రా ఛందస్సులే. వాటికి పింగళుడు గణసహాయంతో లక్షణం చెప్పలేదు కాబట్టి లయదృష్టి లేదనడం కుదురుతుందా మరి! లయమీద దృష్టి లేకుంటే, ఫలానా మాత్రలు కలువరాదు,-అంటే, కలిసి గురువు కారాదు, వరుసగా అన్ని లఘువు

లుండరాదు ఇత్యాదిగా చెప్పటమెందుకు ? నిజానికి అట్లా చెప్పటం లయను ఉద్దేశించి మాత్రమే. మాత్రాగణాలను చెప్పినంత మాత్రాన 'లయ విరహితంగా' చెప్పటం కాదు. ఇంకో రకంగా చెప్పవలసిన అంశ మేమిటంటే, మాత్రాగణాలను చెప్పటంవల్ల ఎదురుపడేదే—అంటే, విలోమగతిగల గణా(లగ-జ-య)లను నిషేధించవలసి వచ్చింది. గణాల ప్రమేయం లేకుంటే ఈ నిషేధింపు అవసరం లేదు. ఎందుకనంటే విలోమగతి వెంటనే పట్టిస్తుంది. విలోమగతి అవసరమనుకుంటే, కవి సాధిస్తాడు. కాదనుకుంటే వదిలేస్తాడు. గణాలను చెప్పినా గూడా, పాదంలోని అయా ప్రత్యేక సంఖ్యామాత్రలు కలిసి గురువులు కావటం వల్లనే, లేదా కాక పోవటంవల్లనే, విలోమగతిగానీ, అనులోమగతిగానీ వచ్చేది. గణాలను చెప్పటంవల్ల, విలోమగతి సాధించాలనుకొన్న కవి లక్షణాతిక్రమణం చేసిన వాడయితున్నాడు. 'నేటి కవుల్లో' శ్రీశ్రీ పద్యాల్లో ఇట్లాంటి వ్యతిక్రమణలు కనిపిస్తా'యని గణాలదృష్టితో అనవలసివచ్చింది తప్ప, పాదమాత్రా సంఖ్యాదృష్ట్యా అనవలసిన అవసరం రాదు. అందుకే, లాక్షణికుల గణాలెట్లా ఉన్నా, కవులు విలోమగతిని సాధిస్తూనే ఉన్నారు.

ఇదిట్లా ఉండగా అనులోమగతికమయిన 'నల'మునకు, విలోమగతికమయిన 'జ' గణగమనం సాధించ వచ్చునని, ఇట్లాంటి 'నల'మును 'జగణతుల్యనల' మనవచ్చునని గిడుగు సీతాపతిగారు (సీతాపతి 1961. పే. 41) సూచించినారు. అంటే, పార్యంతికంగా గతిసాధన కవికి సంబంధించిందే గాని, గణాలకు సంబంధించింది కాదని స్పష్టమయితుంది.

మరొకటి విలోమగతిని లాక్షణికులు పూర్తిగా నిరాకరించలేదు. దీనికి ప్రత్యక్ష సాక్ష్యం కందపద్యం. కందపద్యం గూడా మాత్రాఛందస్సే. ఒకవిధంగా కందం పూర్వార్ధాన్ని 8/5 గణాలుగా కాక 4/4 గణాలుగా విభజించి, రెండు పాదాలనుకుంటే-మాత్రా ఛందస్సే. మధురగతి రగడకిది. ఉత్తరార్ధంకూడా ఇంతే. గీతాదుల మాత్రాగణాల్లోని మాత్రా సంఖ్యా వైవిధ్యం కందగణాల్లో లేదు.

కందగణాలు చతుర్మాత్రాకాలు. 'గగ-భల-జ నల-స' అనే వాటిని మించి చతుర్మాత్రాగణాలు లేవు. అన్నీ చతుర్మాత్రాకాలు కావటంవల్ల కందం చతురస్రగతి పద్యమని స్పష్టం. అయితే, ఈ కందగణాల్లో విలోమ గతికమైన జగణాన్ని లాక్షణికులు విధించినారు. ఆరవ గణంగా నల మునైనా, జగణమైనా తప్పక ఉండాలని నియమం చేసినారుకూడా. అంటే, నాలుగు లఘువులైనా సరిగా ఉపయోగించాలె, లేదా విలోమగతినయినా సాధించాలని స్పష్టంచేసినారన్నమాట. కందంలో సరిగణాలుగా గణాలన్ని అంగీకరించినారు. మరి నియమాలన్ని దేన్ని బట్టి? గతి ప్రయోగాల్ని బట్టే.

ఇది ఇట్లా ఉండగా, చతురస్ర గతికమయిన కందపద్యాన్ని తదితర గతుల్లో నడిపిన కవులు లేరనుకుంటాంది. చతురస్రేతర గతుల్లో నడిపించిన కందపద్యాల ఉదాహరణలు సీతాపతిగారు కావలసినన్ని ప్రదర్శించినారు. కాని, ఈ యీ అంశాలిట్లా స్పష్టమవుతుండగా,- 'ఖండగతిలో 'యగ' గణాన్ని మిగతా గణాలతోబాటు ప్రసిద్ధులయిన తెలుగు కవులెవరూ ఉపయోగించిన ఉదాహరణలు లేవు' అంటారు రామారావు. ఇక్కడ 'ఖండగతి' 'యగణం' అన్నది ప్రధానం కాదు. విలోమగతిక మయిన గణాలను వాడలేదనటం ప్రధానం. ఖండగతివిషయం ఎట్లా ఉన్నా, చతురస్రగతిక మయిన 'మధురగతి' రగడలో పింగళిసూరన్న కళాపూర్ణోదయంలో

'అహంక్రి'- యాత్మక-మగుళం-ఖంబుసు'

అన్నచోట (8.288) 'అహంక్రి' అని జగణం ప్రయోగించి నాడు. శ్రీనాథుని ప్రసిద్ధమయిన 'వణికట్టిక రగడ' (కాశీఖండం. 6-125) లో లాక్షణికుల గణాల దృష్ట్యా సరిపడని గణాలుగల పాదాలు చాలా ఉన్నయి. కాని, అవన్నీ ఎందానికిగల మాత్రాసంఖ్యాదృష్టితో సరిగానే ఉంటయి.

ఇది ఇట్లా ఉండగా, 'ఆధునిక కవులు ఒకేగతి ఉండాల్సిన పద్యాల్లో భిన్నగతులు పాటించిన ఘట్టాలున్నై. **ఉదాహరణకి పది**

మాత్రల బాహ్యపరిమితిగల పద్యాల్లో కొన్నిచోట్ల ఖండగతిని, కొన్నిచోట్ల మిశ్రమగతిని (3+4+3) పాటించారు. 12 మాత్రలు బాహ్యపరిమితిగల పద్యాలలో కొన్నిచోట్ల త్రిశ్రగతిని (3+3+3+3), కొన్నిచోట్ల చతురస్రగతిని (4+4+4) పాటించారు. 16 మాత్రల బాహ్యపరిమితిగల పద్యాల్లో కొన్నిచోట్ల చతురశ్ర గతిని, కొన్నిచోట్ల మిశ్ర గతిని (5+3లేక 3+5) పాటించారు. ముత్యాల సరాన్ని మాత్రం 3+4+3+4 క్రమంలోనే నడిపారు' అన్నారు రామారావుగారు. అయితే, ఈ 'భిన్నగతులు పాటించిన ఘట్టాలు' ప్రాచీనుల పద్యాల్లోనూ ఉన్నాయి. రామకృష్ణుడు ఘటికాచల మహాత్మ్యంలో

బొండు - మల్లెలకె - పోలతిరో - ముచ్చట
మిండ - తుమ్మెదలు - మెలగెడు - నచ్చట

(2 114) అన్నచోట 3+5గా ప్రయోగించినాడు. ఇక 10, 12, 16 మాత్రల బాహ్యపరిమితిగల పద్యాల్లో వరసగా ఖండ త్రిశ్ర, చతురస్రగతులుండటం సహజం. మిగిలిన గతులు, మిశ్రగతులు సాధ్యం మాత్రమే. మరి, ఈ 3+4+3 అన్న కూర్పు లయసూచకమే అయితే గీతపద్యంలోనూ 3+4+4+3+3 (4+4కు బదులు 4+5, లేదా 5+4, లేదా 5+5 ఉండవచ్చు) ఉన్నపద్ధతిని 'మిశ్రగతి'గా చెప్పవచ్చు. లయ సాధించవచ్చు. గీతాదులకు సూర్యేంద్రగణాలని చెప్పబడిన కారణంగా, మాత్రసంఖ్యగణాలు లేవన్న కారణంగా లయ నిర్దిష్టం కాదనటానికి పై పద్ధతిలో వీల్లేదు. కాని, వీటిలో లయ అప్రధానమని రామారావుగారు—'మాత్రా పద్యాల్లో లయ ప్రధానం' అంటూ మాత్రా పద్యేతర వినివర్తకంగా చెప్పడంవల్ల స్పష్టమయితుంది.

ఇక, ముత్యాలసరం విషయంలో 3+4+3+4 అన్న క్రమం నియతమేమీ కాదు. ఉదాహరణకు ఆరుద్ర రచించిన 'ఎర్ర రోజా మొగ్గ' ('ఎంచిన పద్యాలు' - సంకలనం)లో—

పద్యమే

'అతడు-తీసిన-బాట-లోనే
అడుగు-వేయుచు-సాగు-చున్నా
అట్టి-తమ-గ-జాతిని-రెండి
రథి మాసులున్నారో'

అన్న 'ముత్యాలసరం' చూడవచ్చు. మూడో పాదం 3+4+3+4 అనికాక, 4+3+4+3 గా విరుగుతుంది. నాల్గవ పాదం ఈ రెండింటిలో ఏ విధంగానూ విరుగదు. మూడవ నాల్గవ మాత్రలు కలిసి (నూం) గురువయింది. ఈ ఖండికలోని ముత్యాలసరాల్లో గగం తో ప్రారంభమయ్యే నాల్గవ పాదాలు చాలా ఉన్నాయి.

'మాత్రాఛందస్సులకు మాత్రం లయ నిర్దేశం ఎందుకు చేయాలి?' అని ప్రశ్నించుకొని, దానికి సమాధానంగా రామారావు-లయ నిర్దేశించకపోతే మాత్రా ఛందస్సుల్లో అంతర్నిర్మాణం ఉండదు, అక్షర క్రమాన్ని నిర్దేశిస్తే అవి వృత్తాలతో సమానమవుతై. ఇంద్ర చంద్ర గణాలను నిర్దేశిస్తే, అవి జాత్యుల్లో భాగమవుతై. మాత్రా పద్యాలు ప్రత్యేక ఛందస్సుగా నిలబడాలంటే, ఏటి నిర్వచనం మాత్రాగణాల్లోనే జరగాలి' అని నిశ్చయించినారు. ఈ సమాధానంలో ఒకటి రెండంశాలు గమనించవలసియున్నాయి. అంతర్నిర్మాణం ఉండాలి కాబట్టి లయనిర్దేశం అన్న భావమే ఈ సమాధానంలో ఉంది. కాగా, అంతర్నిర్మాణం ప్రధానమయి, లయ అప్రధానమయితున్నది. కాని, లయ ప్రధానం గదా! మరి వీటి నిర్వచనం 'మాత్రాగణాల్లో' కాకుండా చెప్పటానికి వీలున్నదని ఇదివరకే వివరించటం జరిగింది. ఇక 'అంతర్నిర్మాణం' ఎక్కడ? తరువాత, మాత్రాపద్యాలకు అక్షర క్రమాన్ని ఇంద్రచంద్ర గణాల్ని నిర్దేశించటానికి వీలున్నదనీ, అయినా గూడ అట్లా నిర్దేశిస్తే, 'మాత్రా పద్యాలు ప్రత్యేక ఛందస్సుగా నిలబడలేవనీ స్పష్టం చేసినారు. అంటే, వీటి ప్రత్యేక ఛందస్త్వం కోసమే అట్లా నిర్దేశించగూడదన్నమాట. మాత్రాగణాల నాశ్రయించట మిందుకే మరి. లయానుసారిగా, మాత్రాగణవిరహితంగా లక్షణం చెప్పితే అవి 'అంతర్నిర్మాణ' విరహితమయితయి.

అదీగాక, వృత్తాలతోనో, 'జాతు'లతోనో ఈ మాత్రాపద్యాలు సమానమయితయి. అయితే మునిగిపోయేదేమిటి ?

నిజానికి మాత్రా పద్యాల్లో పాదాలన్నింటిలోనూ మాత్రా సంఖ్య సమంగా ఉంటుంది. 3,4,5,7 ఈ అంకెల్లో ఏ ఒక దానితోనో నిశ్శేషంగా విభజింపబడుతయి. వృత్తాల్లోగాని, గీతాదుల్లో గాని ఇట్లా కాదు. మాత్రాపద్యాల ప్రత్యేకత ఇదే. దీన్ని గమనించి లాక్షణికులు లక్షణ కథనంలో సౌకర్యంకోసం మాత్రాసంఖ్యాగణాలను కుదిరించు కున్నారు. ఉదాహరణలు 'రగడ'లు. ఆధునికులుపయోగిస్తున్న 'మాత్రా ఛందస్సు'లన్నీ ఈ రగడ భేదాలే (సంపత్కుమార 1962) ఆ రగడల పద్ధతే వీటికి అనువర్తిస్తుంది. కాని కవులు ఈ గణాలను పట్టించుకో కుండా, స్వేచ్ఛగా, పాదపు మొత్తం మాత్రా సంఖ్యను మాత్రమే చాలా వరకు దృష్టిలో ఉంచుకొని మాత్రలని రకరకాలుగా విభజించు కుంటూ రకరకాలగతుల్ని, తద్వారా లయల్నీ సాధిస్తున్నారు. ప్రసిద్ధ గేయ కావ్యాల్లో వీటికి కోకొల్లలు ఉదాహరణలు దొరుకుతయి. అందుకని ఇక్కడ ప్రత్యేకించి చూపటంలేదు.

అసలీ గొడవ అంతా పాదానికి 'అంతర్నిర్మాణం' ఉండాలన్న, లేదా ఉంటుందన్న ప్రీ కన్సీవ్‌డ్ నోషన్‌తో ముందుకు సాగటంవల్లా, ఆ అంతర్నిర్మాణం గూడా గణాలవల్లనే అని ముందే నిర్ధారించుకోవటం వల్లా వస్తున్నది. చెప్పబడిన గణాలనుపయోగించినంత మాత్రాన 'గతి' కలుగదు. వేంకట పార్వతీశ్వర కవుల 'భావ సంకీర్తనం'లోని సీస పద్యాల్లో సీసగణాలే ఉపయోగించబడ్డా కూడా సీసగతి వాటికి కలుగ లేదు (సంపత్కుమార 1962, పే. 116) అట్లాగే లయసర్వస్వం గణాలవల్ల సిద్ధిస్తుందనటానికి వీల్లేదు. ఇదిగాక, 'మిశ్రగతి'ని అంగీక రిస్తున్నప్పుడు ఇక పేచీ ఏమిటి? అందువల్ల ఏ విధమయిన పద్య పాదానికిగూడా "అంతర్నిర్మాణ" మంటూ ఏదీఉండదు. జులై 72 వ్యాసంలో నేను చేసిన ఈ నిర్ణయాన్ని మార్చుకోవలసిన అవసరాన్ని రామారావుగారు చేసిన అంతర్నిర్మాణ వివరణ కలిగించటం లేదు.

ప్రస్తుతం నామీదున్న అభియోగాల "గణపద్ధతి"ని ఎందుకు "అంతర్విభాగం"గా రామారావుగారు చెప్పుతున్నారో గనక తప్పు చేసిపోలేరు.

ఇక,—'వచన పద్యాల సామాన్య లక్షణాలు' నేను ప్రతిపాదించిన 'అంతర్విభాగం — బాహ్యపరిమితుల'ను సంపూర్ణంగా మారీ ఎక్కడా స్పష్టంగా నిరాకరించలేదు. అంతర్విభాగం గణాలద్వారా వ్యక్తమే లేదన్నారు. పైగా, ఆయన 'అంతర్విభజన' అనే మాట, నేను ప్రయోగించిన 'అంతర్విభాగం' అనే మాటకు సమానార్థకంగానే కనిపిస్తున్నది. ఆయన ప్రతిపాదించిన భావగణాలకు ఇంతవరకు ఏ ప్రయోజనం లేదు' అంటారు రామారావుగారు. బాహ్యపరిమితిని నేను నిరాకరించలేదు, నిజమే. కాని, అంతర్విభాగం గురించి స్పష్టంగానే చెప్పినాను. "గణాలద్వారా (మాత్రమే) లేదన్న" నా మాట ప్రతిపాదన స్వరూపాన్ని జరిగితే నిరాకరించటం కూడా "ద్వారా"నే అనటం సమంజసం కాబట్టి. ఇక వారిని నిరూపించినట్టుగా చేసిన 'అంతర్విభజన' వారనే 'అంతర్విభాగం' 'సమానార్థకాలు' కావు. ఈ అంతర్విభజన— 'భావగణాలను గురించి చెప్పటమెందుకంటే, వచన పద్యంలో విభజనను క్రమబద్ధం చేయటానికి. భావాంశాన్ని బట్టి పాదవిభజన చేసేటప్పుడు భావగణం ఒక పదంగా గానీ, పదసమూహంగా గానీ, ఉండేట్లయితే, దాన్ని రెండు పాదాల్లోకి వ్యాపింపజేయకూడదు ' అని జూలై '72 వ్యాసంలో స్పష్టం చేసినాను. ఒక భావాంశం ఉభయ పాదాల్లోకి అభివ్యాప్తం కాకుండా చూడటానికి పాదంలోని భావాంశాల విభజన— అంటే, అంతర్విభజన సహకరిస్తుంది. కాగా, అది వచనపద్య పాద బాహ్యపరిమితి నిరూపణకు సంబంధించింది. భావాంశంతో గానీ, భావాంశాలు లేని భావంతో గానీ పాదం పర్యవసించేటప్పుడు ఈ అంతర్విభజనకు అవకాశం లేదు. ఎందుకంటే, బాహ్య పరిమితి వీటిలో స్పష్టమే. మరొకటి. నేను 'భావగణ' మన్నది భావాంశాన్నే గానీ, పూర్తి భావాన్ని కాదు. 'భావగణం' లోని 'గణ' పదం ఔపచారికంగా ప్రయుక్తమన్న అంశం నా వ్యాసంలో స్పష్టపరచబడింది. ఇదిట్లా

ఉండగా, భావంకానీ, భావాంశం (భావాంశాలు) కానీ పూర్తి కావటం వచన పద్యపాదం యొక్క బాహ్యపరిమితి అని, గరిష్ఠ-కనిష్ఠ పరిమితులంటూ గుర్తించి కూడా - '.... నిర్దిష్టమయిన' అంతర్నిర్భజననికానీ, బాహ్యపరిమితిని గానీ ఆయన సూచించలేదు .... అంతర్నిర్మాణ-బాహ్య పరిమితులను నిర్దిష్టంగా చెప్పలేదు. కాబట్టి వచన పద్య పాదాలకివి లేవనుకోవాల్సి వస్తున్నది' అని రామారావుగారెందుకన్నారో నా కర్థం కావటం లేదు. అంతర్నిర్మాణం విషయం జూలై' 72 వ్యాసంలోనే స్పష్టం చేయటమయిందిగదా! ఇక గరిష్ఠ-కనిష్ఠ పరిమితులు 'బాహ్యపరిమితికి' భిన్నమేమీ కావు.

ఇంతకీ, వచన పద్య పాద విభజనకు పద్ధతి ఏమిటి ? — ఇది రామారావుగారి ప్రధానమయిన ప్రశ్న. దీనికి భావం, లేదా భావాంశం పూర్తి కావటమనేది వచన పద్య పాద విభజనకు ఉపయోగించే పద్ధతి-అని సమాధానం. ఈ పద్ధతిని మొదటి నుంచే ప్రతిపాదిస్తున్నాను. నా ప్రతిపాదనకు ప్రమాణంగా ఋక్కులలోని పాద వ్యవస్థకు సంబంధించిన-

'తేషాంఋక్, యత్రార్థవశేన పాదవ్యవస్థా'

జైమినీయ మీమాంసా న్యాయసూత్రం (2-1-35) కూడా ఉదాహరించటం జరిగింది. ఋక్కుల్లో పాదవ్యవస్థ అర్థాన్ని బట్టి కాగా, ఇక్కడ— వచన పద్యంలో భావాన్ని బట్టి. ఈ అంశాలను నా వ్యాసంలో వివరించినాక గూడా, మళ్లీ ఈ ప్రశ్న రామారావు గారు వేయటం - 'భావ, భావాంశాలను గుర్తు పట్టటానికి గానీ, పరిగణించటానికి గానీ, ప్రమాణీకరించటానికి పద్ధతులేమీ లేవనీ, 'భావానికిగానీ భావాంశానికి గానీ భాషలో అస్తిత్వం వ్యాకరణ సంబంధాలవల్లనే సాధ్యం' అని చెప్పటానికే ననుకుంటాను. అంతే కాదు, 'వ్యాకరణ నిమిత్తం లేకుండా భావ, భావాంశాలను ఎట్లా పరిగణిస్తారో నా ఊహకు అందటం లేదు. వ్యాకరణాతీతంగా భావ, భావాంశాలను పరిగణించే సూత్రమేమిటి? అని 'సూటిగా' ప్రశ్నించటానిక్కూడా.

ఇక్కడ స్పష్టం చేయవలసిన అంశం ఒకటున్నది. ఎక్కడ కూడా నేను భాష, భావాంశాల అభివ్యక్తి విషయంలో వ్యాకరణ ప్రాధాన్యాన్ని నిరాకరించ లేదు. పైగా - 'వచన పద్యంలో భావాన్ని ప్రధానంగా స్వీకరిస్తున్నాం కాబట్టి, భావస్ఫూర్తిని కలిగించే పదాల కూర్పు, వాక్య నిర్మాణరీతి-వీటి కిందులో ప్రవేశ ముండక తప్పదు' అని, 'వచన పద్య నిర్మాణంలో భావస్ఫూర్తి విషయికంగా వాక్య నిర్మాణ రీతికి ప్రవేశం ఉంది. కాబట్టి, వాక్య నిర్మాణానికి వ్యాకరణానికి సంబంధం ఉంది కాబట్టి వ్యాకరణ రూపైకత అక్కడక్కడా భావగణ విభజనలో కనిపించటం సహజమే' అని కూడా నా వ్యాసంలో చెప్పటమయింది. అందువల్ల, భావస్ఫూర్తి విషయంలో వ్యాకరణం యొక్క అవసరాన్ని నేనేమీ కాదనలేదన్నది స్పష్టమే. ఈ 'కాదనలే' దన్న అంశాన్ని రామారావుగారు గమనించక పోలేదు. మరి, గమనించి కూడా, 'వ్యాకరణాంశాలకీ, వీరున్నాయంటున్న భావాంశాలకీ ఏకైక సంబంధం ఉంది కాబట్టి, వ్యాకరణ విరహితంగా భావగణ విభజన సాధ్యంకాదని నా నమ్మకం. సాధ్యమని నిరూపించాల్సిన బాధ్యత సంపత్కుమార మీదే ఉంది' అనటంలో తాత్పర్యం ఏమిటో బోధపడటం లేదు.

ఇంతకూ, అసలు విషయమేమిటంటే, ఒక భావం-అదెట్లాంటిదయినా, భాషలో అభివ్యక్తం కావాలంటే, ఆ భాషా పదాల ఒకానొక విధమయిన కూర్పు అవసరం. ఆ కూర్పులోని స్థితిని, అంటే, ఆ కూర్పులో ఒదిగిన పదాలకు కలిగిన పరస్పర సంబంధాలను వింగడించి చూపేది వ్యాకరణం. వ్యాకరణం వింగడిస్తున్నది కాబట్టి, ఆ సంబంధాలను వ్యాకరణ సంబంధాలంటున్నాం. మరి దీన్నే తిరగేసి చెప్తే, వ్యాకరణ సంబంధాలవల్ల భావస్ఫూర్తి కలుగుతున్నదనటం. భావస్ఫూర్తి అనేది ఎక్కడ ఉద్దిష్టమయినా కూడా అక్కడ ఈ వ్యాకరణ సంబంధాల ప్రసక్తి అవసరం ఉండనే ఉంటుంది. రామారావుగారు నాపై మోపిన బాధ్యతలోని చమత్కారమేమిటంటే, ఈ ఉండేదాన్ని ఉండదు అని చెప్పమని నిగ్గదీయటం. అయితే, ఈ సందర్భంలో గమ

నించవలసిన అంశ మొకటి భావం ఆధారంగా చెప్పే ప్రతి అంశాన్నీ ఆ భావస్ఫూర్తి వ్యాకరణ సంబంధాలవల్ల కలుగుతున్నదన్న కారణంగా వ్యాకరణ విషయకమేనని చెప్పనవసరం లేదు. ఉదాహరణకు ఆలంకారికులు అర్థాలంకారాలను పేర్కొన్నారు అంటే, ఆ అలంకారాలు అర్థస్ఫూర్తిని ఆధారం చేసుకొని చెప్పబడినయన్న మాట. మరి, భాషలో అర్థస్ఫూర్తి ఎట్లా కలుగుతుంది! రామారావుగారి మాటల్లో చెప్పాల్సంటే—'వ్యాకరణ సంబంధాలవల్లనే'. అయినప్పుడు 'వ్యాకరణాతీతంగా అర్థస్ఫూర్తి కలుగటం లేదు' కాబట్టి, ఆయన దృష్ట్యా వాటిని 'అర్థాలంకారాలు' అనకుండా 'వ్యాకరణాలంకారాలు' అనవలసి ఉంటుంది. ఎందుకంటే, 'వ్యాకరణ విరహితంగా భావస్ఫూర్తి కలిగే పద్ధతి ఒకటుంటే, అది చూపించే వరకూ వారి భావగణాలను వ్యాకరణ గణాలనే అనాల్సి ఉంటుంది'-అన్నారు గదా ఆయన! కాని ఆలంకారికులందరూ వాటిని 'అర్థాలంకారాలు' అనే అన్నారు తప్ప, 'వ్యాకరణ విరహితంగా' అర్థస్ఫూర్తి కలిగే పద్ధతిని వారు దేన్నీ చూపించ లేదు. అసలు విషయమేమిటంటే, అర్థ (భావ) స్ఫూర్తికి వ్యాకరణ సంబంధాలు ముఖ్యమే కాని ఆస్ఫూర్తి కలిగిం తరువాత ఆ కలిగిన అర్థం (భావం) ఆధారంగా ఏర్పడేవన్నీ, ఆ అర్థం (భావం) బట్టి చెప్పబడుతాయేకాని వ్యాకరణాన్నిబట్టి కాదు. అందుకని, నేను 'ఆధారపడ్డ భావస్ఫూర్తి' కలిగిం తరువాత ఆ భావం యొక్క పరిమితులనుబట్టి ఏర్పడే అంశాలు భావానికి సంబంధించినవయితయి. భావం అనేది భాషలో అభివ్యక్తమయినాక గాని ఇది భావం, లేదా ఇది భావంలోని ఒక అంశం అని చెప్పటానికి వీలుపడదు. ఋక్కుల పాదవ్యవస్థ విషయంలో నేను ఉదాహరించిన అంశం కూడా ఇంతే. అర్థాన్నిబట్టి పాదవ్యవస్థ అంటే, ఆ అర్థం వ్యాకరణాతీతంగా ఉంటుందని కాదు. కాగా పాద విభజనకు అర్థాని ఆధారంగా తీసుకోవటమయిందన్నమాట. అక్కడ అర్థస్ఫూర్తి ఎట్లా కలుగుతున్నదనికాదు, కలుగుతున్న అర్థస్ఫూర్తినిబట్టి పాదాన్ని ఎట్లా విభజిస్తున్నారన్నది ప్రధానం. భావ, భావాంశాలను బట్టి పాద విభజనకు ఉదాహరణంగా నేను చూపిన మాదిరాజు రంగారావుగారి వచన పద్యాన్ని ("అనల

తోరణం") రామారావు "మాటల కూర్పు" అంటూ—"పైన ఉదాహరించిన భాగంలో పాద విభజన వాక్య నిర్మాణంలో వాక్య-ఉపవాక్య విభజన జరిగే పద్ధతి ననుసరించి జరిగిందనిస్పష్టంఅన్నారు. ఈ లెక్కన "అర్థవశేన పాదవ్యవస్థా" అన్న ఋక్పాద విభాజక లక్షణం "వాక్యవశేన..." అని ఉండవలసి ఉండేది. కాని "అర్థవశేన..." అని మాత్రమే ఆ సూత్రం. ఇంతకూ వాక్యోపవాక్య విభజనకు ఆధారం ఏమిటి? కలిగే భావస్ఫూర్తి మాత్రమే. అందువల్ల ప్రధానమయింది భావస్ఫూర్తి మాత్రమే. కాని, "వాక్యోపవాక్య విభజన పద్ధతి" కాదు వ్యాకరణ విరహితంగా భావస్ఫూర్తిని గురించి ఇంతగా పట్టుబడుతున్న రామారావుగారు, భావస్ఫూర్తి విరహితంగా వ్యాకరణం యొక్క ఉనికిని నిర్ధారించే సూత్రమేమిటో వివరించవలసి ఉంటుంది. నిజానికి భావస్ఫూర్తిని వదిలితే వ్యాకరణం యొక్క అవసరంలేదు. మరొక అంశమేమిటంటే, భావస్ఫూర్తికి వ్యాకరణ సంబంధాల పరిజ్ఞానం తోడ్పడినంత మాత్రాన, స్ఫురించే భావం "వ్యాకరణ భావం" కాదు. భావస్ఫూర్తికి వ్యాకరణం సహాయకం-వచన పద్య పాద విభజనకు భావస్ఫూర్తి సహాయకం. భావగణ విభజనలో, పాద విభజనలో వ్యాకరణాంశాలు తోడ్పడినంత మాత్రాన అవి భావగణాలూ, వచనపద్య పాదాలూ కావటంలో క్షతి ఏమీ లేదు. ఏకాత్మక వృత్తాంతర్నిర్మాణాన్ని సమర్థించేందుకు గణిత శాస్త్రంలోని 'సెట్' సిద్ధాంతం తోడ్పడినంత మాత్రాన రామారావుగారంటున్న అంతర్నిర్మాణం గణిత శాస్త్రీయమయితుందా?

ఇదిట్లావుండగా, భావగణ లైన ఈ భావం, భావాంశాల స్వరూపాన్ని సంపత్కుమార ఇప్పటి వ్యాసంలోనైనా వివరించకపోవటం విచారకరం అన్నారు రామారావు. నేను వివరించక పోవటమేమిటి? ఉదాహరణ పూర్వకంగా ('అనలతోరణం'లోని ఒక వచనపద్యం) వివరించినాను. అయితే, 'విచారకరం' ఏమిటంటే, నేను వివరించిన భావ, భావాంశాలను వ్యాకరణ సంబంధాల పరంగా అన్వయిస్తూ మరోరకమయిన వివరణ ఇవ్వటానికాయన ప్రయత్నించటం.

ఇక, — 'భిన్న భిన్నవచన పద్యపాదాల్లో అక్కడ భావాన్ని స్ఫురింపజేసే పదాలస్థితినిబట్టి భావగణ విభాజకరీతి ఉంటుంది' అన్న సంపత్కుమార వివరణ చాలా అసంతృప్తికరంగా ఉంది. ఆ స్థితి ఏమిటో నిరూపించే వరకూ భావగణాల అస్తిత్వాన్ని అంగీకరించలేను అన్నారు రామారావుగారు. నిరూపిస్తాను. భావగణం ఏకపదంగా ఉంటుందా? బహుపదంగా ఉంటుందా? అన్నప్పుడు, అక్కడ ఉపయుక్తమయిన పదాలస్థితి అంటే, ఏకపదం భావాంశ స్ఫోరకమైతే ఏకపదమే భావగణం. బహుపదాల సమష్టి భావాంశస్ఫోరక మయితే, ఆ సమష్టే భావగణం. భావాన్ని స్ఫురింపజేసే పదాలస్థితి అంటే ఇది. అక్కడి పదాలు పూర్తిభావాన్ని స్ఫురింప జేస్తున్నాయా? భావాంశాన్ని స్ఫురింపజేస్తున్నాయా?—ఇవన్నీ భావగణస్వరూపంలో (ఏకపద-బహుపద స్వరూపంలో) భేదాన్ని కలిగించవచ్చు. అందుకే, రామారావుగారు ఉదాహరించిన పై వాక్యం తరువాత నా వ్యాసంలో —భావగణ స్వరూపంలో భేదం ఉండవచ్చుగాని, భావగణం మాత్రం ఉంటుంది.' అన్న వాక్యంఉంది. అంతేకాదు—'భావాన్ని ఆధారంగా చేసుకుని పదాల స్వరూపంలో, వాటి కలయికల్లో ఎన్ని భేదాలున్నా కూడా అది భావగణమే. అది ఏకైకం' అనికూడా వివరించబడింది. ఈ సందర్భంలో భగణస్వరూపాన్ని ఒక ఉదాహరణంగా చూపిస్తూ, భగణం ఆదిలో ఉండే గురువర్ణ స్వరూపంలో నాలుగు విధాల భేదాలు (దూరము, దంపలు, దుఃఖము, దుర్గతి) ఉన్నాకూడా, అది భగణమే అయినట్టూ, ఈ భేదాలు కారణంగా ఆ గణానికి నాల్గు పేర్లు లేనట్టు, భావగణ స్వరూపంలోని భేదాలను బట్టికూడా దానికి వేరు వేరు పరిగణనం లేదన్నాను. ఇక్కడ ఈ అంశం ఉదాహరించటంలో గమనించవలసింది భేదాలున్నా కూడా భగణానికి వేరువేరు పేర్లు లేవనేదే కాని మరోటి కాదు. నేనుదాహరించిన గురువర్ణ స్వరూపంలో భేదా ఉన్నా 'సామ్యం కూడా ఉందనీ', "ఆ సామ్యాన్ని హేతుబద్ధంగా నిరూపించవచ్చుననీ రామారావు గారన్నారు. నిజానికి ఆ భేదాల సామ్యాన్ని హేతుబద్ధంగా నిరూపించవచ్చునా. లేదా అన్నది ప్రస్తుతం

కాదు, ప్రస్తుతం తేడా ఉన్నదా లేదా అని. పైగా, గురుస్వరూప విషయంలో "హేతుబద్ధత" కూడా నిజానికి లేదు. ఎందుకంటే, ఆయన నిరూపించిన పద్ధతిలో 'పూర్వవ్యంజనంతో సంబంధం లేకుండా దీర్ఘాచ్చుగానీ, పరవ్యంజనంతో మూతపడిన హ్రస్వాచ్చుగాని గురువు అవుతుంది'. కాని, అంతేకాదు, ఇంకా ఉన్నది. పూర్వవ్యంజనంతో సంబంధం కల దీర్ఘాచ్చు కూడా గురువై తుందని CV̄ అన్న గుర్తులతో వారే తెల్పినారు. కాని, పరవ్యంజనంతో మూతపడిన దీర్ఘాచ్చు VC కూడా (ఆన్) గురువే అయినుంది ఇంకా పూర్వవ్యంజనంతో సంబంధం కలిగి పరవ్యంజనంతో మూతపడిన దీర్ఘాచ్చు CVC కూడా (కాన్) గురువయితుంది. ఆ-కా-కాన్ అనే ఈ మూడు గురువుల 'అక్షర పరిమాణం' ఒకేవిధంగా ఉన్నదనటానికి వీల్లేదు.

నిజానికి ఇక్కడ అచ్చంగా గురులఘుక్రమంతో భావగణం నిరూపించటం ఉద్దిష్టంకాదు గురు-లఘువులతో ఏర్పడే గణాల్లో తేడాలున్నట్టే, ఈ భావగణాల్లోనూ ఉంటుందని సూచించటమే ఇక్కడ ప్రయాసం.

ఇట్లాగే మరోచోట గూడా నేనుదాహరించిన అంశాన్ని రామారావు సాగదీసినారు. ఒక పద్య పాదాన్ని భిన్నలాక్షణికులు రెండు భిన్నలక్షణంగల పద్యాలకు చెందిన పాదాన్నిగా నిరూపించేవీలు ఒకప్పుడు కలుగవచ్చునన్న అంశాన్ని చెప్పటానికివీలుగా, సీస పాదంగానూ, ఆటవెలది పాదంగానూ విభక్తమయ్యే విధంలో ఉన్న ఒక పాదాన్ని ఉదాహరణగా చూపి, ఇట్లాగేభిన్న లాక్షణికులు వచన పద్య పాదాన్ని గూడా వేరువేరు పాదాలుగా విభజించే అవకాశమున్న దన్నాను. ఇక్కడ కూడా ఒకపాదాన్ని ఒకటికన్న ఎక్కువ రకాలుగా విభజించే అవకాశం ఉన్నదని చెప్పటానికే ప్రాధాన్యం. అయితే, 'కవి ఉద్దేశించిన పాద విభజన మనకు ఎందుకు ప్రమాణం కావాలి? నిజమే, అక్కర లేదు' అంటూనే—'కవి ఉద్దేశించిన పాదవిభజన, లాక్షణికుడు చేసిన పాద విభజన ఒకటే ఎందుకవుతున్నయి? ఇద్దరూ ఒకసూత్రాన్నే

విభజన ఉద్దేశించలేదని రామారావుగారికి రాసినానని కూడా నాకు తెలియదు అయితే, ఈ చూడక పోవటం తెలిక పోవడాలవల్ల నేను పొరపాటుపడే అవకాశం మాత్రం వుండదేగు. ఇది ముఖ్యంగా, గమనించవలసిన అంశం. పరీక్షకు హాజరయ్యే వాడికి ప్రశ్నలిచ్చి నట్టుగా రామారావుగారి రెండు రచనల నిచ్చి పాద విభజన చేయ మన్నట్టు రాసారు. మరి, ఈ స్థితిలో నేను 'అంగారవల్లరి' నిగాని, తిలక్ 'అమృతం కురిసినరాత్రి' నిగాని చూడనవసరం లేదు ఒక విధంగా చూడకూడదు కూడా. ఇక, ఇక్కడ తిలక్, దముగా రెడ్డి పాదవిభజనను ఉద్దేశించినారా? లేదా? అన్నది కాదు కావలసింది! అది వచన పద్యమయితే, -అయిందికాబట్టి,-పాద విభజన జరిగిందా ? జరిగితే ఏ సూత్రం ప్రకారం ? ఆ ప్రకారాన్ని బట్టి అవి సరిగా ఉన్నాయా ? లేకపోతే ఎట్లా ఉండాలె ? అన్నది ముఖ్యం. (ఆ 'భాగాలు' వచన పద్యాలు అనే ఉదాహరించబడ్డయి. వచన పద్యాలు కాకపోతే వాటి ప్రసక్తే ఇక్కడ ఉండేది కాదు.) పాద విభజన అక్కడ ఉన్నదనీ, కాని ఉదాహరించిన రీతిలో వచన పద్య పాదవిభాజక సూత్రం ప్రకారం దోషం ఉన్నదనీ చూపించినాను.

"అమృతం కురిసినరాత్రి" తిలక్ మరణించిం తరువాత అచ్చ యిందనీ, కవి అందులోని-ఏ ఖండికలో పాదవిభజన ఉద్దేశించినాడో, ఎక్కడ ఉద్దేశించలేదో తెలుసుకోటానికి అచ్చయిన పుస్తకమే ఆధారం. ఈ ఆధారంతో చూస్తే ఇక్కడ కవి పాదవిభజన ఉద్దేశించినట్లు తోచదు. ఇప్పుడు కనిపించే పాద విభజన తిలక్ పద్యాలు కాపీ చేసిన వారో, అచ్చువేసినవారో చేసి ఉండవచ్చు" అంటారు రామారావు గారు.

ఇక్కడ ఒక విషయం. నిర్దిష్టప్రతి పాదన లాధారంగా నేను తిలక్ రచనలో పాదవిభజన చేసినాను. మరొకటి "అమృతం కురిసిన రాత్రి"లోవి అసలు వచన పద్యాలేనా ? వచన పద్యాలయితేనే ప్రస్తుత చర్చ లేకపోతే వాటి నుదాహరించవలసిన అవసరం లేదు. కవి పాద విభజన ఉద్దేశించిందీ లేనిదీ నిర్ణయించటానికి అచ్చుపుస్తకమేగదా

ఆధారం ! దాన్ని వదిలి, ఉద్దేశించింది లేనిదీ, తిలక్ మరణించినాడు కాబట్టి, మరో ఆధారం లేదు ఆయన బతికుండగా అచ్చయిన వచన పద్యాల్లో పాదవిభజన తిలక్ ఉద్దేశించిందేనని చెప్ప వచ్చుగదా ! ప్రస్తుతం అచ్చు పుస్తకంలో కనిపించే పాద విభజనలో దోషం ఉంటే, అది "తిలక్ పద్యాలు" కాపీ చేసిన వారి, లేదా అచ్చువేసినవారి వల్లవచ్చిందే కాని తిలక్ వల్ల కాదని రామారావుగారంటూనే ఉన్నారుగదా ! మరి, నేను కూడా తిలక్ రచనకు పాదవిభజన చేసి చూపింతరువాత, "-ఆ పాదవిభజన అస్తవ్యస్తంగా జరిగింది ఆది రాతలోనూ అచ్చులోనూ జరిగే వీలుంది, అని అనసే అన్నాను నా వ్యాసంలో". నిజానికి, తిలక్ వచన పద్య ప్రయోక్తల్లో చాలా ప్రముఖుడు. వచన పద్య పాద విభజన విషయంలో నా ప్రతి పాదనలను తిలక్ హర్షించిన సంగతి నా వ్యాసంలో రాసినానుకూడా.

ఇదిట్లా ఉండగా, "భావస్ఫూర్తి ఆధారంగా విభక్తమవు తయ్యని సంపత్కుమార అంటున్న భావగణాలు అన్నిరకాల భాషా వ్యవహారాల్లోనూ ఉంటై. అయినప్పు డాయన పద్ధతి ననుసరించి ఒక వ్యాసంలోని వాక్యాలను గూడ భావ, భావాంశాల పద్ధతిలో పాదవిభ జన చేసి వచన పద్యంగా నిరూపించవచ్చు. అచ్చులో గాని, రాతలో గాని కవి పాదవిభజనను సూచించటం ప్రమాణంగా తీసుకుంటే, ఆ పని వ్యాసకర్త కూడా చెయ్యవచ్చు. ఇకపోతే, వచన పద్యంలో ఉండే కవితా పదార్థం దాన్ని వ్యాసాలనుంచి, ప్రకటనల నుంచి వేరు చేస్తుంది కదా అంటే, కవిత్వానికి గద్యంలో స్థానం లేదని అనాల్సి ఉంటుంది. రసహీనమైన పద్యాలు, రసవంతమైన గద్యం ఉంటయ్యని అందరూ ఒప్పుకుంటారు. కవిత్వం ఉన్నదల్లా ఛందో విభాగం అనీ, ఛందస్సులో ఉన్నదల్లా కవిత్వ మవుతుందని సంపత్కుమార అంటా రనుకోను"-అన్నారు రామారావుగారు. నేను అనను,అనుకోను గూడా కాని, ఇక్కడ కవితా పదార్థం ప్రసక్తి ఎందుకు ? వచన పద్యం పద్యం కావటానికి, అందులో కవితా పదార్థం ఉండటానికీ, లేకపోవటానికి సంబంధం లేదు. ఉండవచ్చు, ఉండకపోవచ్చు. రసహీనమయినపద్యాలు

ఉంటాయని వారూ అంటూనే ఉన్నారు. వచన పద్యం అందుచేత భిన్న మేమీ కాదు. గణితం, వైద్యం పద్యాల్లో రాసిన వారున్నారు. వ్యాసా లను కూడా పద్యాల్లో రాసినవారూ ఉన్నారు. "షార్ట్" హాండ్లో రాసినా ఉంటారు. అందువల్ల వ్యాసకర్త తన వ్యాసం వచన గద్యంలో రాస్తే మునిగిపోయేదేమీలేదు ప్రకటనల్ని వచన పద్యాలుగా నిరూపించ వచ్చు. ప్రకటనల్ని సాంప్రదాయిక పద్యాల్లో మాత్రం రాయటానికి వీల్లేదా? ఎందరురాయరు! వచన పద్యం "పద్యం". పద్యం బాహ్య స్వరూపం కవితా పదార్థం, రసం మొదలయిన యన్నీ అంతరంగాలు. ఇవి లేని సాంప్రదాయిక పద్యాలున్నట్టే, వచనపద్యాలూ ఉండవచ్చు. అందువల్ల కవితా పదార్థం ఉన్నా, లేకున్నా వచన పద్యంవచనపద్యమే. అయితే అది వచన పద్య పాదవిభాజక సూత్రానికి ఒదిగితేనే వచన పద్యం. కాకపోతేకాదు. వచన పద్యం ఈ విధంగా ఒక విధమయిన ఛందో రూపం, అంటే.

1 — శ్రీ సంపత్కుమార ఇప్పటి వ్యాసంలోనైనా వచన పద్యాన్ని అంతర్నిర్మాణమూ, బాహ్యపరిమితి ఉన్న పాదాలుగా విభ జించటానికి స్పష్టమయిన ప్రతిపాదన ఏదీ చెయ్యలేదు. ఆయన ఉన్నయ్యంటున్న భావగణాలు వ్యాకరణాంశాల మీదనే ఆధారపడ్డ కనుక, అవి వ్యాకరణ గణాలే అవుతై. ఆయన భావగణ పద్ధతికి వచన పద్యాన్ని గద్యం నుంచి వేరుచేసే శక్తి లేదు' – అన్నారు రామారావుగారు దీనికి సమాధానాలు నా పూర్వ వ్యాసంలోనూ ఉన్నయి. ఈ వ్యాసంలో ఇంకా స్పష్టపరచటమయింది. అంతర్ని ర్మాణం గూర్చి మొదటి నుంచీ నా అభిప్రాయం స్పష్టమే. బాహ్య పరిమితి విషయం గరిష్ఠకనిష్ఠ పరిమితి అన్న ధోరణిలో వారూ గమ నించినారు. నేనూ స్పష్టీకరించినాను. నిజానికి బాహ్యపరిమితి కాదిది, పాదపరిమితి, భావగణా (భావాంశా)లను వ్యాకరణ గణాలనగూడ దనీ, భావగణాలే అనాలని కూడా ఈ వ్యాసంలో స్పష్టపరుచబడింది. -'ఒక వ్యాసంలోని వాక్యాలను గూడ భావ భావాంశాల పద్ధతిలో పాద విభజనం చేసి వచన పద్యంగా నిరూపించవచ్చు' నని వారే అంటూ

న్నారు. మరి 'భావ-భావాంశాల పద్ధతిలో పాద విభజన' చేసినప్పుడు అది గద్యం నుండి వేరు కాక మానేయదా? గద్యానికి పాద విభజన ఉండదు కాబట్టి, అది గద్యం కాదు పద్యమయితుంది. పాద విభజన అప్పుడు ఉండేది పద్యానికే. ఇక్కడ ఒక చిన్న విషయం. వ్యాసాల్ని 'వచనపద్యంగా' నిరూపించవచ్చు నన్నారాయన. మరి సాంప్రదాయిక ఛందస్సుల ననుసరించి, వ్యాసాన్ని ఇరవయ్యారేసి అక్షరాలుగా (అంతకు తక్కువగా కూడా) విభజించి విషమ వృత్తాలుగా నిరూపించవచ్చు. ఈ విధంగా ఈ నాటి వచన పద్యాన్ని 'విషమ వృత్తం'గా పరిగణించవచ్చునని ఒక మిత్రుడు సూచించినాడు. మరి దీని కేమంటారు! కాని, ఈ రెండూ వాదానికి నేనే. కాబట్టి వ్యావహారికంలోని పద్యాలకు అనువయిన పద్ధతిని నిష్పన్నం చేయటం అవసరమయింది-చేయటమూ అయింది.

తమ వ్యాసాంతంలో రామారావుగారు వచన పద్య పాదబద్ధతను నిరూపించటంలో నేనుపడ్డ చిక్కు లన్నిటికీ (నిజానికి అవి చిక్కు లయితే,) – 'కారణం' మనకు ప్రసిద్ధంగా ఉన్న ఛందస్సంప్రదాయంలో ఎక్కడో చోట వచన పద్యానికి చోటు కల్పించటం కోసం ప్రయత్నించటం. ఏదో రకమయిన ఛందస్సూ, గణవిభజనా ఉన్నయ్యంటే వచన పద్యానికేదో గౌరవం అదనంగా వస్తుందనుకోవటం' – అన్నారు. వచన పద్య పాదబద్ధత నిరూపించటానికి ఋజువయిన మార్గాన్నే అనుసరించినాను తప్ప, నేను చిక్కులేమీ పడలేదు. గమనించవలసిన అంశమేమిటంటే, వచన పద్యానికి ఛందస్సంప్రదాయంలో నేనుగా చోటు కల్పించటానికి ప్రయత్నించలేదు. మాత్రా ఛందస్సులను దాటివచ్చి, తనంతట తానే వచనపద్యం ఛందస్సంప్రదాయంలో చోటు చేసుకున్నది. ఛందః ప్రయోక్తలేదాన్ని ప్రయోగించి, ఛందస్సు రూపంగా దానికి వ్యాప్తి తెచ్చినారు తప్ప, గద్య ప్రయోక్తలు కారు. కాగా, నేను చేసింది ఛందస్సంప్రదాయంలో వచన పద్యం తానుగా చేసుకున్న చోటు యొక్క-

స్వరూపాన్ని స్పష్టం చేయటమే. ఇక పోతే, ఛందస్సూ, గణ విభజనా ఉన్నంత మాత్రాన ఏ 'పద్యా'నికీ 'అదనపు' గౌరవం రాదు. ఆ పద్యంలో శక్తి ఉంటే వస్తుంది. ఇక, వచన పద్యం యొక్క ఛందస్స్వరూపాన్ని నేను స్పష్టం చేయటంవల్ల దానికి 'అదనంగా' గౌరవం వస్తే, దానికి అభ్యంతరం ఎందుకుండాలి?

కాగా, నేను వచన పద్యానికి నిరూపించిన లక్షణం, చూపిన పాదబద్ధతా, పాదవిభజనరీతీ-వీటి ననుసరించి 'వచన పద్యం' పద్యమే అవుతుందనీ, పాదబద్ధత లేని గద్య విభాగంలో చేరదనీ 'వచనపద్య' పరిశీలకులకు మనవి చేస్తున్నాను.

(భారతి, మార్చి 1978 పే. 15-27)

# పద్యం, గద్యం, వచన పద్యం వగైరా

-చేకూరి రామారావు

'వచన పద్యం' పద్యమేనా అనే వ్యాసంలో శ్రీ సంపత్కుమార ఒక సమస్యపై ప్రశ్న వేశారు. ఒక వ్యాసంలోని వాక్యాలను భావ ప్రాధాన్యాల పద్ధతిలో పంక్తివిభజన చేసి వచన పద్యంగా నిరూపించవచ్చునని వేరొకరు దానికి అంగీకరిస్తూనే ఈ కింది విధంగా ప్రశ్నించారు. "వారి సాంప్రదాయక ఛందస్సులను ననుసరించి వ్యాసాన్ని 26 అక్షరాలుగా (అంతవరకు కూడా) విభజించి విషమ వృత్తాలుగా నిరూపించవచ్చు. ఈ విధంగా ఈ నాటి వచన పద్యాన్ని విషమ వృత్తంగా పరిగణించవచ్చునని ఒక మిత్రుడు సూచించినారు. మరి దీనికి ఏమనాలి?" దీని అర్థం ఏమిటంటే గద్య పద్యాన్ని వేరు చేసే శక్తి ఛందోగత పద్ధతికి లేని మాట నిజమే అయినా, ప్రాచీన ఛంద స్సిద్ధాంతానికి కూడా ఈ అవస్థ తప్పదని. ఇది నిజమైతే ప్రాచీన ఛందస్సంప్రదాయం ఈ మేరకు లోపభూయిష్ఠం కావాలి. ఏ ఛంద స్సిద్ధాంతమైనా గద్య పద్యాల్ని వేరు చెయ్యలేకపోతే, దాని ప్రధానమైన ప్రయోజనమే దెబ్బతిన్నట్టు. ఈ దృష్టితో ప్రాచీన ఛందశ్శాస్త్రాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. ప్రాచీనుల ఛందశ్శాస్త్రాన్ని ఈ కింది పద్ధతిలో ఒక వృత్త నిర్మాణ యంత్రంగా ఊహిస్తున్నాను. ఇట్లాంటి యంత్రాన్ని ఇదే పద్ధతిలో వాళ్ళు ఊహించారనటం ఉద్దేశం కాదు. వాళ్ళ సిద్ధాంతాన్ని ఈ యంత్రం ద్వారా వివరించటం సాధ్యం అని మాత్రమే. ఇట్లాంటి నిజమైన యంత్రాన్ని నిర్మించవచ్చునని కూడా నా ఉద్దేశం కాదు. ప్రాచీన ఛంద స్సిద్ధాంతాన్ని అర్థం చేసుకోటానికి ఈ ఊహాయంత్రం సహాయకారి అని మాత్రమే.


వృత్త నిర్మాణ యంత్రం
పాదోత్పత్తి విభాగం
O = 2ⁿ
O = అక్షర క్రమాలు
2 = గురులఘు భేదం
n = పాదంలో అక్షర సంఖ్యా పరిమితి
2. పాదాంత విరామం
3. వర్ణమైత్రి
1. ప్రాసమైత్రి.
3. సమవిషమ వృత్త భేదం.
భాష
వృత్తాలు

ఈ యంత్రంలో మూడు భాగాలున్నై. 1. పాదోత్పత్తి విభాగం, 2. ఛంద నియమ విభాగం, 3 సంయోజన విభాగం. మొదటి భాగం అక్షరక్రమాల్ని ఉత్పత్తి చేస్తుంది. రెండో భాగం పాదాలకు అంతర్నియమాలను విధిస్తుంది. మూడో భాగం సమానమైన పాదాలను వరుసగా ప్రాస నియమంతో బంధిస్తుంది. వివిధ వృత్తాలకు సంబంధించిన నియమాలు రెండో భాగంలో ఉన్నై. ఈ యంత్రానికి ముడిసరుకు భాషలో వాక్యాలు. దీనికి ఉత్పత్తి అయ్యేవి వృత్తాలు. జాతులు, ఉప జాతులు, మాత్రా ఛందస్సులకు ఈ యంత్రం పనికిరాదు. అక్షర ఛందస్సులకు మాత్రమే ఇది పనికివస్తుంది.

అక్షర భేదాల సంఖ్య (గురు—లఘువులు)2. ఇది స్థిరాంకం. పాదంలో అక్షరాల సంఖ్య 1 నుంచి 26 వరకూ ఉండొచ్చు. 26 అక్షరాలకు మించిన పాదాలున్న లయగ్రాహి (30) లయవిభాతి (34) లయహారి (37) వంటి వృత్తాలను పేర్కొనటాన్ని బట్టి చూస్తే పాదంలో అక్షరాల సంఖ్య మీద గరిష్ఠ పరిమితి విధించటం ప్రాచీనుల ఉద్దేశం కాదని ఊహించవచ్చు. కాని 26 అక్షరాల సంఖ్య వరకు మాత్రమే పేర్లు పెట్టారు. అంతకు ఎక్కువ ఉండటాన్ని వాళ్ళు నిషేధించలేదు. ఒక్కో ఛందస్సులో అక్షరక్రమాల సంఖ్య "2 to the Power of n" అనే గణిత సూత్రం మీద ఆధారపడి ఉంది. పాదంలో ఎన్ని అక్షరాలుంటే అన్ని సార్లు అక్షర భేద సంఖ్యను క్రమంగా హెచ్చిస్తూ పోతే పాదంలో అక్షరక్రమాల సంఖ్య వస్తుంది. అదే ఒక్కో ఛందస్సులో పుట్టే వృత్తాల సంఖ్య. పాదోత్పత్తి విభాగం చేసే పని ఇది. ఈ పద్ధతిలో 26 పాదంలో అక్షరాల గరిష్ఠ సంఖ్య అయితే 134217728 అక్షరక్రమాలు (ఇదే మొత్తం వృత్త సంఖ్య కూడా) సాధ్యమవుతై. విషమ వృత్తాలను పరిగణిస్తే సంఖ్య ఇంకా పెరుగుతుంది.

"ప్రస్తారము వలన ఇన్ని కోట్ల వృత్తములున్నట్లు తెలిసినను, ప్రయోగములో నున్న మొత్తము వృత్తాల సంఖ్య అత్యల్పము. వంద,

వంద యేబదికి మించకపోవచ్చును". (సంపత్కుమార 1967) గా ప్రయోగంలో ఉన్న 100 లేక 150 పద్యాలకు లక్షణం చెప్తే సరిపోయేది గదా! ఇని, కోట్ల వృత్తాలను అనవసరంగా సృష్టించటం ఎందుకు అనే సందేహం రావటం సహజం. ఉన్న పద్యాలకు లక్షణం చెప్పటం పరిమిత లక్ష్యం. భాషలో సాధ్యమైన వృత్తాలన్నిటికీ ఆటోమేటిక్‌గా లక్షణ నిర్వచనం చేసే యంత్రంగా ప్రాచీన ఛందః కారులు ఛందశ్శాస్త్రాన్ని పరిగణించారు. దీన్నే అల్గోరిథమ్ అంటారు. ఈ లక్ష్యం భాషా శాస్త్రంలో వచ్చిన జనరేటివ్ సిద్ధాంత లక్ష్యం వంటిది. ఒక వ్యవహర్త ప్రయోగించే వాక్యాల సంఖ్య పరిమితం గావచ్చు అతనికి అనంతమైన వాక్యాలను ప్రయోగించగల దక్షత ఉంది. ఇది అతను నిర్మించుకున్న అమూర్త వ్యాకరణం ఇచ్చిన శక్తి. దీనికి భౌతికమైన అవధులు ఉండటంవల్ల వ్యవహర్త ప్రయోగించే వాక్యాల సంఖ్య ఎప్పుడూ పరిమితమే. ఇట్లాంటి అనంత వాక్య ప్రయోగ దక్షత ఇచ్చిన అమూర్త వ్యాకరణానికి మూర్త రూపాన్నివ్వటమే వ్యాకర్తల లక్ష్యం. ఇట్లాంటి దక్షతను ప్రతిభ అని వాక్యప్రయోగాన్ని ప్రవృత్తి అని తెలుగులో వ్యవహరిస్తున్నాను. కేవలం ప్రయోగించిన వృత్తాలకు లక్షణం చెప్పటం కాకుండా భాషలో సాధ్యమైన వృత్త సమస్తానికి ఆటోమేటిక్‌గా లక్షణ నిర్వచనం చేసే సిద్ధాంతంగా ఛందశ్శాస్త్రాన్ని ప్రాచీనులు పరిగణించారు గనుక వీరి సిద్ధాంతాన్ని కూడా జనరేటివ్ సిద్ధాంతంగానే గుర్తిస్తున్నాను.

సాధ్యమైన అన్ని క్రమాలను పద్య భేదాలుగా లెక్కగడితే గద్యానికి పద్యానికి భేదం ఎక్కడ? ఏ వాక్యాన్ని తీసుకున్నా ఏదో ఒక అక్షర సంఖ్య ఉంటుంది. ఏదో ఒక అక్షర క్రమం ఉంటుంది. ఇట్లాంటివి నాలుగు కూరిస్తే భిన్న అక్షర క్రమాలు గల పాదాలతో విషమవృత్తం అవుతుంది గదా? అట్లాంటప్పుడు ఏ వ్యాసాన్నయినా ఆ పద్ధతిలో పాద విభజన చేసి విషమ వృత్తాలుగా నిరూపించటానికి వీలు లేదా? ఇది సంపత్కుమారగారుద్దేశించిన ప్రశ్న. ఇంత జనరేటివ్ సిద్ధాంతాన్ని ఊహించిన ఛందశ్శాస్త్రకారులకు మాత్రం ఈ ప్రశ్న తట్టి ఉండదా? అందుకే వృత్త నిర్మాణయాంత్రంలో మిగతా భాగాలు,

గురువే అవుతుందని, హ్రస్వాచ్చు పరవర్ణసంయుక్తంతో ముడిపడ్డప్పుడు మాత్రమే గురువు అవుతుందని నా ఉద్దేశం. పై సూత్రీకరణ అక్షరాలు (Syllables) ఆధారంగా చేసుకొని చెప్పింది. అయితే నేను కొన్నిటిని వదిలేశాననుకొని సంపత్కుమార వాటిని పూరించారు. అందులో తప్పులేదు కాని, ఆ పూరణకు అవసరం లేదు. ఇదే సందర్భంలో గురు లఘు నిర్ణయంలో హేతుబద్ధత లేదన్నారు సంపత్కుమార. అట్లా ఎందుకనుకుంటున్నారో నాకర్థం కావటం లేదు. నేననుకుంటున్న హేతుబద్ధతను కొంచెం వివరిస్తాను.

అచ్చుల్లో హ్రస్వ దీర్ఘ భేదాలున్నాయి. ఒక్కొక్కసారి ఉచ్చారణలో మనం హ్రస్వాచ్చులను పలుకుతున్నా, వాటి కన్నా దీర్ఘంగా వినిపించవచ్చు. దీర్ఘాచ్చులను పలుకుతున్నా, వాటిల్లో కూడా తరతమ భేదాలుండవచ్చు. అందువల్ల వీటిమీద ఆధారపడ్డ గురు లఘు నిర్ణయంలో వ్యత్యయం రాదా అనే ప్రశ్న రావటం సహజం. హ్రస్వ దీర్ఘ స్వరభేదం భాషలో సైకలాజికల్ రియాలిటీ మీద ఆధారపడి ఉంది. ఇది ఫిజికల్ రియాలిటీతో భేదించవచ్చు. ఒకటి రెండు ఉదాహరణలిస్తాను.

తెలుగులో నాకు – చింత అనే మాటల్లో మొదటి మాటలో పదాది వ్యంజనాన్ని, రెండో మాటలో సున్నాతో సూచించిన వ్యంజనాన్ని ఒకటిగానే గుర్తిస్తున్నాం. (స్పర్శంముందు అనునాసిక వ్యంజనాన్ని, సున్నతో సూచించడానికి కారణం ప్రెడిక్టబిలిటీ. వీటిమధ్య భౌతికమైన ఉచ్చారణ భేదం ఉంది. మొదటిది దంతమూలీయం, రెండోది దంత్యం అయితే రెండుచోట్లా తవర్గానునాసికంగానే పరిగణిస్తున్నాం. అట్లాగే మనం స్పర్శాలుగా పరిగణిస్తున్న వర్ణాలు కొందరి ఉచ్చారణలో ఊష్మాలు కావచ్చు. ఉదా: ఫలితం, కఫం. మనం ఉభయోష్ఠ్యాలుగా పరిగణిస్తున్న వర్ణాలు కొందరి ఉచ్చారణలో దంతోష్ఠ్యాలుగా వినిపించవచ్చు. ఉదాహరణకు ప, బ, మ లు రెండు పెదాలూ మూయటానికి ఇబ్బంది ఉన్న వ్యవహర్తల ఉచ్చారణలో దంతోష్ఠ్యాలుగా వినిపించవచ్చు. ఈ వ్యవహర్తల తెలుగు భాషకుచేసే వర్ణ నిర్ణయంలో ఈ భౌతికమైన భేదాలు అడ్డురావు.

సైకలాజికల్‌గా 'న' వర్ణం దంత్యమే. 'ణ' వర్ణం మూర్ధన్యమే. ప,బ,మ లు ఓష్ఠ్యములే. ఇక్కడ తప్పొప్పుల ప్రసక్తి లేదు. ఇది ఛందోబద్ధమైన నిర్ణయమే. అట్లాగే గురు లఘు నిర్ణయం కూడా. గురు లఘు భేదం భాషలో ఉచ్చారణ విధానానికి సంబంధించింది. ఛందస్సు సంబంధమైన నిర్ణయాలు చేసేటప్పుడు సైకలాజికల్ రియాలిటీనే పరిగణించాలి. గురు లఘు నిర్ణయంలో ప్రాచీనుల్లో మత భేదాలున్నంత మాత్రాన వాటిని అవ్యవస్థితత్వానికి సూచకాలుగా గ్రహించకూడదు.

నేను ప్రత్యేకంగా ప్రస్తావించని విభాగాలను నేను అంగీకరించినట్లుగా భావిస్తున్నారు సంపత్కుమార. అయితే, నేను విభజించిన విధానాన్ని గురించి సంపత్కుమారగారు ఏమీ అనలేదు కాబట్టి నా విభజన సరిగానే ఉంటుందనుకోవాలి అని రాశారు. వచన పద్యంలో పాద విభజనకు నిర్దిష్ట సూత్రం ఏదీ లేదని భావించే నేను, ఆయన గానీ, ఇతరులు గానీ చేసే పాద విభజనను ఎట్లా అంగీకరిస్తాను? అసలు అంగీకరించటం, నిరాకరించడం అనే సమస్యే ఉండదు కాదు. ఆర్బిట్రరీగా చేసే విభజన, తప్పూ కాదు, ఒప్పూ కాదు.

పద్య విభజనలో ఉన్న వైవిధ్యాన్ని గురించి చెబుతూ, ఛందస్ శ్లేషను గురించి ప్రస్తావించాను. సంపత్కుమార దాన్ని నేనుద్దేశించిన అర్థంలో గ్రహించలేదు. పద్య విభజనలో భిన్నత్వం Predict చెయ్యటం వీలవుతుందా, కాదా అనే దృష్టితో నేను పరిశీలించాను. ఈ విషయాన్ని స్పష్టంగా తెలియజెయ్యటం కోసం వ్యాకరణ భిన్నత్వం ఒకే వాక్యానికి రెండర్థాలను ఎట్లా కలిగిస్తుందో పరిశీలిస్తాను.

1. ఇంట్లో బియ్యం లేవని మా ఆవిడ రొట్టెలు చేసింది.

ఈ వాక్యానికి రెండర్థాలున్నై. ఆ అర్థాలు కింది వాక్యాల్లో వ్యక్త మౌతున్నై.

2. ఇంట్లో బియ్యం లేవు కాబట్టి మా ఆవిడ రొట్టెలు చేసింది (హేత్వర్థం)

3. "ఇంట్లో బియ్యం లేవు" అని (నాతో అని) మా ఆవిడ రొట్టెలు చేసింది. (అనుకరణార్థం)

ఈ రకమైన భిన్నార్థకత వ్యాకరణం ప్రెడిక్టు చేస్తుంది. మొదటి అర్థం ఆ+ని అను ధాతువునుంచి ఏర్పడ్డ క్త్వార్థక రూపంగా అన్వయించటం వల్ల వచ్చింది. (అనుకరణలో వచ్చే అని వెనువెంటనే వచ్చే అను ధాతు నిష్పన్న రూపాల ముందు వికల్పంగా లోపిస్తుంది) రెండో అర్థం అని ని అనిష్పన్నమైన అవయవి సూచకంగా గ్రహించటం వల్ల వచ్చింది. అనుధాతువు నుంచి నిష్పన్నమైన క్త్వార్థక క్రియ అవయవి సూచకమైన అని ఒకే రూపంతో ఉండటంవల్ల ఈ అర్థభేదం వచ్చింది. నిర్దిష్టమైన వ్యాకరణ సూత్రాలమీద వాక్యనిర్మాణం ఆధారపడి ఉండటం వల్ల ఈ భిన్నార్థకతను ప్రెడిక్టు చెయ్యగలిగాం. కాని ఈ కింది వాక్యాన్ని పరిశీలించండి.

4. సీత అలంకరించుకొని మాయింటికి వచ్చింది.

ఇక్కడ సీత పాశ్చాత్య పద్ధతిలో అలంకరించుకొన్నదా? ప్రాంచ్య పద్ధతిలో అలంకరించుకొన్నదా? ఉత్తరాది పద్ధతిలో ముడివేసుకున్నదా? దక్షిణాది పద్ధతిలో పూలజడ వేసుకున్నదా? అనే విషయం వ్యాకరణం చెప్పలేదు. వీటిల్లో ఏ అర్థమైనా రైటు కావచ్చు. లేక ఇంకేదైనా కావచ్చు. సీత అనే అమ్మాయిని చూస్తే తప్ప ఏవిషయమూ చెప్పలేము. ఇది వ్యాకరణం చెయ్యలేని పని. అందువల్ల ఇక్కడ (సూత్రబద్ధమైన శ్లేష) లేదు. ఈపద్ధతిలో సంపత్కుమార ఉదాహరించిన "మధుర మధురమైన మామిడిపండ్లను" పరిశీలించాను. ఇవి సీసభాగమూ, ఆటవెలది భాగమూ అనేది మనం ప్రెడిక్టు చెయ్యొచ్చు. అంటే రెండిట్లో ఏదో ఒకటిగా మాత్రమే విభజించటానికి వీలున్నదని చెప్పవచ్చు. వచన పద్య పాద విభజనలో భిన్నత్వం అట్లాంటిది కాదు. దీనికి నిర్దిష్ట సూత్రాలు లేవు ఇంకా స్పష్టంగా చెప్పాలంటే "మధుర మధురమైన మామిడి పండ్లను" విభజించటానికున్న భిన్నపద్ధతులను మనం ముందుగా చెప్పవచ్చు. ఛందశ్శాస్త్రం అందుకు సాయపడుతుంది.

పాద విభాగం లేకుండా రాసిన వచన పద్యాన్ని ఒకరికి పాద విభజన చెయ్యమని ఇస్తే అతను ఏదో పద్ధతుల్లో చెయ్యటానికి వీలుందో ప్రెడిక్టు చెయ్యగలమా? అతను విభజన చేసిన తరువాత మళ్ళీ ఇట్లా ఎందుకు చేశావంటే కారణం చెప్పగలడా? అందుకే సంపత్కుమార అచ్చులో కాని రాతలో కాని పాద విభజనను సూచించాలంటాడు. అంటే అట్లా ప్రెడిక్టు చెయ్యటానికి వీలులేదని ఆయన అంగీకరించినట్టే. వచన పద్యాలకు కూడా అట్లా ప్రెడిక్టు చెయ్యటానికి వీలుంటదని, అయితే ఆ విభజించేవాడు ఈ ప్రెడిక్టు చేసేవాడూ భావగణాలను తెలుసుకొని ఉండాలని అంటే సంపత్కుమార వాదానికి బలం వచ్చేది. ఆ భావగణాలను గుర్తుపట్టటం ఎట్లా అనేది వేరే ప్రశ్న. సంపత్కుమార దాన్ని గురించి ఎట్లాగూ వేరే ఆలోచించాలి. నేనుద్దేశించిన దాన్ని సంపత్కుమార గ్రహించలేదు అందుకే "ఇక్కడ వేరు వేరుగా విభజించేందుకు గల అవకాశం ప్రధానంగాని రెండు విధాలుగానా? మూడు విధాలుగానా? అన్నది ప్రధానం కాదు–" అనిరాశారు. ఎన్ని విధాలుగా అన్నదికూడా ఇక్కడ ప్రధానమే. ప్రెడిక్టు చెయ్యటమంటే అదే. సూత్రబద్ధమైన శ్లేష ఉన్నప్పుడు ఎన్ని విధాలుగా విభజించటానికి వీలుందో ప్రెడిక్టు చెయ్యొచ్చు. మధుర మధురమైన మామిడి పండ్లను (జాతుల్ని) రెండు విధాలుగా మాత్రమే విభజించటానికి వీలుంది. వచన పద్యానికి సూత్రబద్ధత లేదుగనుక అట్లాంటిది సాధ్యం కాదు. ఒకవేళ ప్రెడిక్టు చేస్తే వ్యాకరణాంశాలను బట్టి చెయ్యవచ్చు అప్పుడది ఛందస్సుకు సంబంధించినది కాకుండా పోతుంది.

ఇక భావగణాల దగ్గరికొస్తే వాటిని వివరించానంటున్నారు సంపత్కుమార. ఆ వివరణ చాలదంటున్నాను. 'అనల తోరణం' అనే కూర్పులో ఇది భావగణం. ఇది భావాంశం అని చూపించిన మాట నిజమే ఎందువల్ల ఇది భావగణం, ఎందువల్ల ఇది భావాంశం అనే ప్రశ్నలు వారు వేసుకోలేదు. నేను వేసిన వాటికి సమాధానాలియ్యలేదు. "ఇక్కడ భావం పూర్తి అవుతున్నది. ఇక్కడ భావం స్ఫురిస్తున్నది" అనే వాటిని సంతృప్తికరమైన సమాధానాలుగా నేను గ్రహించలేను. ఇది ఇంతేనంటే నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఇక

వాదాలు అంతటితో ఆగిపోవటం తప్ప మార్గాంతరం లేదు. ఇంతకు పూర్వం లక్షణాలు చెప్పిన వాళ్లు ఇట్లాంటి ప్రశ్నలు వేసుకున్నారు. ఆ దృష్టితో లక్షణాలు చెప్పారు. వాటిని సమం అన్వయించుకొని చూడవచ్చు. అందువల్ల అవి శాస్త్రప్రతిపాదనలుగా నిలబడగలిగినవే - అవి సమగ్రమా? అసమగ్రమా? అనేది వేరే ప్రశ్న.

పద్యానికి పాదబద్ధత అనేది ప్రధానాంశం అని మేమిద్దరమూ అంగీకరిస్తున్నాం. ఆ పాదబద్ధత ఎట్లాంటిది అనే అంశంమీదనే భేదిస్తున్నాం. పాదవ్యవస్థను అర్థం చేసుకోటానికి అంతర్విభాగమూ బాహ్యపరిమితి అనే అంశాలను ప్రతిపాదించాను. నిజానికి మాటలు మాత్రమే నేను కొత్తగా ప్రతిపాదించింది. ఈ భావాలు పూర్వంనుంచీ ఉన్నవే. లేకపోతే ఒక పాదంలో అక్షరాల క్రమాన్ని గురించిగాని, గణ క్రమాన్ని గురించిగాని, ఫలాని అక్షరం ఫలానిచోట ఉండాలని గాని, ఫలానిది కాకూడదని గాని చెప్పటానికి కారణం కనిపించదు. పాద వ్యవస్థకు అడ్డువచ్చేది దండకం ఒకటుంది. ఒక్కో గణాన్ని పాదంగా పరిగణిస్తే పాద వ్యవస్థను దానికి కూడా అన్వయించవచ్చు. మాలికా వృత్తాలకు దండకానికి భేదం (తెలుగులో) ఒకటే కనిపిస్తున్నది. దండకానికి ప్రాసనియమం లేదు. ప్రాసనియమం లేని మాలికా వృత్తంగా దండకాన్ని పరిగణించవచ్చు. అంతర్విభాగ విషయంలో ఏకాక్షర వృత్తం లొంగదు. ఒక సెట్ తనలో తాను అంతర్భాగం కూడా అవుతుందన్న గణిత శాస్త్ర ప్రతిపాదనను దీనికన్వయించవచ్చు - గాని దానివల్ల సాధించగలిగిన ప్రయోజనం విషయంలో నాకు స్పష్టమైన అభిప్రాయం లేదు. అందువల్ల పై రెండు ఛందో భేదాలను అపవాదాలుగానూ, వాటి గురించి నేను చేసిన సూచనలు తాత్కాలికమైనవిగానూ గ్రహించాలి.

నేను ప్రతిపాదించిన బాహ్యపరిమితి విషయంలో సంపత్కుమారకు పేచీలేదు. అంతర్విభాగాల విషయంలోనే అభ్యంతరం చెబుతున్నారు. నిజానికి అభ్యంతరం చెప్పాల్సిన అవసరంలేదు. అంతర్వి

తెలుగు క్రియల్లో కొన్నింటికి భిన్న సందర్భాల్లో వచ్చే రూప భేదాలను బట్టి వర్ణ సంయోగాన్ని, బట్టి నిర్ణయించవలె. అట్లాంటివి పై సూత్రంలో చెప్పిన క్రియలు ఈ రూపభేదాన్ని, ఏర్పరిచే పరిసరాలు 'ముత్తు' అనే సంకేతంతో సూచింపబడ్డాయ్. ఈ 'ముత్తు' పేటికి సంకేతమో వ్యాకరణంలో ఇంకోచోట చెప్పబడుంది. ఈ 'ముత్తు' అనే సంకేతం లేకుండా చెప్పకూడదా అంటే తప్పకుండా చెప్పవచ్చు. అయినా వ్యాకర్త సంక్షిప్తతనే వరించి 'ముత్తు' అనే సంజ్ఞను వాడాడు. నిజానికి ఈ 'ముత్తు' పదంతో తెలుసుకోవాలంటే వేరే సూత్రాలు వెతుక్కోవాలి. ఆరకంగా చదవటంలో క్లిష్టత కూడా ఉంది. అయినా ఈ సంకేతాన్ని వాడటం వల్ల వ్యాకర్త సాధించేదేమిటంటే శాస్త్ర సంక్షిప్తత. అదే ఏకైక పద్ధతిలో చెప్పటం. భిన్న పరిసరాల్లో జరిగే మార్పుల్లో ఉన్న "ఏకత"ను ఈ సూత్రం ద్వారా వ్యక్తపరిచాడు. ఈ పరిసరాలన్నీ కలిపి కలిగించే మార్పు ఒకటే నన్న విషయం తెలియ పర్చటానికే ఈ సూత్రం ఇట్లా వ్రాయబడ్డది. 'ముత్తు' అవసరంలేదని ఎవరైనా వాదించవచ్చు. సాధారణీకరణ (జనరాలిటీ)ని సాధించ దల్చుకున్న వ్యాకర్తకిది అవసరమే.

ఈ దృష్టితోనే నేను గణాల అవసరాన్ని పరిశీలించాను. వృత్తాల లక్షణాల్ని గణాలతోనూ చెప్పవచ్చు. అక్షర క్రమంతోనూ చెప్పవచ్చు. గణాలతో చెప్పటంలో సంక్షిప్తత లేదా అంకెమాపులు దృష్టితో ఉందిగాని శాస్త్ర దృష్టితో లేదు అక్షర క్రమంలో చెప్పిన దాని కన్నా గణ క్రమంలో చెప్పటంవల్ల వృత్తాల్లో సాధించే 'జనరాలిటీ' లేదు. అంటే అక్కడి సంక్షిప్తత శాస్త్ర సంక్షిప్తతకాదు. అందువల్ల వృత్తాల అంతర్నిర్మాణాన్ని చెప్పటానికి గణాల అవసరం లేదంటే గణాల సాయంతో చెప్పలేమనికాదు. అట్లా చెప్పటంవల్ల సాధించేశాస్త్ర సంక్షిప్తత లేదని, కాని జాతుల విషయంలో అట్లాంటిది ఉంది. భిన్నాక్షరక్రమాలు ఒక అంతస్సూత్రం మీద ఆధారపడి ఉన్నా యన్న విషయాన్ని జాతుల్లో గణ సహాయంద్వారా చెప్పవచ్చు. అక్షరక్రమంలో చెప్తే ఈ అంతస్సూత్రాన్ని చెప్పలేం. అట్లాగే మాత్రాఛందస్సుల విషయం. అందుకే నా నవంబరు వ్యాసం

లో 'ప్రత్యేక పద్ధతి' అనిపించింది. బ్రౌన్ బొమ్మల సాయంతో వివరించాను.

జాతులుగా నిర్దేశించిన గణాలు సమమాత్రా గణాలు కావు. అంతే కాక ఆ గణాలు ప్రత్యేక అక్షర క్రమాన్ని నియమించవు. సమమాత్రా కాలు అయితే మాత్రా గణాలుగా చెప్పవచ్చు. ఒకే అక్షర క్రమాన్ని ఇస్తే గురులఘుక్రమ భేదంతోగాని విసర్గ గణాలుగాని చెప్పొచ్చు. జాతుల గణాల్లోని ఈ వ్యత్యాసాన్ని గురించి చెప్తూ సంపత్కుమార "ఆ గణాల పరిస్థితి అట్లా ఉన్నది" అని అన్నారు. పరిస్థితి అట్లా ఉన్నట్టు కాబట్టే ఆ గణాలు అక్కడ అవసరం పోయినవే "ఆలోచిస్తే లక్షణ కర్తలందరినీ సౌకర్యం కోసమే ఈ గణపద్ధతి అనిపిస్తుంది," అని రాసిన దానితో పూర్తిగా ఏకీభవించలేను. అయితే ఆ సౌకర్యం నేను పైన సూచించిన శాస్త్ర సంక్షిప్తతను సాధించేది కావాలి. శాస్త్ర సంక్షిప్తత అవసరమా కాదా అంటే అవసరమని నా అభిప్రాయం. నా అభిప్రాయంతో సంపత్కుమార ఒప్పుకోక పోవచ్చు. భారతీయ శాస్త్రకారులు సంక్షిప్తతను సాధించటానికి ప్రయత్నించారని తెలిసిన వాళ్ళంటారు. ఆధునిక భాషా శాస్త్రంలో ఇది అతిముఖ్యమైన లక్షణం. ఒక భాషకు సాధ్యమైన భిన్న వ్యాకరణాలలో ఉత్తమమైనది ఎంచుకోవటానికి ఉపయోగించే లక్షణం ఇది (చూ. రామారావు 1971)

మాత్రా పద్యాలకు మాత్రా గణాల్లో కాకుండా వేరే పద్ధతిలో లక్షణం చెప్పవచ్చు గాని శాస్త్ర సంక్షిప్తతను సాధిస్తూ లయను సూచిస్తూ చెప్పాలంటే మాత్రా గణాల సాయంతో చెప్పాలి. పాదాల్లో మాత్రల కలయికను గురించి చెప్పకుండా, పాదంలో మాత్రా సంఖ్యను మాత్రమే చెప్తే పాదాల అంతర్నిర్మాణాన్ని గురించి చెప్పనట్లే. ఇక పాదం అంతర్నిర్మాణాన్ని లయ ననుసరించి చెప్పాలంటే మాత్రా గణాల పద్ధతిలోనే చెప్పాలని నా వాదం. అట్లా చెప్పకపోతే లయ ననుసరించి చెప్పినట్లు కాదు. అంటే ఆ పద్యానికి లయ నిర్దేశం చెయ్యలేదన్నమాట. లయ నిర్దేశం చెయ్యకపోతే భిన్న లయలు వాడుకోటానికి వీలుంది. మాత్రా గణాల్లో చెపితే మాత్రం లయ

సాధ్యమౌతుందా? అంటే మాత్రా గణాల్ని భాషలో ఉనికి ప్రవృత్తి ననుసరించి వాడితే లయ సాధ్యమవుతుంది. ఈ ఉనికి ప్రవృత్తిని బట్టి సిద్ధాంత విరామం మీద, పదంలో గురు లఘు ప్రయుక్తం మీద ఆధారపడి ఉంటుంది. ఈ ఉనికి ప్రవృత్తి ననుసరించే అనుప్రాస విలాసాల గణాల భేదం వస్తుంది. లయ స్వరగణాల పద సిద్ధాంత విరామాలూ, ఉనికి ప్రవృత్తి చాలా ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తాయని ఈ నాటి వ్యాసంలో సూచించాను.

ఇంతకీ ఆశించిన గతి, మాత్రా ఛందస్సుల్లో గాని అంతర్నిర్మాణం గణాల్లో చెప్పాలా అక్కర్లేదా అనేది నా వాదానికి ప్రధానం కాదు. అట్లా చెప్పటంలో ఉన్న సౌలభ్యాన్ని స్థాపన చెయ్యం చాను. కొందరు పరిశోధకులు గణ సిద్ధాంతాన్ని నిరసిస్తూ ఇంకో సిద్ధాంతాన్ని సూచించవచ్చు. కాని అంతర్నిర్మాణం లేకుండా పద్యం ఉండదు. ఫలాని అక్షరాలు ఫలాని క్రమంలో ఉంటాయని గాని, ఫలాని అక్షరాలు గురువులో లఘువులో ఉండాలని గాని, ఉండకూడదని గాని చెప్పటం వాదంలో అంతర్నిర్మాణాన్ని గురించి చెప్పటమే అవుతుంది. ఈ విషయాన్ని నాగరాజుగారు (చూ. అనుబంధం) గుర్తించారు.

ఇక భావగణాల విషయం. భావగణ విభజనలో వ్యాకరణాంశాల పాత్రను సంపత్కుమార పూర్తిగా నిరాకరించలేదని గుర్తించాను. ఆ పాత్ర ఎంతవరకు అన్న దాంట్లోనే మా ఇద్దరికీ అభిప్రాయ భేదం. వ్యాకరణ సంబంధాలకి, భావాంశాలకి ఏకైక సంబంధం ఉందని నా వాదం. సంబంధాన్ని పూర్తిగా నిరాకరిస్తే అర్థ బోధలో వ్యాకరణాంశాలకు పాత్ర లేదనాల్సి వస్తుంది. అందువల్ల సంపత్కుమార మధ్యే మార్గాన్ని ఎన్నుకొని కొంతవరకు మాత్రం ఉంటుందంటున్నారు. కాదు పూర్తిగా ఉంటుందని నా వాదం. దీనికి ఉపపత్తిగా వారు భావగణాలంటున్న వాటిని నేను వ్యాకరణ గణాలుగా నిరూపించాను. సంపత్కుమార తన వాదాన్ని నిలబెట్టుకోవాలంటే వ్యాకరణ సంబంధాలు పద విభజనకు ఎక్కడ లేవో నిరూపించాలి. కనీసం ఆ 'కొంతవరకు' అనేది ఎంతవరకో స్పష్టంగా చెప్పాలి. ఇది సాధ్యమనుకోను. భావగణాలని వారనుకొంటున్న వాటికి వ్యాకర

దానికి ఎంత విడదీయరాని సంబంధం ఉంది. అయితే భావసూత్రి ప్రధానం గాని శబ్దకళా సంబంధాలు ప్రధానం కాదంటాం కదా త్మకమైన ఈ సందర్భంలో అర్థాలు కావు ప్రధానం. తీసుకు చూస్తే అర్థాలంకారాలు, శబ్దాలంకారాలు అని ఎందుకు ఉంటున్నాయి? అని అడుగుతున్నారు అనుకోకండి, అనుకోవడం అని నా భావం. ఒక అలంకారాన్ని ఒక కవి సంస్కృత శ్లోకంలో వాడినా, తెలుగు పద్యంలో వాడినా, గద్యంలో వాడినా, పెద్ద పద్యంలో వాడినా, చిన్న పద్యంలో వాడినా, పెద్ద వాక్యంలో వాడినా, సంయుక్త వాక్యంలో వాడినా, ఒక వాక్యంలో వాడినా, భిన్న వాక్యాలలో వాడినా ఒక అలంకారం అదే అలంకారం అవుతుంది. అలంకారాల్లో ఏ మార్పు లేదు. శబ్దరూప ప్రాధాన్యం లేదు. వాక్య వ్యవస్థను బట్టి అలంకారం మారదు. కాని వీరి భావగణాలు అట్లా మారి కుండా ఉంటాయా? మారకుండా ఉండని పద్ధతిలో భావగణాల్ని నిర్ణయించారా? ఎంతకీ భావసూత్రిని బట్టి, భావాన్ని బట్టి గాని అంతకన్నా స్పష్టమైన నిర్వచనం ఇవ్వటం లేదు. ఇప్పటి వ్యాసంలో నైనా ఈ వాక్యాలు చూడండి. "భావగణం ఏక పదంగా ఉంటుందా? బహుపదంగా ఉంటుందా? అన్నప్పుడు అక్కడ ఉపయుక్తమైన పదాల స్థితి అంటే ఏకపదం భావాంశ స్ఫోరకమైతే ఏకపదమే భావగణం. బహు పదాల సమష్టి భావాంశ స్ఫోరకమైతే ఆ సమష్టే భావగణం భావాన్ని స్ఫురింపజేసే పదాల స్థితి అంటే ఇది." దీన్నిబట్టి భావగణం ఏమిటో నాకర్థం కావటం లేదు. ఈ వాక్యాలనుంచి భావగణ స్వరూపాన్ని గ్రహించలేని నా అశక్తతని పునస్సూత్రిగా ఒప్పుకుంటు న్నాను. అంతకన్నా స్పష్టంగా భావగణ స్వరూపాన్ని వివరించటం కుదరటంలో చేసినట్టు లేదు.

పద్యఛందానికి అంతర్నిర్మాణ బాహ్య పరిమితులుంటాయనీ, వచన పద్యానికి అంతర్నిర్మాణం లేదనీ, బాహ్య పరిమితి అక్కర్లేదనీ, భావగణాల స్వరూపం ఏమిటో స్పష్టంగా తెలియనందున, భావగణాలు వచన పద్యాన్ని నిర్ణయించలేవనీ, భావగణ విభజన ఏ పద్ధతిలో జరిగినా వచన పద్యాన్ని వచనం నుంచి భావగణాలు వేరుచెయ్య

లేవనీ అందువల్ల వచన పద్యం పద్యం కాదనీ ఇంకోసారి నిరూపించాను. అచ్చులో లైన్లు కూర్చే పద్ధతిమీద ఆధారపడకుండా వచన పద్యాన్ని గద్యం నుంచి వేరుచేసే కొత్త లక్షణాల్ని సంపత్కుమార గాని, ఇంకొకరుగాని ప్రతిపాదించేవరకు ఈ విషయాన్ని గురించి చర్చించవలసిన అంశాలు కూడా లేవు.

(భారతి జూలై 1976 పే. 28–35)

# వచన పద్యం: వాద సమాపనం

— సంపత్కుమార

వచన పద్యం 'పద్యం' కాదని 'ఇంకోసారి' నిరూపించటంలో రామారావుగారు మరోసారి చెబుతున్న అంశాలివి :—

(i) పద్యపాదానికి అంతర్నిర్మాణ బాహ్య పరిమితు లుంటాయి.

(ii) వచనపద్యానికి (—పద్యపాదానికి) అంతర్నిర్మాణం లేదు. బాహ్య పరిమితి ఆర్బిట్రరీ.

(iii) భావగణాల స్వరూపమేమిటో స్పష్టంగా తెలియనందున భావగణాలు వచన పద్యాన్ని నిర్వచించలేవు.

(iv) భావగణ విభజన ఏ పద్ధతిలో జరిగినా, వచన పద్యాన్ని వచనం నుంచి భావగణాలు వేరు చెయ్యలేవు.

— అందువల్ల వచనపద్యం 'పద్యం' కాదు.

చర్చను పెంచటం కాదు గాని ఈ చర్చితాంశాల గూర్చి నా తాత్పర్యం సుస్పష్టపరుస్తూ, వచన పద్యం 'పద్యమే' అన్న నా వాదాన్ని ఉపసంహారీకరిస్తాను.

ముందుకు సాగేముందు వచనపద్య పద్యత్వాన్ని గూర్చి ఆలోచించే ఎవరయినా లక్షించవలసిన ఒకటి రెండు అంశాలు—

నా చెప్పిన వచనపద్య లక్షణ సామాన్యాలే ముఖ్యం, వచన పద్యం 'పద్యం' కావటం అనివార్యం. 'పద్య' మాత్ర లక్షణసహితమైన పాద బద్ధత దానికి శక్తి కలిగించింది (ఇంకా సరళం కావాలి ఆ తరువాత). వ్యుత్పత్తి, ఇతిహాసాలు, సంప్రదాయాలు కొన్ని అధిగమించి వస్తూ, ప్రాచీనుల 'వచనా'లనూ ఆధునికోపజ్ఞ సంవాదాల ప్రాంతీయ 'లనూ పరిశీలించి సమన్వయించుకుంటూ; కొందరు తమ కవులు వచనంగా మార్చిన 'పద్యా'లను గమనిస్తూ సమన్వయాన్ని నిష్పత్తి చేసింది 'పద్యరచయిత'లో తప్ప 'వచన కవితలు' కావు. అది నిష్పన్నమయింది 'వచన పద్యం'. ఆధునికంగా పుట్టుకతోనే మాత్రమే కలిసివచ్చి విస్తరించిన అస్తి 'వచన పద్యం'.

సాంప్రదాయికంగా ప్రసిద్ధమయిన 'పద్యా'ల గురించిన లక్షణాలు ఏనాడో నిర్దిష్టమయి, సిద్ధమయ్యి ఉన్నాయి. వాటి ఆధారంగానే ఈనాటి మన ఆలోచనలూ, సిద్ధాంతాలున్నూ. వచన పద్యాలు ఆధునికంగా విస్తృతమయిన ఛందోరూపం. అవి రూపాలుగా ఇంతవరకూ, రామారావుగారన్నట్టు-దీనికి నిర్దిష్ట సూత్రాలు లేవు'. అవి రూపొందవలసే ఉంది. రకరకాలుగా, స్వతంత్రంగా, యథేచ్ఛగా, యాదృచ్ఛికంగానూ 'లక్ష్యాలు' వెలువడి కొండా, వాటిని గూర్చి ఆలోచనలూ-చర్చలూ సాగి, పరీక్షణాదులు జరిగి, నిర్దిష్టంగా లక్షణాలు ఇంకా రూపొందకుండా ఉండి ఉండినాయి, ఆ 'పద్యా'ల స్థితి ఎట్లాంటిదో, ఈనాటి వచనపద్యాల స్థితి అట్లాంటిది. అందువల్ల ఈ స్థితిలో ఉన్న వచనపద్యాల గూర్చి ఆలోచించేటప్పుడు, ఆర్షికోక్తరీగా రూపొందిన లక్ష్యాల్ని పరిశీలించి, పరీక్షణాలుచేసి, సామాన్య లక్షణాలను గమనించి, వీలయినంత అనువుగా పొసగే ఛందస్సు వస్తాదు అను నిరూపించే లక్షణాలను-సూత్రాలను నిష్పన్నం చేయవలసి ఉంటుంది. అట్లా నిష్పన్న లక్షణాలననుసరించి లక్ష్యాలు మళ్ళీ విరివిగా వచ్చిన తరువాత ఈ లక్షణాలకూ - లక్ష్యాలకూ అవినాభావ సంబంధం సుప్రతిష్ఠితమవుతుంది. అప్పుడు, సాంప్రదాయికంగా అనువర్తిస్తున్న పద్యాల గూర్చి మనకీనాడు కలుగుతున్న ప్రామాణ్యమూ, సులువూ వచనపద్యాల విషయంలోనూ కలుగుతుంది. వచనపద్య ప్రయోక్తకూ

-పరిశీలకునికి మాత్రమే ప్రమాణం ఉండటంవల్ల కలిసిపోయిన ఛందోపద్ధతులను ప్రత్యేకించి చేయగల్గటం, "ఛందస్సును పరిశీలించటం వంటివి అప్పుడు సాధ్యమవుతాయి.

ఇక ముందుకు సాగితే—

వృత్తాల నుంచి జాతుల వరకొచ్చేటప్పటికి అక్షర సంఖ్యా నియమం పోయింది. జాతుల్నుంచి తెలుగులో ఉపజాతులవరకొచ్చేప్పటికి ప్రాస నియమం పోయింది. పాదాంత విశ్రాంతి తెలుగులో ఒక నియమం కాలేదు. ఉపజాతుల్నుంచి మాత్రా ఛందస్సుల కొచ్చేటప్పటప్పటికి పూర్తిగా మాత్రాగణ నియమమూ పోయింది. ఆధునికంగా యతి-ప్రాస నియమాలు పూర్తిగా విచ్ఛిన్నాలయిపోయినయి. (రామారావుగారి 'వృత్త నిర్మాణ యంత్రం' దానికి సంబంధించిన అంశాల గురించి ప్రస్తుతం చర్చించబోవటం లేదు.) అయితే, వృత్తాదులయిన ఈ 'పద్యాల'న్నీ, 'పద్యం' కావటానికి మౌలిక లక్షణమయిన 'పాదబద్ధత' మాత్రం నిలుపుకున్నాయి. అది లేక ఎన్ని ఉన్నా పద్యం కాదు. అది ఉండి ఏవి లేకున్నా పద్యం అవుతుంది. కాగా పాదబద్ధతేతర నియమాలన్నీ అనియతాలు. ఈ నియత, మౌలిక, 'పాదబద్ధతా' లక్షణాన్ని మాత్రం నిలుపుకొని, మాత్రాసంఖ్యాగణ నియమాన్ని కూడా వదిలేసింది వచనపద్యం. ఇది 'పద్య' స్వరూపంలో వచ్చిన క్రమ పరిణామం. కాగా, వచనపద్య విషయంలో అక్షరాదుల లెక్కలు పాద స్వరూప నిర్ణయానికి ఉపయోగపడవు. ఉపయోగపడేది కేవలం 'భావం' మాత్రమే. అందుకనే, వచనపద్య పాద స్వరూప నిరూపణకు మౌలికాధారంగా తీసుకున్నాను. ఇట్లా తీసుకోవటానికి ప్రమాణమై, దారి చూపింది ఋగ్వేదంలోని కొన్ని ఋక్కుల పాదవ్యవస్థ నిరూపించే — 'తేషాంఋక్, యత్రార్థ వశేన పాదవ్యవస్థా' (2-1-35) అనే జైమినీయ న్యాయ సూత్రం

అయితే, ఈ వైదిక ఛ్ఛంద స్సంబంధి సూత్రం —బండి నాగరాజుగారు అనుకొన్నట్టు (చూ. అనుబంధం) మారుమూలదేమీ కాదు,— లౌకిక ఛ్ఛందస్సు కనువర్తించదనుకో నక్కరలేదు. 'వేద' రచన ఆగినప్పటినుంచి సాగిందాన్ని 'లౌకిక' మంటున్నాం. అంటే, లౌకిక ఛ్ఛందస్సు అనబడేది వైదిక ఛ్ఛందస్సు నుంచే నిష్పన్న మయిందని పింగళ ఛ్ఛంద శ్శాస్త్రాన్ని సరిగా పరిశీలిస్తే స్పష్ట మయ్యే విషయమే. కాగా, పయి సూత్రాన్ని వచన పద్యాల విషయంలో ప్రమాణీకరించటానికి సందేహపడ నక్కరలేదు. రామా రావుగారు అనుకొన్నట్టు ఋక్కులన్నీ అక్షరఛ్ఛందస్సులు — అక్షర సంఖ్యా నియమిత పాదవ్యవస్థ గలవి—కావు. 'గాయత్రి' లోనే చాలా భేదాలున్నాయి. పింగళఛ్ఛందం పరిశీలించవచ్చు. సరి, ఈ విధమయిన పాదవ్యవస్థ ఋక్కుల 'పఠనంలోనా? లేఖనంలోనా?' అని నాగరాజుగారూ, రామారావుగారూ పడ్డ సందేహం ప్రస్తుతానికి అభ్యంతరం కలిగించేదేమీ కాదు. (ఊరికే, వ్యాసం పెరుగుతుందని దాన్ని వివరించబోవటం లేదు). ఎందులో అయినా, నా ప్రతిపాదనల్లో మార్పేమీ రాదు. పాదానికి అక్షరాదుల సంఖ్యా నియమం ప్రవ ర్తించని చోట పాద వ్యవస్థ కవలంబించిన పద్ధతి, అట్లాంటి చోటే అయిన వచన పద్య పాద వ్యవస్థకు ప్రమాణం కావటం హేతుబద్ధమే. రామారావుగారన్నట్టు 'హేతుబద్ధతే ప్రమాణంకన్నా విలువయినది' నిజమే. అయితే, ఆ ప్రమాణం హేతుబద్ధం కానప్పుడే ఇట్లా అనటం సమంజసం. ఆ సూత్రం ప్రవర్తించే విషయం ఉన్నదంటే, అది హేతు బద్ధ మన్నమాటే. ఇక, రామారావుగారు గ్రహించినట్టే—'అక్షరసంఖ్యా నిబద్ధమయిన పద్య పాదాల్లో పాద విభజన అర్థభంగం కలిగించని విధంగా ఉండాలని పై సూత్రానికి తాత్పర్యం.' అయితే, దీన్నిబట్టి వ్యక్తమయ్యేదేమిటి? అర్థభంగం కలిగించని' విధమే అక్కడ పాద విభజనకు సూత్రం తప్ప, అక్షరాదుల సంఖ్య కాదని. సూత్రంలోని

'అర్థసరేస' అన్నది ఋక్కుల పాద వ్యవస్థలో అక్షర నియమ వ్యావర్తకం కాదు, ఆ నియమం లేని ఋక్కుల విషయంలో ప్రవర్తకం మాత్రమే. ఇక, పద్యం మొత్తంగా అక్షర సంఖ్య నియమితం కావటానికక్కరం — ఈ సూత్ర ప్రవృత్తి ఉన్నచోట — ప్రాధాన్యం లేదు. ఆ మొత్తమయిన అక్షర సంఖ్యకు పాద విభజనలో ప్రసక్తి లేదు కాబట్టి, దీన్నది ప్రభావితం చేయటం లేదు కాబట్టి, పద్యం మొత్తానికి అక్షర సంఖ్య లేకపోవట మనేది, ఉన్నదాని కంటె పూర్వస్థితి.

కాగా, పాద వ్యవస్థా నిరూపణంలో రెండు పద్ధతు లున్నాయని స్పష్టపడుతున్నది. ఒకటి: అర్థవశంగా పాద నిరూపణం జరిగేది. రెండు: అక్షరసంఖ్యా వశంగా పాద నిరూపణం జరిగేది. మొదటి దానిలో అర్థానికి, రెండోదానిలో అక్షర సంఖ్యకూ ప్రాధాన్యం. వచన పద్యం మొదటి తరహాకు చెందింది. అందువల్ల, తద్ వ్యవస్థా నిర్ణాయక సూత్రం వచన పద్య పాద వ్యవస్థా నిరూపణకు ప్రామాణికంగా దారిని సుగమం చేసింది. ఆ దారిలోనే, వచన పద్య పాద వ్యవస్థ 'భావ' వశంగా ఉంటుందని చెప్పటం ప్రామాణికమూ, హేతుబద్ధమూ అవుతున్నది. ఛందో మార్గంలో పాద వ్యవస్థా సంబంధి పద్ధతులు రెండున్నాయని గుర్తించటం ఇక్కడ అవసరమే కాక, తప్పనిసరికూడా. 'ఋక్కులు వచన పద్యాలు కా' వనే ఊహాతో వాటిని 'వచన పద్యాలుగా ఎందుకు భావించకూడదు?' అంటే, భావించవచ్చు నని సమాధానం. పాద వ్యవస్థలోని రెండు పద్ధతులను గుర్తించినా నిజానికి ప్రశ్న పుట్టదు. 'పద్యం' అన్న పేరు నిశ్చితమయినాక [illegible] 'పద్యా' లయినప్పటికీనే, ఆ పద్ధతి పన్ని ఉంటే ఆ పద్ధతికి పరిమితమైనాన్నే, — 'వచన పద్యం' అన్నది నిశ్చిత మయింది కాబట్టి — దీని పరిధిలోకి వచ్చే వాటిని — అవి ఎక్కడున్నా — వచన పద్యాలుగా అనటానికి వెనుకాడ నక్కరలేదు.

ఇక, అంత్యప్రాస, శబ్ద పరిమితుల విషయానికి వస్తే—

పద్య పాదానికి అంతర్నిర్మాణమూ, బాహ్య పరిమితీ ఉంటూ యని మొదటినుంచీ రామారావుగారి వాదం. పీటిలో అంతర్నిర్మాణమనేది పాదానికుండే అక్షర, మాత్రాగణక్రమం. సంఖ్యల నాధారంచేసుకున్నది. అక్షరాదిక సంఖ్యా నియమం పట్టించుకొనని వచన పద్యం విషయంలో ఈ వాదానికి ప్రసక్తి లేదు. అయినా, వచన పద్యానికి కూడా అంతర్నిర్మాణమంటూ లాక్షణికంగా ఏదీ ఉండదని నా వాదన.

రామారావుగారి వాదా న్ననుసరించి, అంతర్నిర్మాణమంటే— ఒక పాదానికి ఫలానా అక్షరక్రమం, లేదా గణక్రమం, కాదా ఫలానా పద్ధతిలో ఫలానా మాత్రలుండటం — కనీసం పాదానికి మొత్తంగా 'ఇన్ని మాత్రలుండటం ఎట్లా ఉన్నా, ఉన్నట్లు చెప్పినా సరే, పాదానికి అంతర్నిర్మాణం ఉన్నట్టు. 'పాదాల్లో' మాత్రల కలయికల్ని చెప్పకుండా పాదాల్లో మాత్రా సంఖ్యను మాత్రమే చెప్తే, ఎందాల అంతర్నిర్మాణాన్ని గూర్చి చెప్పినట్లే. ఇక వాటి అంతర్నిర్మాణాన్ని లయ ననుసరించి చెప్పాలంటే, మాత్రాగణాల పద్ధతిలోనే చెప్పాలని' ఆయన వాదం. ఈ వాదం నుంచి ఒక అంశం నిష్పన్నమవుతున్నది. అంతర్నిర్మాణాన్ని లయ ననుసరించీ, అనుసరించకుండా కూడా చెప్ప వచ్చు— ఉంటుంది. అనుసరిస్తే గణపద్ధతి. లేకుంటే ఆ పాదానికి 'అన్ని' మాత్ర లుండటం. అంటే, పాదానికి త్రిమాత్రాగణాలు నాల్గున్నా, పన్నెండు మాత్రలున్నా అంతర్నిర్మాణం ఉన్నట్లే. మరి, పాదానికి బాహ్యపరిమితి ఏమిటి? పాదానికి నాలుగ్గణాలు, లేదా పన్నెండు మాత్రలు. మరి, అంతర్నిర్మాణ, బాహ్య పరిమితులకు తేడా ఏమిటి?

పాదానికి నాలుగు త్రిమాత్రాగణా లుండటం, లేదా పన్నెండు మాత్రలుండటం నిజానికి 'పాద పరిమితి' అంటే పాదం యొక్క బాహ్య నిర్మాణ స్వరూపం. 'బాహ్య పరిమితి' ఉందంటే, 'అంతః పరిమితి' కూడా ఉండవలసి రావటం సహజం. అది ఉండదు, ఇది ఉండదు. కాగా, ఇది పాద పరిమితి. ఇది పద్య పద్యానికి భేదిస్తుంది. ఇక, పాదానికి ఫలానా అక్షరాల, గణాల క్రమం ఉండడం

i. మందార, మకరంద, మాధుర్య, మున దేలు
మధుపంబు, వోవునే - మదనములకు..

ii. ఒరి-దు, రాత్రి-నీ, వార-ము, స్థిరుసు

భాస-యో, జనగంధి-సఫను స్మృతి ...

అంతర్నిర్మాణం రెండు పాదాల్లో భేదించింది. రెండూ బాహ్యంగా విక్రీడితా పాదాలే అయినా--

1. రారా సాదర కేదువాపలిత భూరాసాగ కైశేరి యుకి
క్షీరాసార మురావలీ కలితవారీ!
ii. లోలత్వంబున వు త్తకాశిసుల కల్పుంబోల్లుసుం బెల్ల గా ..

భిన్నస్వరూపం గల గురులఘు అక్షరాల ఎన్నిక ద్వారా సాధించబడిన అంతర్నిర్మాణ వైవిధ్యమిది. ఇది కవి సాధించింది. '10 మాత్రల అంతరాల విభజన గల పద్యా (—పాదా) ల్లో కొన్ని చోట్ల ఖండగతిని, కొన్ని చోట్ల మిశ్రగతిని పాటించారు' కవులు అని రామారావుగారన్నారు. ఈ పాటింపు నిజానికి అంతర్నిర్మాణానికి సంబంధించింది. కొందరు కేవలం బాహ్య నిర్మాణాన్ని మాత్రమే అనుసరిస్తూ వ్రాస్తారు. కొందరికి అంతర్నిర్మాణ వైవిధ్యాన్ని — బాహ్య నిర్మాణాన్ని మన్నిస్తూనే సాధించవచ్చు. ఒకే కవితో రెండు రకాల రీతులూ ఉండవచ్చు. ఏదైనా ఆయా కవులకు సంబంధించిన విషయం. పద్య నిర్మాణ శిల్పానికి సంబంధించిన విషయం.

కాగా, వృత్తాదులయిన అన్ని రకాల పద్యాల్లోనూ అంతర్నిర్మాణం కవికీ, బాహ్య నిర్మాణం లక్షణానికీ సంబంధించింది. బాహ్య నిర్మాణాన్ని లక్షణం సాధిస్తుంది. దాన్ని మన్నిస్తూ కవి అంతర్నిర్మాణం - అందులో వైవిధ్యం సాధిస్తాడు. కాగా, వచన పద్యానికూడా లక్షణ పరంగా బాహ్య నిర్మాణమూ, కవి పరంగా అంతర్నిర్మాణమూ - రెండూ ఉంటాయి.

పాటు, భాష గణాలు స్వరూపం___

'భావగణం'లో 'గణ' అనేది ఔపచారికంగా ప్రయుక్తమనీ, భావగణాలు భావాంశాలనీ మొదటి నుంచీ స్పష్టమే. ఈ రెండూ పర్యాయ పదాలుగా ఇక ముందు కూడా ప్రయుక్తమౌతాయి.

భావాన్ని సమగ్రపరిచేదీ, పరిష్కృతం చేసేదీ భావాంశం. మనో విశ్లేషణే భావం. అది మనస్సులో కలుగుతున్నది. అది అభివ్యక్తం కావటానికి సాధనం భాష. మనస్సులో కలిగిన భావం వివిధ పదాలను అనుసృతంగా సంపాదించుకుంటూ, వాటి వెనకగే ఒక క్రమీకృతి ద్వారా తన పరిపుష్టత్వం చేసుకొంటుంది. అది వ్యక్తమయినాక సాధనమయిన భాష తన పాత్ర విరమిస్తుంది. మిగిలేది మళ్లీ భావమే. అది దాని స్వరూప స్వభావాలను బట్టి కొన్ని అంశాలుగా విభక్తం కావచ్చు, కాకపోవచ్చు. విభక్తమయితే, అవి భావాంశాలు - భావ గణాలు - అవి భావాంశాలతోడి భావం. విభక్తం కాకుంటే, ఏకాండ భావం. ఈ భావాంశాల విభజన సువ్యక్తం కావటానికి మళ్లీ భాషే సాధనం. సువ్యక్తమయినాక మళ్లీ ఆ భాష తన పాత్రను విరమించుకొంటుంది. భావాభివ్యక్తికి లేక భావ బోధ జరిగిన తరువాత బోధపడిన భావాన్ననుసరించి సాధనమయిన భాష - వాక్యంలోని వివిధ పదాలను విభజించి వాటి సంబంధాలను గుర్తించి, తదనుక్రమాన్ని స్వరూపాన్ని నిరూపించుకోవటం జరుగుతుంది. దీన్నే తిరుగేసి చెప్పితే, వాక్యంలోని పరస్పర సంబంధాలూ, పదాలూ, తదనుక్రమం ద్వారా భావబోధ జరుగుతుంటుంది. ఇట్లా చెప్పటం వ్యాకరణం. కాగా, సాధనమయిన భాష యొక్క అంశాలను విభజించి, వాటి సంబంధాలను భావబోధననుసరించి నిర్వచించే వ్యాకరణానికి-భావబోధకూ, అంటే భావస్ఫూర్తికీ [illegible] సంబంధమని [illegible] ఇందుకే. అందుకభ్యంతరం ఎవరికీ ఉండనక్కరలేదు. అయితే, నేను భావంవైపు నుంచయితే, ఆయన వ్యాకరణం వైపునుంచి సాగుతున్నారు. నేను 'భావగణా' లంటే, ఆయన 'వ్యాకరణగణా'లంటున్నారు. మరి, ఈ భావబోధ జరిగినంత, వ్యాకరణ స్థితి ఏమిటి? సాధ్య

విషయాన్ని సాధించటంలో, ఉపయోగపడే సాధనానికి ఉన్న ప్రాధాన్యం, ఆ విషయం సాధింపబడిన తరువాత ఉండదు. దాని ఉనికి కనిపిస్తున్నా, అది గౌణమే అవుతుంది. అప్పుడు సాధింప బడ్డ విషయానికే ప్రాధాన్యం. అంటే, సాధ్యమయిన భావం సాధింప బడినాక సాధనమయిన భాషకు ప్రాధాన్యం ఉండదు. సాధింపబడ్డ భావానికే ప్రాధాన్యముంటుంది. ఇక, ఈ సాధింపబడిన భావంద్వారా సాధింపబడే మరొక దానికి ఆ భావమే సాధనమవుతుంది గాని, తద్భావసాధనలో సాధనమయిన భాషగానీ, తద్విషయిక వ్యాకరణం గానీ కాదు. ఈ అంశాన్ని సూచించేందుకే గతంలో నేను 'అర్థాలం కారాల' ప్రసక్తి తెచ్చింది. అంతేకాని, వాటికి ప్రాధాన్యత ఉంటుం దని కాదు. రామారావుగారు విస్తరించినట్టు, అది ఏ ధ్వనియైనా. ఏ ప్రక్రియయినా, ఎట్లాంటి వాక్యమయినా కావచ్చు, అర్థబోధ కలిగి నాక, ఆ భాషా, ప్రక్రియా, వాక్యాల ప్రాధాన్యం పోతుంది. మిగిలిన, బోధపడిన అర్థమే ప్రధానం. దానిద్వారా సాధ్యమయ్యే అలం కారానికి ఆ అర్థమే సాధనంగాని, తదర్థబోధ సాధనమయిన వ్యాకరణ సంబంధాలు కాదు. కాబట్టే, అవి అర్థాలంకారాలు. ఆ ప్రసక్తి అంత వరకే తాత్పర్యం. 'శబ్దరూప ప్రాధాన్యం లేదన్న వాక్యవ్యవస్థను బట్టి (అర్థ) అలంకారం మారక' (1975) పోవటానికి కారణం, ఆ అలం కారం అర్థాన్నాశ్రయించిందే తప్ప, శబ్దరూపాల వాక్యవ్యవస్థ నాశ్ర యించక పోవటమే. కాగా, బోధపడిన భావం అంశాలుగా విభక్త మయితే, అవి భావాంశాలు—భావగణాలు అయితయేగాని, ఆ భావ బోధ సాధనమయిన వ్యాకరణ సంబంధాలూ, అంశాలూ, లేదా 'వ్యాకరణ గణాలు' కావు. అయితే, భావ–భావాంశాలు వ్యక్త స్థితి లోనే ఉండాలి కాబట్టి, వాటి కాధారంగా ఎప్పుడూ భాషా—పదాలూ తత్సంబంధి వ్యాకరణ సంబంధాలూ ఉంటూనే ఉంటయి. అందువల్లే భావ-భావాంశాలను వ్యక్తస్థితిలో గుర్తుపట్టటానికి, నిరూపించ కోవటానికి మళ్లీ భాష-పదాలూ-తత్సంబంధి వ్యాకరణ సంబంధాలూ సాధనమయి తున్నాయి. పదాల-వాక్యోప వాక్యాదుల ఉనికి అవసర మయితున్నది. భావ-భావాంశాల వ్యక్తి, గుర్తింపు తరువాత అవి ప్రధానమయి, అవి గౌణమయి పోతున్నయి. కాగా, భాషా-

న్నాయి. ఈ నిర్వచించే, సమగ్రపరిచే లక్షణంగల మొదటి నాల్గు పాదాల్లో వ్యక్తమయినవి భావాంశాలు — భావగణాలయి ఉన్నాయి. కాగా, ఒక భావాన్ని సమగ్రపరచటం, పరిపుష్టి కలిగించటం అనే లక్షణం ద్వారా భావగణాలను గుర్తుపట్టవలసి ఉంటుంది. అంటే, భావ గణాలు భావ పరిణామాన్ని విస్తరింపచేస్తూ దాని ప్రభావక శక్తిని పెంచుతాయి. ఇక్కడ పాద విభజనను 'గైడ్' చేస్తున్నది భావ— భావాంశాలేగాని, వాక్యభాగాలు కావు. అసలే అయితే నాల్గో పాదం '—తొడుక్కొని'తో పూర్తి కాదు. కాని, అయింది — అది సమగ్రపరిచే భావాంశాన్ని వ్యక్తం చేస్తున్నది కాబట్టి. అయితే, ఇది అక్షరాదుల లెక్కల ద్వారా పాదం గుర్తించినంత తేలిక కాకపోవచ్చు. కాని, ఈ పద్ధతి కలవాటుపడితే ఇది సుగమం కాకపోదు. వచన పద్య నిర్మాత ఈ పద్ధతి కలవాటుపడి వచన పద్యం రచిస్తే, పరిశీలకుడూ అదే పద్ధతి కలవాటుపడి వచన పద్యాన్ని పరిశీలిస్తే, ఉభయుల్లా పద్ధతిలోని ఐక్యంవల్ల వచన పద్య స్వరూప విచారణ నిష్కృష్టమయి తుంది. ఇట్లా కాక, ఉభయులూ ఎవరికివారేగా ఒక పద్ధతి ననుసరించక పోయినప్పుడే 'కన్‌ఫ్యూజన్' కలుగుతున్నది. అందుకే ఉభయులకూ నిర్దేశకమయిన ఒక 'లక్షణం' ఏర్పడటానికే మొదట్నుంచీ నా ప్రయత్నం.

ఇక, చివరి అంశానికొస్తే—

నిజానికి వచన పద్యాన్ని వచనం నుంచి వేరు చేసేది దాని పాదాలేగాని, భావ గణాలు కాదు. సాంప్రదాయికంగా అనువర్తించే పద్యాల్లోనూ అంతే ప్రతి పాదాన్ని భ-జ-సాది గణాలుగా విభజించ వచ్చు. కాని, పాదాల నిర్మాణం మాత్రమే పద్యాన్ని వచనం నుంచి వేరు చేయగలుగుతున్నది. '... పదభాగాలలోవున్నా పాదపరిమితి పాటిస్తూ విషమ వృత్తాలు సృష్టించవచ్చుగాని, పాదాంత విరామంగాని ప్రాసమైత్రిగాని దెబ్బ తినకుండా ఒక వ్యాసాన్ని వృత్తంగా నిరూపిం చటం సాధ్యమయితుందనుకోను...' (పే. 98) అన్నారు రామారావు గారు. కాని. పాదాంత నియమం తెలుగులో లేదు. ప్రాసమైత్రి

సంస్కృతంలో లేదు. ఈ రెండు నియమాలు లేకుండా తెలుగులో 'దూతమత్తేభం' (రాయప్రోలు), 'చిత్రాంగద' (మల్లవరపు) రచింపబడ్డాయి. అక్కడ పాదపరిమితే ప్రధానమయింది – ఇది నవ్య మిగతావన్నీ ఐచ్ఛిక నియమాలు కాబట్టి. ఇక, భావ-భావాంశాలుగా విభజిస్తే వచనం పద్యం కాదు. అట్లాంటివి చాలా వుంది వచన పద్యప్రయోక్తలు వచన పద్యాలు కాని వాటిని గూర్చి అంటున్నట్టు 'వచనపు తుంటల పేర్పురే' అయితాయి. కాగా వచనపద్య పాదాల్లో ఉండే భావభార సమత్వం వ్యాసాన్ని విభజించటంవల్ల వచ్చేదే ముక్కల్లో ఉండదు. ఈ భావభార సమత్వం వచనపద్య పాదాల అడియందో, అంతమందో ఉభయుక్తమయ్యే అనురాణ-పునరుక్తి లేక భావస్ఫోరక పదాల నియత ప్రయోగంతో వ్యక్తమయితుంది. ద్వంద్వాలను వ్యక్తం చేసే పదాలు ఉభయ పాదాల్లో ఒకటొకటిగా ఉండటం ద్వారా వ్యక్తమవుతుంది. ఇదిట్లా ఉండగా బండి నాగరాజుగారన్నట్టు (చూ. అనుబంధం) వారు చెప్పిన మాత్రా సమత్వ విషయం అట్లా ఉంచితే, అంత్యప్రాసలు తోడ్పడుతయి. ఇంకా పాదాద్యక్షరాల యతి ప్రయోగం వల్లా, ప్రాసల వల్లా కూడా వచన పద్య పాదాలు వచనం నుంచి భేదిస్తయి. సాంప్రదాయిక పద్యాల్లో పద్యపాదానికి యతి ప్రాస నియమాలు నియామకాలయితున్నట్టు వచన పద్యంలోనూ చాపటానికి అభ్యంతరం లేదు భావ గణాలు పాద పరిమితిని సూచిస్తయి ఒకే భావగణం ఒకే పాదంలోంచి తరువాతి పాదంలోకి వ్యాపించకూడదని, పాదానికి పాదాంత విరామం తప్పనిసరి. ఈ విధంగా అవి – సూచిస్తయి. అయితే ఈ వివిధ నియమాలను పరిశీలించి, అనువుగా కొన్నిటిని నియతంచేసి, ఉదాహరణ పూర్వకంగా (ఇక్కడ అంతటి అవకాశం లేదుగాని) ప్రదర్శిస్తే, ఈ అంశాలన్నీను, సుస్పష్టమయితయి. ఈ విధమైన నియమాల పాటింపు వచన పద్యాన్ని నిర్మాణంలో వచనం కన్నా 'అసాధారణ'త్వాన్ని సంపాదిస్తయి. శ్రీ శ్రీ, కుందుర్తి, తిలక్ మొదలయినవారి వచన పద్యాల్లో ఈ విధమయిన వివిధ విధాల నియమాల పాటింపువల్ల కలిగిన 'అసాధారణ'త్వం పరిశీలించుకోవచ్చు. వచన పద్యంలో వాక్య నిర్మాణ దృష్ట్యా అసాధారణత్వం సాధించ

టానికి రామారావుగారు ఆలోచిస్తున్నట్టుగా – ఆ రీతిలో 'కొన్ని కొత్త విషయాలు,' (పే. 94) నిష్పన్నమయితే వాటిని గూర్చి మళ్ళా తరువాత పరిశీలించవచ్చు. కాగా శుద్ధ వచనవాక్యాలు ఎప్పుడు యథాతథ ప్రయోగంలో వచన పద్య పంక్తులుగా విభక్తం కానీ, వచన పద్యంగా నిర్ధారణానికి విశేష లక్షణాలు వచనంనుంచి అసాధారణత్వాన్ని సంతరించుకుంటాయనీ, కానీ, విపులంగా నిరూపించుకోదగిన అంశాలని మాత్రమే ప్రస్తుతానికి భావించవలసి ఉంటుంది

వచన పద్యానికి 'ప్రొటోటైప్'గా ఒక లక్షణం నిరూపిస్తాను.

1. వచన పద్యానికి నాలుగు పాదాలు. అంతకన్నా ఎక్కు-వయితే, మాలా వచన పద్యం. తక్కువయితే త్రిపాద్యాదులు.

2. భావంతో గాని, భావగణాలతో గాని పాదాలు ఏర్పడుతయి.

3. ఒక పాదంలో ఒక భావం గానీ, ఒకటి లేదా రెండు భావ గణాలు గాని ఉంటయి.

4 ఈ భావగణాలు ఒక పాదంలోంచి మరో పాదంలోకి వ్యాపించవు.

5. భావంతో గానీ, భావాంశంతో గానీ పాదం ముగుస్తుంది. పాదాంత విశ్రాంతి ఉంటుంది.

6. పాదాద్యక్షరాలకు యతి గాని, ప్రాస-అంత్యప్రాసలు గాని, అనుకూల-వ్యతిరేక భావ సూచక పదాలు గాని పాదాల భావ భావ సమత్వంకోసం ప్రయుక్తమయితయి.

వచన పద్యం ఆద్యంతంగా భావాలతో ఉంటే, ఆ రకంవి ఒక వర్గం, భావగణాలతోనే ఉంటే, రెండో వర్గం; వీటి కలగలుపుగా ఉంటే మూడో వర్గం. పాదాల్లో ఉండే భావగణాల సంఖ్యను బట్టి,

కలగలుపులోని భేదాలను బట్టి, పాద సంఖ్యను బట్టి ఈ వర్గాల్లో వివిధ స్వరూపాలు నిష్పన్న మవుతాయి. ఈ ధోరణిలో ప్రయత్నిస్తే ఒక 'సిస్టమ్' నిర్ధారిత మవుతుంది.

చివరి మాట --

వచన పద్యానికి నేను చెప్పిన లక్షణమే లక్షణం కావాల్నని గాని, కేవలం ఇది మాత్రమే నిర్దిష్ట మయిందని గాని వాదించే అతిశయం నాకు లేదు నాకు స్ఫురించిన ఒక పద్ధతిని సూచించటం. మాత్రమే నా తాత్పర్యం. దీన్ని బహుధా చర్చించి మార్పులు చేర్పులు చేసి ముందు ముందు నిష్కృష్టమైన లక్షణం రూపొంద వచ్చు. లేదా మరోపద్ధతిలో లక్షణం రూపొందవచ్చు. ఎట్లా అయినా నా కభ్యంతరం లేదు. అది నాకు సంతోషకరం. అయితే చిట్టచివరగా ఒకటే నా మనవి. వచన పద్యం 'పద్యం'. ఈ అంశం కాదంటూ, మరిచిపోతూ ఎంతగా వచన పద్యాన్ని గూర్చి ఆలోచించినా లాభం లేదు. వచన పద్యం 'పద్యం' అని మరిచిపోవటం నా సాధ్యం కాదు.

(రచనా కాలం : సెప్టెంబరు 1978)

అనుబంధం—1

# వచన పద్యం: ఒక పరిశీలన

—బండి నాగరాజు

పద్యం అనగానే దానికి పాదబద్ధత ఉండాలి. అన్నది మొదటి నియమం.

పద్యం యొక్క పాద నిర్మాణానికి 'ఛందోబద్ధమైన పద్ధతి' కూడా ఒకటి ఉండి తీరాలి అన్నది రెండో నియమం. దీన్ని 'పాదం యొక్క అంతర్నిర్మాణం' అనవచ్చు.

ఒక గతి ననుసరించి మాత్రల పరిమితిగానీ, గురు - లఘువుల నిర్దిష్ట వ్యవస్థగానీ, గణపద్ధతిగానీ-ఏదైనా సరే, ఒక పద్ధతి ననుసరించి - అదీ ఛందశ్శాస్త్రరీత్యా చెప్పబడ్డ పద్ధతే అయ్యుండాలి-పాదంయొక్క అంతర్నిర్మాణం-ఏర్పడుతుంది.

1. పాదానికి మొత్తం ఇన్ని మాత్రలుండాలి. ఫలానిచోట్ల గురువులు, లేక లఘువులు ఉండరాదు (లేక) ఉండవలెను అన్న విధినిషేధాలు ఒక పద్ధతి అంతర్నిర్మాణం.

2. పాదానికి మొత్తం ఇన్ని మాత్రలు; లయానుసారంగా, గతిభేదాన్నిబట్టి ఇన్నేసి మాత్రలకు విరుగుతూ, సమగతి విషమగతుల ననుసరించిన గురులఘువుల విధినిషేధాలతో గణవిభాగం చెప్పడం ఇంకొక పద్ధతి అంతర్నిర్మాణం, ఇది పరిభాషాబద్ధమైన శాస్త్రీయ పద్ధతి.

3. పాదానికి ఇరవై అక్షరాలుండాలి. 1, 4, 6, 10, 18, 16, 18, 20 సంఖ్యగల అక్షరాలు గురువులుగాను; తక్కినవి లఘు

ఈ సందర్భంగా అలౌకిక వైదిక వాఙ్మయ సంబంధి అయిన ఒకానొక మారుమూల సూత్రాన్ని ఆశ్రయించి ఋగ్వేద వ్యవస్థ (పఠనంలోనా? లేఖనంలోనా?) అర్థవశంగా ఉంటున్నది. వచన పద్య పాద వ్యవస్థ భావపరంగా ఉంటుంది కాబట్టి, ఇది గూడా ఛందశ్శాస్త్ర మర్యాదానుసారమే అని ఆధునిక లౌకిక సారస్వత సంబంధి అయిన వచన పద్యానికి ముడివెయ్యటం పద్ధతిగా లేదు. ఛందఃకారకు లెవరూ అర్థ - భావ వశంగా పాద వ్యవస్థను నిర్ణయించింది లేదు అల్లాంటిదే విషమ వృత్తాల ప్రస్తావన కూడాను. అల్లాంటప్పుడు ఇక ఛందస్సు కానిదేముంటుంది?

ఒక శుద్ధవచన భాగాన్ని - వ్యాసం గానీ, వ్యాపార ప్రకటన గానీ - భావగణాల పద్ధతి ననుసరించి, పాద బద్ధత పాటించి రాస్తే, లేదా అచ్చువేస్తే అది వచన పద్యమే అయ్యేటట్లయితే, వచనానికీ, వచన పద్యానికీ 'లేఖనంలోనే తేడా' ఉన్నట్లు గ్రహించవలసి వస్తుంది. అంటే, వచన పద్యాన్ని గూడా శుద్ధ వచనంగా, వరసగా రాసేసి— మార్చి వెయ్యవచ్చునన్న మాట. అప్పుడు ఛందోధర్మం ఎక్కడున్నట్లు?

పాద బద్ధత లేని 'దండకం' అంతర్నిర్మాణం వల్లే 'ఛందస్సు అయినట్లు, నిర్దిష్టమయిన అంతర్నిర్మాణం లేకపోయినా మాత్ర ప్రాయంగా ఒక పాద బద్ధత గల 'వచన పద్యం' ఒకటి మాత్రం సక్రృత్తుగానే అయినా ఉన్నది.

రచయిత తాను కల్పించుకొన్న కొన్ని నిబంధనలతో అలాంటి వచన పద్యం రాస్తున్నాడు. ఆ కల్పించుకొన్న నిబంధనలు ఛంద శ్శాస్త్ర మర్యాదానుసారాలు కావటం వల్లనే వాటిని పాటించిన వచన పద్యాలు 'ఛందస్సు' అవుతాయని చెప్పడం. నిర్దిష్టమైన అంత ర్నిర్మాణం లేనందువల్ల వచనంలాగే ఉండినా, మాత్రల పరిమితితో ఛందోధర్మానికి కట్టుపడే సూత్రప్రాయమైన పాద బద్ధతవల్ల అవి శుద్ధ వచనమూ; శుద్ధ పద్యమూ కాకుండా వచన పద్యం కావలసి ఉన్నదని భావించాలి.

పద్యాని కెన్ని పాదాలుండాలి అన్నది కవి యిష్టం. రెంటినుంచి పది పన్నెండుదాకా, లేదా ఎన్నయినా పెట్టుకోవచ్చు; కాని ఒకదాని కొకటి, లేక ఏ కొన్నిటితో నైనా మరికొన్నిటికి పాదాల్లో సామ్యం ఉంచుకోవాలి. ఒక పాదానికి ఇన్ని మాత్రలు; లేక కొన్ని పాదాలకు ఒక సంఖ్య, మరికొన్ని పాదాలకు ఇంకొక సంఖ్యగా మాత్రల పరిమితి - అని ఇట్లా కవి తాను కల్పించుకోవచ్చు. ఈ మాత్రా పరిమితిలో గూడా ఒకటీ అరా మాత్రలు హెచ్చు తగ్గులు ఉన్నా ఉండవచ్చు. అంత్య ప్రాసాది అలంకార నియమం ఏదో ఒకటి ఉండకపోతే ఇదిగూడా శుద్ధ వచనంలో అంతర్భవించే ప్రమాదం ఉన్నది. ఇటువంటి నిబంధనలతో రాసే వాటిని వచన పద్యాలని - ఛందో విభాగంగా - గ్రహించ వచ్చునని అభిప్రాయ పడుతున్నాను.

ఒక చిన్న ఉదాహరణ---

ఐదు పాదాల వచన పద్యం ఒకటి. దానికి మొదటి రెండు పాదాలు ఒకటిగా - 15 మాత్రల పరిమితితో ఉంటాయి. తరువాతి రెండు పాదాలు ఒకటిగా - పన్నెండు మాత్రల పరిమితితో ఉంటాయి. చివరి పాదం పై నాల్గింటికి భిన్నమైనా, చివరి రెండు పాదాల పరిమాణంతో ఒకటిగా ఉంటున్నది. తొలి రెంటికి, మలి రెంటికి అంత్య ప్రాసం; తొలి రెంటిలో చివరి పాదానికి అంత్య ప్రాసం కల్పించ బడ్డవి. ఇది అంతర్నిర్మాణం లేని పాదబద్ధత మాత్రం గల వచన పద్యం. ఇందులో మూడో పాదంలో ఒక మాత్ర లోపించడం ఋటితని స్ఫురించక పోవచ్చు.

ఆపినాని వొదిలేసిన చలం
అందుకున్నాడు అరుణాచలం
గుడిసెపాటిది పోయింది
గుడిపాటిది వచ్చింది
క్వశ్చన్‌గా పుట్టి ఫుల్‌స్టాప్ అయ్యాడు నిశ్చలం.

ఇట్లా ఛందో విభాగంగా గ్రహించదగ్గ వచన పద్యాలు కొన్ని లేకపోలేదు. ఐతే తుదముట్టా ఒక పద్ధతిగా రాసిన వచన పద్యాలు ఏపాటి ఉన్నాయో చూడవలసి ఉన్నది. ఆరుద్రగారి ఇంటింటి పద్యాలు' ఈ కోవకు సన్నిహితమైనవి.

వచనపద్యాన్ని గురించి 'భారతి'లో సంపత్కుమార, రామలింగప్పగార్ల సిద్ధాంత వ్యాసాలు చూచిన తర్వాత నాకు తోచిన రెండు మాటలు మనవి చేశాను. వారికి నా కృతజ్ఞతలు.

భారతి, ఏప్రిల్ 1973 పే. 61-66)

అనుబంధం - 2

# వచన పద్యం: ఛందోరీతి

— సంపత్కుమార

## పాద విభజన

భాషలో స్థూలంగా వచన రచనా, అనీ పద్య రచన అంటే ఛందోబద్ధ రచన అనీ రెండు తెగలు కనిపిస్తాయి. ఏదయినా ఒక రచన, ఆ రెండు తెగలలో దేనికి చెందుతుంది అని నిర్ణయించవలసినప్పుడు ఒక పద్ధతిని అనుసరించవలసి ఉంటుంది. ప్రధానంగా రచన పాద విభజనతో నిర్మితమయితే ఛందో విభాగానికి చెందుతుందనీ, ఆ విధమైన విభజన లేకపోతే వచన విభాగానికి చెందుతుందని చెప్పవలసి వుంటుంది. ఈ దృష్టితో పరిశీలించితే 'వచన పద్యం' అనే ప్రక్రియ ఛందో విభాగానికి చెందుతుందని స్పష్టమవుతున్నది. 'వచన పద్యం'లో పాద విభజన ఆద్యంతమూ కన్పించడమే దీనికి కారణం.

అయితే పాద విభజన ఏ విషయాలను ఆధారం చేసుకొని జరుగుతుందనేది విచారించవలసి ఉంటుంది. ఛందస్సు యొక్క ప్రథమావిర్భావ కాలంలో తత్తద్రచయితల మనస్సులలో గల లయానుకూలమయిన అస్పష్ట, అవ్యక్త భావన మాత్రమే పాద విభజనకు కారణం అని చెప్పవలసి ఉంటుంది. కాని తరువాతి కాలంలో ఆ రచన ప్రాధాన్యాన్ని గుర్తించిన లాక్షణికులు వాటిని వర్గీకరించి కొన్ని నియమాలను రూపొందించడం జరుగుతుంది. ఆ నియమాలు కూడా కాలక్రమాన్ని అనుసరించి వికాస సంకోచ భావాలను పొందడం కూడా జరుగుతుంది. ఈ విధంగానే మన నాటికి కొన్ని స్థిరంగా భాసించే నియమాలు ఏర్పడి ఉన్నాయి కాబట్టి, మనం వాటిని ఆధారంగా చేసుకొని విచారించవలసి ఉంటుంది.

ఛందస్సులో కొన్ని అక్షర ప్రాధాన్యం గల గణాలు, మాత్రా ప్రాధాన్యం గల గణాలూ ఏర్పాటు చేయబడినవి. అయితే అక్షర గణాలలో ఆయా గణాలలో ఉండవలసిన గురు లఘు వర్ణాల క్రమం నియతంగా ఉంటుంది. కాని, మాత్రా గణాలలో మాత్రా సంఖ్యకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. ఉదాహరణకు ఇంద్ర గణాలు ఆరు అని ప్రస్తుత వ్యవహారం. వీటిలో నాలుగు చతుర్మాత్రా గణాలు, రెండు పంచ మాత్రా గణాలు. ఈ ఆరింటిలో విడివిడిగా ఒక్కొక్క గణానికి గురు లఘు వర్ణ క్రమాలు నిర్ణీతాలే కాని. ఆరింటికీ సమానత్వం లేదు. అయినా వీటన్నిటినీ కలిపి "ఇంద్ర గణాలు" అనే అంటారు ఈ యీ గణాల సంఖ్య ఆధారంగా పాదాలు ఏర్పడుతాయి. అక్షర గణ సంఖ్యా ప్రాధాన్యం గల పద్యాల్లో, నాలుగు పాదాల్లోను సమ వర్ణ సంఖ్యా, సమ గురు లఘు వర్ణ క్రమం ఉంటుంది. వీటిలోని అసమత్వమే ప్రధానంగా 'వచన పద్యం' లో కనిపిస్తుంది. కంద పద్యంలోని పాద స్వరూపంలో అసమత్వం ఉన్నది. ఆటవెలదిలో కూడా అలాగే ఉన్నది. అయితే ఈ అసమత్వం కొన్ని నియమాలుగా పూర్వమే నిర్ణీతమైంది కాబట్టి అంగీకృత మవుతున్నది. 'వచనపద్యం' ఆధునికమయింది కాబట్టి నిర్ణీతం కాలేదు.

మాత్రా గణాల స్వరూపంలో కొంత అనియతత్వం ఉన్నదన్న విషయం పైన వ్యక్తం చేయబడింది. ఈ అనియతత్వం గణాల నిర్ణయం వల్ల వచ్చిందని చెప్పవచ్చు. ఆ విధంగా కాక మాత్రా సంఖ్యను మాత్రమే ప్రధానం చేస్తే, పై అనియతత్వం పోవచ్చు గాని, పాదానికి రావలసిన 'తూగు' మాత్రం దెబ్బతినడానికి అవకాశం ఉన్నది' అందువల్ల మాత్రాగణాలను, మాత్రా సంఖ్యనూ గాక కేవలం 'తూగు. ను ప్రధానంగా స్వీకరిస్తే, ఎన్ని అనియతత్వాలున్నా, పద్యపు నడక మాత్రం సంరక్షింప బడుతుంది. అందుకే కుందుర్తి గోపాల చక్రవర్తి 'కలంకలలు' పత్రికలో ఇలా అన్నారు "వచన గేయాన్ని కుంటు పడనీయకుండా ఆద్యంతం చదివేటట్లు చేయగల సొగసు, విసురు అల వరుచు కోవడం ఛందోబద్ధమైన పద్యరచన కంటె కష్టమైన పని... వచన గేయంలో ఒక్క ఉపమానాల విషయంలోనే. కాదు, ఇతర

సందర్భాలలో కూడా, ఈ 'విసురు' ఒక ముఖ్య లక్షణంగా నేను ప్రతిపాదిస్తున్నాను" నిజానికి ఛందస్సుకు ఈ నడక, తూగు మాత్రమే ప్రధానం గదా! దాని కొరకే, అంతే ఆ నడకల వైవిధ్యం కొరకే అనేక రకాలయిన క్రమాలేర్పడి, పలువిధాలయిన పద్యాలు రూపొందిన వని ఛందస్తత్వ పరిశీలకులకు స్పష్టమయ్యే విషయమే.

ఈ దృష్టితో ఏదో విధమయిన ఒక నడకను, తూగును ఆధారం చేసుకొని వచన పద్యంలోని పాదాల నిర్మాణం సాగుతున్నది. పాదాలుగా విభజింపడం వల్లనే ఈ తూగు స్పష్టమవుతుంది. ఈ ప్రధానమయిన విషయాల ననుసరించి పాద విభజన కల్గిన 'వచన పద్యం' ఛందస్సు విభాగంలోనే చేరుతుంది.

## భావ గణాలు

మాత్రల, మాత్రాగణాల ఒక నియతక్రమం వల్ల పాదానికి తూగు వస్తున్నది. కాని, అది లేకుండా రావడానికి వీలున్నదా? అనే సందేహం ఇక్కడ కలుగుతుంది. వస్తుందనే సమాధానం. దీనికి మరొక రీతి ఉన్నది. ఇందులో తూగును కల్పించేది మాత్రాదులు గాక, భావమే. ఈ మాత్రా, మాత్రాగణాదులు పాదాలకు 'సమభారం' కలిగిస్తుండడం వల్ల తూగు వస్తున్నది గదా! అదేరీతిలో భావం వచన పద్యపాదాలకు సమభారం కలిగిస్తుంది. ఉదాహరణకు:

ప్రతి మాటకీ శక్తి ఉంది; పదును ఉంది
ప్రతి మాటకీ అర్థం ఉంది; ఔచిత్యం ఉంది

తిలక్–'నవత – కవిత'

పైవి రెండు పాదాలు. ఈ రెంటికీ సమంగా గణ విభజన గానీ, మాత్రా విభజనగానీ మొదటి నుండి చివరిదాకా కుదరదు. కాని ఈ రెండింటికీ విలక్షణ మయిన 'తూగు' స్ఫురిస్తూనే ఉంది. వీటికి ఇదెల్లా వచ్చింది? ఒక భావాన్ని ప్రస్తరించడంలో పై రెండూ ఒకే విధమయిన పద్ధతి నవలంబించి ఉండడం గమనించ వలసిన విషయం. 'మాత్రల బట్టి, అక్షరాల బట్టీ గాక ఇక్కడ అర్థాన్ని బట్టి గణవిభజన అభాస రూపంగా

చేయవచ్చు. 'ప్రతిమాటకీ' అనేది ఒక గణం. 'శక్తి ఉంది' అనేది మరొక గణం 'పదును ఉంది' అనేది వేరొక గణం. ఈ విధంగా మొదటి పాదాన్ని విభజిస్తే, రెండవ పాదంకూడా, మాత్రల, అక్షరాల దృష్ట్యా మొదటి దానితో సమానం కాకున్నా పై రీతి విభజనను బట్టి సమాన మవుతుంది. ఇక్కడ ఇవి భావాన్ని బట్టి విభజింప బడిన పాదాలు, అదే విధంగా

"నీకు కలంవుంది, ప్రజలకు బలంవుంది
నీకు హృదయం వుంది, ప్రజలకు ఉదయం ఉంది"
'ఆశ'లో కుందుర్తి

రెండు పాదాలుంటే ఉదాహరణ స్పష్టమవుతుందని ఇలా చూపించడమయింది కాని. ఒకే ఒక పాదానికిగల తూగునుగూడా, ఉదాహరణల దృష్ట్యా చూపవచ్చు. మరొక ఉదాహరణ:

"దూకండి సముద్రంలోకి
ప్రాకండి కీర్తిలోకాలలోకి
బ్రతుకును గుప్పిట్లో బంధించండి
భయంమీద ఆగ్నేయాస్త్రం సంధించండి"
—'ఆశ'

అనే చోట అంత్య ప్రాసనియమము వల్లా, క్రియా పదములను పాదములకు ముందు వెనుకల సంధించడం వల్లా, మొత్తము మీద, పంక్తి సామ్యము, భావసామ్యము వల్లా "ఊపు" సాధించ బడింది. సర్వత్రా ఇదే విధానం నిశ్చితంగా ఉంటుందని చెప్పడానికి వీలులేదు. పద్య పద్యానికి గణక్రమం మారినట్లుగా 'వచన పద్యాల'లో కూడా ఈ మార్పు ఉంటుంది ఏ 'వచనపద్య' గమనాన్ని ఆ వచన కవులు తమ ప్రతిభాంశమును బట్టి యీ 'విసురు' సాధించడానికి కొన్ని ప్రత్యేక పద్ధతులను ఎన్నుకొంటారు. ఈ వైవిధ్యము లేకుండా అంతా ఒకే మూసలో పోసినట్లున్నా చెవికి, మనసుకూ సొంపుగా ఉండదు కదా! శార్దూలాది వృత్తముల వైవిధ్యమును ఊతగా తీసుకొని కావ్యములతో పూర్వకవులు రసపోషణము చేసి

కొన్నిట్లు ఆధునిక కావ్యములలో కూడా ఈ వివిధపద్ధతుల ద్వారా ఆయా రసాలకు అనుగుణమైన పద్ధతులను నిర్మించుకోవచ్చు.

పాదవిభజనకు నిశ్చితంగా నియమం చేయడానికి వీలు చాలా తక్కువ అని ఇంతకు ముందు వ్యక్తం చేయబడింది. అయితే నిశ్చితమైన ఒక నియమం లేకున్నా, ఒక పద్ధతి అంటూ ఉన్నట్లు చెప్పకోవచ్చు. సామాన్యంగా భావం పూర్తి కావడంతో పాదంకూడా పూర్తి అవుతుంది. ఒక్కొక్కప్పుడు భావం పూర్తి కాకున్నా భావాంశం పూర్తి అయినా కూడా పాదం పూర్తి కావచ్చు. భావాంశాలను బట్టి ఒకే భావం అధిక పాదాలుగా కూడా విభక్తం కావచ్చునన్న మాట. ఉదాహరణకు :

> "విప్పచ్చుని బాణంలా విచారం దూసుకుపోయిన గుండెతో
> దిగులుతో, దైన్యంతో, బరువుతో, బాధతో
> బ్రతుకు బజార్లో నిలబడింది"
>
> —*కుందుర్తి 'కాలం ఆగిపోయింది'*

ఇక్కడ మూడు పాదాలున్నవి 'విచారం దూసుకుపోయిన గుండెతో బ్రతుకు బజార్లో నిలబడింది' అనేది ఒక భావం. ఇందులో రెండు అంశాలున్నవి. వాటిలో ప్రధానమైంది 'బ్రతుకు బజార్లో నిలబడడం' ఇది ఒక అంశం. ఈ నిలబడడం వట్టిగా కాదు 'విచారం దూసుకపోయిన గుండెతో' ఇది రెండవ అంశం. ఈ రెండవ అంశానికి ఉపమానం 'విప్పచ్చుని బాణం'. ఈ ఉపమానంతో కలిసి రెండవ భావాంశం ఒక పాదంగా ఏర్పడింది. ఆ 'దూసుకపోయిన'ప్పుడు కలిగిన మార్పులన్నీ అనుబంధ భావాంశం. ఇవన్నీ ఒక పాదంగా ఏర్పడ్డాయి అయితే మూడు పాదాలుగా మాత్రమే రచయిత ఈ భావాన్ని విభజించాడు. కాని ఇంకా ఎక్కువ పాదాలుగా కూడా విభజించవచ్చు. మొదటి పాదాన్ని ఉపమానంవరకు ఒక పాదంగా రెండవ పాదంలో చెప్పబడ్డ నాల్గు మార్పులను నాలుగు పాదాలుగా విభజించవచ్చు. అప్పుడు పై ఖండం త్రిపదగా గాక సప్తపదగా ఏర్పడుతుంది. కాని ఎల్లా పాద విభజన చేయవలెననేది, రచయిత అభివ్యంజనలో 'శక్తి'ని తీసుకువచ్చే విధంగా నిర్ణయించుకోవలసిందే.

దీన్నిబట్టి ఛందః పరమార్థం దృష్ట్యా పద్యానికి కావలసిన లయ తూగు లేదా గమనం కేవలం అక్షర, మాత్రల క్రమ సమావేశం వల్లనే గాక, భావాభివ్యంజనలోని ఒక వైలక్షణ్యాన్ని అనుసరించిన పదాల కూర్పు ద్వారా చేసే పాద విభజనవల్ల గూడా కలుగుతుందని స్పష్టమవుతున్నది. అంటే రచయిత యొక్క ఊహాలోనే, భావం అభివ్యంజనా పరిధిలోకి వస్తూనే, భాషా ప్రయోగ రీతిగా తూగును స్వయంగా సంపాదించుకోవడం జరుగుతుందన్న మాట. ఇది వచన పద్యానికి ప్రధానమయిన మూల విషయం. దీన్ని ఆధారంగా చేసుకొని వచన పద్యం పలు రీతులలో సాగుతూ ఉన్నది. ఇందువల్లనే, అక్షర మాత్రాగణ ప్రాధాన్యం ఉన్న సాంప్రదాయిక ఛ్ఛందస్సులకు ఒక నియత నియమం నిర్ధరింపబడ్డట్లు వచన పద్యానికి నిశ్చిత పరచడానికి వీలులేకుండా పోతూ ఉన్నది.

## పాద సంఖ్యా నియమం :

ఈ వచన పద్యం యొక్క పాద సంఖ్య కూడా అనియతమయింది. వైదిక ఛ్ఛందస్సులలో పాద సంఖ్య సరిగా, నియతంగా కనిపించదు. కాని, లౌకిక ఛ్ఛందస్సులలో మాత్రం పద్యం నాలుగు పాదాలతోనే ఉండాలనేది నియతం చేయబడింది. ఇదే నియమం ప్రాంతీయ భాషా ఛ్ఛందస్సులలోకి గూడా వచ్చింది మన తెలుగు ఛందస్సులలో గూడా అదే నియమం. కాని, కొంతమంది కవులు దానిని ఉల్లంఘించడం అక్కడక్కడ జరిగింది. పద్యానికి అధికంగా మరొక పాదాన్ని చేర్చి 'పంచపాది' అనడం జరిగింది. ఇంకా అధికంగా పాదాలు చేర్చి 'మాలిక' అనడం జరిగింది. ఇంతేకాక ద్విపద విషయం ఇదివరకే చెప్పబడింది. త్రిపద, షట్పద వంటి మూడు, ఆరు పాదాలు గల ప్రత్యేక పద్యాలుగూడా ఏర్పడినాయి. ఇంకా లక్షణం స్పష్టంగా చెప్పబడని, ముద్దు పళని వ్రాసిన 'సప్త పదులు' కూడా ఉన్నాయి. వీటన్నిటినీ చూస్తే పాద నియమం చాలా అనియతంగా సాగినట్లు స్పష్టం. వచన పద్యంలో కూడా పాద సంఖ్య నియతం గాదు. ఒకటి నుండి చాలా పాదాలు గల వచన పద్య ఖండిక లున్నవి.

ఇక్కడ ఒక విషయం చెప్పవలసి ఉన్నది. వచన పద్యంగా చెలామణి చేయబడుతున్న రచనలు కొన్ని, మాత్రా ఛ్ఛందస్సులకు— రగడ, తద్భేదాలు, మొదలైనవాటిని — అక్రమంగా విరిచి పేర్చబడి కన్పిస్తున్నవి. అల్లా రచించడంవల్ల, అవి 'వచన పద్య' స్వరూపం విషయంలో అపోహలు కలిగించడానికి కారణాలవుతాయి. కాబట్టి ఆయా రచయితలు వాటి విషయంలో 'వచన పద్య' స్థితికి భంగం రాని విధంగా రచన చేయడం అవసరం.

## మిశ్రమ వచన కవిత :

అయితే, దీర్ఘమయిన వచన పద్యంలో చెదురుగా, కొంత విశ్రాంతికోసమన్నట్టుగా, లేక చమత్కారంకోసమన్నట్టుగా, లేదా ఏదో ఒక విశేష భావస్ఫూర్తి కన్నట్లుగా, రెండు మూడు మాత్రా ఛందః పాదాలను రచయిత లుపయోగించడం అక్కడక్కడా చూడవచ్చు. ఉదాహరణకు :

"పునర్జన్మ ఎత్తాలి నీవు ; తప్పదు సుమీ ఇక
మరో మనోలోకాన్ని కల్పించుకోవాలిప్పుడు
దుఃఖంతో ఆగిపోక కష్టంతో నిల్చిపోక
పతనంతో పారిపోక మరణంతో మారిపోక"

—మాదిరాజు రంగారావు 'అధునా'

ఇందులో చివరి రెండు 'తురగ వల్గన రగడ'కు చెందినవి. యతి, ఆది ప్రాస లేకున్నా రగడకు ప్రధానమయిన అంత్యప్రాస పిటికుంది. పునర్జన్మ ఎత్తడం కోసం ఉత్సాహాన్ని కలిగించేందుకు చెప్పుతున్న భావంతోబాటు, పరిచితమయిన నడకను రచనకు సమకూర్చి స్థైర్యం చెబుతున్నట్టుగా అనిపిస్తుందిక్కడ. ఈ విశేష భావస్ఫూర్తి కొరకు ఈ విధంగా మాత్రా ఛందః పాదాల ప్రయోగం జరిగినట్లు చెప్పవలసి ఉంటుంది. ఇదే విధమయిన ప్రయోగం 'అదృష్టాధ్వగమనం' (తిలక్) మొదలయిన కొన్ని రచనలలో గమనించవచ్చు. కాని, ఇల్లాంటి ప్రయోగాలు మాత్రం చాలా అరుదుగా ఉన్నాయి.

[సంవత్కుమార (1967) నుంచి]

# ఉపయుక్త గ్రంథ, వ్యాస సూచి


1. ఆంజనేయులు, కుందుర్తి (1958) 'హృదయం విప్పి' (గోపాల చక్రవర్తి 'కలం కలలు' పీఠిక) హైదరాబాదు: నవ్య సాహితీ సమితి.
2. — (1965) 'నా మతం' (శీలా వీర్రాజు 'పొడిగట్టిన సూర్యుడు' పీఠిక) హైదరాబాదు: సుషమా.
3. — (1967ఎ) 'ఒక మంచి ప్రయోగం' (సి. వి. కృష్ణారావు 'వైతరణి' పీఠిక) హైదరాబాదు: ఫ్రీవర్స్ ఫ్రంట్.
4. — (1966బి) 'నాలోని నాదాలు' హైదరాబాదు: ఫ్రీవర్స్ ఫ్రంట్.
5. — (1969) 'వర్తమాన సాహిత్యం: పోకడలు' ఆంధ్రపత్రిక సౌమ్య సంవత్సరాది సంచిక.
6. ఆంజనేయులు, కుందుర్తి & గోపాల చక్రవర్తి (సం. 1967) 'వచన కవిత: వివిధ కవుల పథాలూ, దృక్పథాలూ' హైదరాబాదు: ఫ్రీవర్స్ ఫ్రంట్.
7. కాంతారావు, టి. ఎల్. (1969) 'తెలుగులో వచన కవిత' భారతి, నవంబరు.
8. నరసింహశాస్త్రి, నోరి (1971) 'వచన కవిత': అభిమానుల అత్యుక్తులు, భారతి, ఏప్రిల్.
9. నరసింహారెడ్డి, వే. (1968) 'వచన కవిత' పుస్తక ప్రపంచం సెప్టెంబరు.
10. నారాయణరెడ్డి, సింగిరెడ్డి (1967) ఆంధ్ర కవిత్వము: సంప్రదాయము, ప్రయోగము. హైదరాబాదు: సొంత ప్రచురణ.

11. మాధవశర్మ, పాటిబండ (1966) 'ఆంధ్ర మహాభాగవతము: ఛందః శిల్పము' హైదరాబాదు: సొంత ప్రచురణం.

12 రంగారావు, మాదిరాజు (1969) 'యుగ సంకేతం' వరంగల్లు, సాహితీ బంధు బృందం.

13. రమణారెడ్డి, కె. వి. (1964) 'తెలుగులో వచన కవిత్వం' భారతి, జూన్.

14. — (1967) 'వచన కవిత: అవరోధాలు, అవకాశాలు'. (6 వ అయిటంలో ఇచ్చిన పుస్తకంలో).

15. రామమోహనరావు, అద్దేపల్లి (1969) 'వచన గేయం: అంతస్తత్వం'. *జనధర్మ - 1.*

16. రామారావు, చేకూరి (1971) 'భాషా శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం.' యస్. సి. యస్. వేంకటాచార్యులు & ఎ. రామేశ్వర శర్మ (సం) 'శారదా సంజీవము' లో. సికింద్రాబాదు: గోలి ఈశ్వరయ్య.

17. వర వర రావు, పెండ్యాల (1967) 'స్వచ్ఛంద కవిత్వంలో వస్తువు' (6 వ అయిటంలో ఇచ్చిన పుస్తకంలో).

18. విశ్వం, అరిపిరాల (1961) ప్రాచీనాలంకారికుల ధ్వనికీ, ఆధునిక కవిత్వంలోని భావ లయకూ గల సాదృశ్య వైషమ్యాలు. *కృష్ణా పత్రిక*, జనవరి.

19. శ్రీనివాసరావు, శ్రీరంగం (1939) నేటి తెలుగు కవిత: కొత్త పోకడలు. *భారతి*, ఫిబ్రవరి.

20. సంపత్కుమార, కోవెల (1962) 'తెలుగు ఛందో వికాసము' వరంగల్లు: కులపతి సమితి.

21. — (1965) 'వచన పద్యం: దాని స్వరూపం' భారతి, జూన్.

22. — (1967) 'వచన పద్యం: ఛందోరీతి'. (6 వ అయిటంలో ఇచ్చిన పుస్తకంలో).

23. — (1968) 'వచన పద్యం : దాని పేరు' జన ధర్మ, కీలక సంవత్సరాది సంచిక.

24. --- (సం) (1970) 'చేతనావర్తం-2' వరంగల్లు. సాహితీ బంధు బృందం.

25. సీతాపతి, గిడుగు (1921) 'అనంతుని ఛందస్సు'కు 'ఉపోద్ఘాతము'. మద్రాసు : వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్స్.

26. — (1961) 'తెలుగు ఛందోరీతులు' హైదరాబాదు: ఆంధ్ర సారస్వత పరిషత్తు.